# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ముసుగు మనిషి
రచన : వసుంధర

## మూడు నాణేలు
రచన : బొమ్మిడి అచ్చారావు

## రాక్షసి పక్షి
రచన : మోహన్

## సంఘటనలు కదిపే పాత్రలు
రచన: ఎమ్. వి. వి. సత్యనారాయణ

రక్తపు టేర్లు - ఆరవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—107
నవంబర్, 1982
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. పీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
కాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# ముసుగు మనిషి

వసుంధర

కొత్తగా రాజకీయాల్లోకి దిగాను నేను.

నాకు ముకుందం రాజకీయ గురువు. అతడిది అధికార పక్షం. ప్రముఖులందరూ అతడిని అభిమానిస్తున్నారు. అందువల్ల అతడి పని చాలా బాగుంది. ఎన్నో సేవా సంస్థలకు విరాళాలు పోగుచేసే బాధ్యత అతడిమీద పడింది. అతడా పని ఎంత సక్రమంగా చేశాడంటే— వేలు వస్తాయనుకున్నచోట లక్షలు, లక్షలు వస్తాయనుకున్నచోట్ల కోట్లు వచ్చాయి. ఈ వ్యవహారంలో అతడికి బాగా మిగిలిందని ప్రచారం వచ్చింది.

అతడి సంగతెలాగున్నా అతడి అనుచరుడిగా నేనో రెండు లక్షలు సంపాదించుకోగలిగాను. అందువల్లనే అతడంటే నాకు మంచి గురి.

అతడిమీద ప్రారంభమైన దుష్ప్రచారం గురించి నేను కలవరపడ్డాను. కానీ అతడు మాత్రం వీసమెత్తు కూడా చలించలేదు.

స్వార్థం లేనిదే మనిషి ఎవరికీ సాయపడలేడు. ఏ స్వార్థమూ లేకుండా ఓ మూల కూర్చునే మనిషికంటె ఓ లక్షరూపాయలు తిని—పదిలక్షల మందికి సాయపడ గలిగినవాడే మంచి మనిషి. ముకుందం కారణంగా ఇప్పుడు కోట్లాది ప్రజలకు మేలు జరుగుతుంది. అందువల్ల అతడో కోటి రూపాయలు తిన్నా తప్పులేదు. అయితే అతడికి మరీ అంత అత్యాశలేదు.

రాజకీయాల్లో ఎన్ని మంచి పనులు చేసినా తొలుత దుష్ప్రచారం ప్రారంభమవుతుంది. చేసిన పనులకు సత్ఫలితాలు కనబడుతూంటే క్రమంగా ఆ ప్రచారాలకు విలువ పోతుంది. అతడు గౌరవించబడతాడు.

ఒకవేళ మనిషి నిజంగా అవినీతికి పాల్పడినా రాజ కీయాల్లో అదేమీ తప్పుకాదు, ప్రమాదమూ కాదు. పెద్ద నాయకుల అభిమానం, ఆశీర్వాదం—రెండూ ముఖ్యం. ముకుందానికి అవి ఉన్నాయి.

ముకుందం తను బాగుపడుతూ, కోట్లాది ప్రజలను బాగుచేస్తూ, నాబోటి కొందరు అనుచరులను కూడా బాగు చేస్తున్నాడు. ఇది చాలా గొప్ప విశేషం. అతడంటే నా కెంత ఇష్టమంటే బ్రతికున్నంత కాలం అతడికే అను చరుడిగా ఉండాలని తీర్మానించుకున్నాను. అయితే నా తీర్మానానికింత త్వరగా ఎదురుదెబ్బ తగులుందనుకోలేదు.

అతడి సేవాసంస్థల మీద దుష్ప్రచారం ముమ్మర మైంది. ఆరంభంలో నాయకులతడిని సమర్థించారు. కానీ అతడు సేవా సంస్థలకోసం చాలామందిని బెదిరించి, బ్లాక్ మెయిల్ చేసి డబ్బు తీసుకున్నట్లూ—ప్రజాస్వా మ్యంలో ఇలాంటి అన్యాయాలు కొనసాగనివ్వరాదనీ మా పార్టీలోనే అలజడి ప్రారంభమైంది. వసూలు చేసిన

నిధుల అకౌంట్ సరిగ్గా లేదని మరికొందరు ఆరోపించారు.

ఈ రెండో ఆరోపణ గురించి నాయకులు పట్టించుకోరు. ఎందుకంటే వసూలైన డబ్బులో కొంత ఎలాగూ పార్టీ నిధులకింద వెళ్ళిపోతుంది. అప్పుడే కొంత మా వంటివారి జేబులోకీ వస్తుంది.

మొదట్లో ముకుందం దేనికీ లెక్క చేయలేదు. కానీ ఈ విషయమై దేశంలో ఊహించని సంచలనం కలిగింది. అందుకు కారణం అతడి అవినీతి పరిమాణం కాదు. శత్రువులు. ప్రజల్లో అతడికేర్పడిన పలుకుబడినీ, విరాళాల పేరుతో అతడు స్వంతానికి సంపాదించుకున్న ఆస్తినీ, సామర్థ్యంతో అతడు చూరగొన్న నాయకుల అభిమానాన్నీ—చూసి భరించలేక చాలామంది అతడిని పడగొట్టాలనుకున్నారు.

మనం పైకి వెళ్ళడం కష్టం. కానీ పైకి వెళ్ళినవాడిని పడగొట్టడం ఎంతో సులభం. మనతోటివాడు మనకంటే ఉన్నత స్థాయికి పోతున్నపుడు, మనకు అతడితో సమంగా కదిలే శక్తి లేనప్పుడు అతడిని వెనక్కులాగడమే మంచి ఉపాయం.

అతడి శత్రువులది చేశారు. అతడి కారణంగా పార్టీలో క్రమశిక్షణ పోతున్నదనీ, పార్టీకి చెడ్డపేరు వస్తున్నదనీ, తక్షణం అతడిపై విచారణ సంఘాన్ని నియమించాలనీ—వారు ప్రముఖ నాయకులపై ఒత్తిడి తీసుకుని వచ్చారు.

ఈ విధంగా జరిగేక—పార్టీ ప్రముఖుల్లో సంచలనం కలిగింది. అతడినీ, అతడి శత్రువులనూ ఓ వేదికమీదకు తెచ్చి సమన్వయం చేసే ప్రయత్నాలు జరిగాయి. అతడి మీద విచారణ సంఘం నియమించాల్సిన అవసరం

తప్పింది. అతడు కొంత కాలం సేవా సంస్థలకూ, రాజకీయాలకూ దూరంగా ఉండాలి.

విధిలేక ముకుందం అంగీకరించాడు. అయితే ఇందులోని ప్రమాదాన్ని అంత తెలివైన ముకుందమూ పసిగట్టలేకపోయాడు.

ఈ ప్రపంచం మిధ్య అన్న విషయం అందరికీ తెలుసు. అయినా అంతా మాయలో పడిపోతూంటారు. రాజకీయాలు మోసాల పుట్ట అని తెలిసీ ముకుందం కూడా దెబ్బతిన్నాడు.

అతడు సేవాసంస్థలనుంచి తప్పుకుని, రాజకీయాలకు దూరంగా ఉండడం ప్రారంభించిన కొద్ది మాసాల్లోనే ప్రజల్లో అతడి పలుకుబడి తగ్గిపోయింది. వార్తాపత్రికల్లో అతడి పేరు కనిపించడం మానేసింది.

అలా కొన్నాళ్ళు జరిగేక అన్ని విధాలా అతడి ప్రాబల్యం నశించేక—మళ్ళీ అతడి శత్రువులు విజృంభించి—అతడిపై విచారణ సంఘం నియామకం గురించి ఒత్తిడి తీసుకురాసాగారు. ఈసారి వారి ఒత్తిడి ప్రభావం పని చేసింది.

ముకుందంపై విచారణ సంఘం నియమించడానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఈ వార్త అన్ని వార్తాపత్రికలలోనూ మొదటి పేజీల్లో వచ్చింది.

## 2

ఈ వార్త చూసి కలవరపడింది నేను. అతడి అవినీతిలో నాకూ భాగముంది.

అర్జంటుగా ముకుందాన్ని కలుసుకున్నాను. అతడూ కలవరపడుతున్నట్లే అనిపించింది.

"నాయకులు నన్నిలా మోసం చేస్తారనుకోలేదు.

నేనేం చేసినా నా ఒక్కడికోసం చేయలేదు. కోట్లాది ప్రజలకోసం శ్రమపడ్డాను. అందులో నేను లాభం పొందితే — నాకంటే ఎక్కువ లాభం నాయకులకు వచ్చేలా చేశాను. నాకే ప్రమాదమూ లేదని అన్ని రకాలుగా హామీ ఇచ్చి, నన్నిప్పుడు అసహాయుడిగా గ్రహించి— ఇలా దెబ్బతీయాలని చూస్తున్నారు. ఎంత అన్యాయం?" అన్నాడతను.

ప్రజల సంగతి ఎలా ఉన్నా నాకూ ముకుందానికీ సంబంధించి అది అన్యాయమే మరి!

"ఇప్పుడేం చేయాలి?" అన్నాను కంగారుగా.

"చేతులు ముడుచుకు కూర్చోడానికి ఇవి గాజుల చేతులు కావు—" అన్నాడు ముకుందం కోపంగా.

"ఏదైనా ప్లాను వేశావా?" అన్నాను.

"దీనికి ప్లానెందుకు? నాయకులు నన్నో ఆటబొమ్మ కింద విసిరేయాలనుకుంటే అది జరిగే పనికాదు. అంతా తోడు దొంగలే కదా! నాకు పెద్ద పెద్దవారి గురించి కూడా ఎన్నో రహస్యాలు తెలుసు—" అన్నాడు ముకుందం.

"అయితే వాళ్ళను కలుసుకుని బెదిరిస్తావా?" అన్నాడు.

"వాళ్ళను కలుసుకుని మాట్లాడాలనే అనుకున్నాను. అసలు కలుసుకోవడానికే వీలుకాలేదు చాలామందిని. కలుసుకున్న కొద్దిమందీ కూడా నన్ను మాట్లాడనివ్వలేదు. తమ సమస్యల గురించీ, తమకు తీరుబడి లేకపోవడం గురించీ చెప్పి పంపేశారు. నేనేదైనా అనబోతే నీకేం ఫరవాలేదు, ధైర్యంగా వుండు—మేమున్నాంగా— అన్నారు కొందరు. వాళ్ళు అన్న పద్ధతినిబట్టి నాకు

తెలిసిపోయింది—అసలు వాళ్ళకు నా గురించి ఆలోచించడం కూడా ఇష్టంలేదని...."

"మరేం చేస్తావ్?" అన్నాను.

"నాయకులు నన్ను దగ్గరకు రానివ్వలేదనుకో. అప్పుడు వాళ్ళనే నా దగ్గరకు రప్పించుకుంటాను—" అన్నాడు ముకుందం.

"అదెలా సాధ్యం?"

"అన్నీ సాధ్యమవుతాయి. పార్టీ ప్రముఖులకు రెండు వారాలు టైమిస్తాను. రెండు వారాల్లో నా నిర్దోషిత్వం మీద నమ్మకాన్ని ప్రకటించారా సరేసరి. లేకపోతే..."

అతడు ఆగాడు. నేనాత్రం పట్టలేక—"ఆఁ లేకపోతే!" అన్నాను.

"రెండు వారాల అనంతరం దేశాన్ని సంచలనపరిచే వార్త ఒకటి పత్రికలకు విడుదలచేస్తాను—" అన్నాడు ముకుందం.

"ఏమిటది? అన్నాను కుతూహలంగా.

"అది ఎవ్వరికీ చెప్పను. చెప్పవలసిన అవసరం కూడా రాకుండా వుంటే సంతోషిస్తాను—" అన్నాడు ముకుందం.

అప్పటికి ముకుందం వద్ద సెలవు తీసుకున్నాను.

ముకుందానికి నావంటి వారు మొత్తం ఆరుగురు అనుచరులున్నారు. అంతా విడివిడిగా ఆ రోజు అతడిని కలుసుకున్నట్లు తెలిసింది. అందరికీ అతడిదే వార్త చెప్పినట్లూ తెలిసింది.

నాకు చాలా కుతూహలంగా ఉంది. ముకుందం అనుచరులలో నేను ముఖ్యుడని కనీసం పత్రికలవాళ్ళు రాస్తూంటారు. కానీ ముకుందం వద్ద ఉన్న గొప్ప రహస్య

మేమిటో నిజంగా నాకు తెలీదు. అదేమిటో తెలుసుకోవాలి!

అయితే అంతకంటే గొప్ప రహస్యమొకటి ఆ రాత్రి తెలుసుకుంటానని నాకు తెలియదు.

## 3

రాత్రి ఎనిమిదయింది.

నేను సండే వీక్లీ మాగజైన్ చూస్తున్నాను. మా పెద్దబ్బాయొక్కడే మెలకువగా వున్నాడు. తర్వాతి ఆడపిల్లలిద్దరూ నిద్రపోతున్నారు. భార్యామణి యెవరో రచయిత్రి వ్రాసిన ఎమెస్కో నవల చదువుతోంది.

అప్పుడు వచ్చిందామె!

నా కోసం....ఓ యువతి....అందులోనూ ఆ సమయంలో....

శ్రీమతి నవల మూసేసింది. ముందు నేనామె శ్రీమతి కోసమే వచ్చిందనుకున్నాను. ఆమెను నేనెప్పుడూ చూసిన గుర్తులేదు.

ఆమె అందంగా ఉంది—"మీకోసమే వచ్చాను—" అని ఆమె నాతో అన్నపుడు ఆమె పెదవులలో కలిగిన చలనం ఎంతో మనోహరంగా వుంది.

శ్రీమతి అప్పుడే నావైపు కోపంగా చూడబోయింది. పరిస్థితి గ్రహించి — "మిమ్మల్ని నేనెప్పుడూ చూసిన గుర్తులేదు—" అన్నాను.

"అవును. మీరు నన్నెన్నడూ చూడలేదు. నేనూ మిమ్మల్ని ఎప్పుడూ చూడలేదు. అయితే నేను మీ గురించి విన్నాను. మీరు నా గురించి విని కూడా వుండరు—"

నేను శ్రీమతికేసి చూశాను. ఆమె కళ్ళలో అనుమానంస్థానే కుతూహలం చోటుచేసుకుంటోంది.

"అవును—" అన్నాను.

"ఇప్పుడైనా మీ గురించి రాకపోదును. కానీ మీరు తప్ప ఈ సమయంలో ఎవరూ సాయపడలేరనిపించింది-" అందామె.

అవకాశమిస్తే ఇలా చాలాసేపు సస్పెన్సు పెంచుకుంటూ మాట్లాడుకుపోయే రకంలా కనబడింది. అంచేత త్వరగా విషయం చెప్పమని హెచ్చరించాను. అంత అందమైన యువతిని అలా హెచ్చరించడం నా మనసుకిష్టం లేదు. కానీ ఆ హెచ్చరిక నా శ్రీమతి కానందం కలగజేస్తుందని నాకు తెలుసు. అలాగే జరిగింది.

ఆమె తన కథ చెప్పనారంభించింది.

ఆమె పేరు రమ. ఆమె ముకుందం ప్రియురాలు. ప్రేమ పేరు చెప్పి ముకుందం ఆమెను నమ్మించి మోసం చేశాడు. వయసు వేడిలో, ప్రేమ మైకంలో ఆమె అతడి స్వంతమైంది. వారిద్దరి పరిచయానికి సూచనగా ఫోటో లున్నాయి. ఆ ఫోటోలను రమ భద్రంగా దాచుకుంది. ముకుందాన్ని బ్లాక్ మెయిల్ చేసే ఉద్దేశ్యమామెకులేదు. అతడినామె హృదయపూర్వకంగా ప్రేమించింది. తమ ప్రేమకు గురుగా ఆ ఫోటోలనామె దాచుకుంది. అనుకోకుండా ఆ ఫోటోలను నిన్న ఆమె అన్న చూశాడు. ఆమెను నిలదీశాడు. విషయం అతడికి చెప్పక తప్ప లేదామెకు.

అప్పుడు ముందుగా అన్న ఆమెను తిట్టాడు. ఆ తర్వాత ముకుందాన్ని తిట్టాడు.

రమ ఏడ్చింది.

చెల్లెలి ఏడుపు చూసి అన్న కరిగిపోయాడు.

ముకుందం వివరాలడిగేడు. అతడికింకా పెళ్ళికాలేదని

తెలుసుకున్నాడు. ఇద్దరికీ పెళ్ళి జరిపిస్తానని మాట ఇచ్చి ఈ రోజు సాయంత్రం ముకుందంతో మాట్లాడడానికి వెళ్ళాడు. వచ్చాడు.

"ఏం జరిగింది?" అన్నాను.

"నాకు చెప్పిందే ఆయన అన్నయ్యకూ చెప్పారు—" అంది రమ.

ఏమిటీ అని నేనడగలేదు. ఆమె చెబుతుందని నాకు తెలుసు.

"రాజకీయవాదులకు వివాహం ఓ ప్రతిబంధకంగా ఉంటుందిట. మంచి వరుణ్ని చూసి పెళ్ళిచేయమని సలహా యిచ్చారుట. పెళ్ళి ఖర్చు తానే భరిస్తానన్నారు" రమ గొంతులో దుఃఖం పలికింది.

"వివాహం ప్రతిబంధకమని తెలిసీ ఆడపిల్లతో సంబంధమెలా పెట్టుకున్నాడు?" అంది శ్రీమతి.

"అదే అన్నయ్య కూడా అడిగాడండి...." అంది రమ.

మనిషన్నాక పొరపాట్లు వస్తూంటాయి. ఒక తప్పును దిద్దుకోవడానికి మరో తప్పు చెయ్యకూడదు. ముకుందం రమంటే ఆకర్షించబడి ఆమెతో కొంత వ్యవహారం నడిపాడు. అయితే వివాహాని కతడు సుముఖంగాలేడు. అందుకని రమ జీవితం నాశనం కాకుండా తను చూస్తానన్నాడు.

"చాలా బాగుంది—" అంది శ్రీమతి.

"నాకూ అలాగే అనిపించిందం—" అంది రమ.

ఆమె ముకుందాన్ని ప్రేమించింది. ఎట్టి పరిస్థితిల్లోనూ అతడినిబ్బంది పెట్టడం ఆమెకిష్టముండదు. ఆమెకు అతడి మీద కోపం కూడా లేదు. ఎందుకంటే ఈ వ్యవహా

రంలో కొంత తన తప్పూ వుంది. అతడంటే ఆకర్షించ బడింది. జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పటికీ ఆమెకు ముకుందమంటే ప్రేమవుంది. కానీ తను ఆడది కావడంవల్ల అతడికోసం జీవితకాలం వేచివుండలేదు. పెళ్ళిచేసుకొని ముకుందాన్ని మరిచిపోవాలని అనుకుంటోంది.

శ్రీమతి రమవంక తిరస్కార భావంతో చూసింది. రమ ముకుందం కారణంగా ఆత్మహత్య చేసుకొనివుంటే ఆమె రమపట్ల గౌరవభావం ఏర్పర్చుకోగలిగి వుండేదేమో!

"అయితే ఇంక సమస్య ఏముంది? ఈ విషయం మీరు మీ అన్నయ్యకు చెప్పలేకపోయారా?" అన్నాడు.

ఆమెకా అవకాశమే రాలేదు. అతడు ఇంటికి వస్తూనే "పరువైన ఏ ఆడపిల్ల ఇందుకొప్పుకుంటుంది?" అన్నాడు. దాంతో రమ నోటికి తాళం పడింది. వాళ్ళిద్దరికీ ఎలాగైనా వివాహం జరిపిస్తానని ఆమె అన్న పట్టు బట్టాడు. ముకుందం ఈ పెళ్ళికి ఒప్పుకోకపోతే అతడి బ్రతుకు బయట పెడతాడట.

"అందువల్ల నా బ్రతుకు బండలుకాదా అన్నయ్యా!" అంది రమ.

"కాదు. రాజకీయవాదులు తమ ముచ్చటను బయటకు కనపడనివ్వరు. అందుకోసం పెళ్ళయినా చేసుకుంటారు" అన్నాడు రమ అన్న.

రమకు అన్న పథకం నచ్చలేదు. అందుకని ఆమె అంతకాలం తను ఎంతో భద్రంగా దాచుకున్న ఆ ఫోటోలను పొయ్యిలో పడేసింది. ఇది తెలిసి అన్న మండిపడ్డాడు. ఓ మంచి సాక్ష్యం పోయిందని బాధ పడ్డాడు.

"నేను నీ నుంచినే కోరుతున్నాను. అది నువ్వు

గ్రహించలేక చాలా పెద్ద పొరపాటు చేశావు. అన్నగా నేను నీ తప్పును మన్నించాను. కానీ నువ్వు క్షమించినా ఆ ముకుందాన్ని నేను క్షమించను. నీతో పెళ్ళికి ఒప్పుకోకపోతే వాడిని చంపేస్తాను—" అన్నాడామె అన్న.

"అన్నయ్య దుడుకు మనిషి. వాడు అన్నంత పనీ చేయగలడు. నేను, నా అన్నయ్య అనామకులం. మేమేమైపోయినా ఫరవాలేదు. కానీ ముకుందంబాబు ప్రజల మనిషి. అందులోనూ నేను మనసిచ్చిన మనిషి. ఆయనకే ప్రమాదం జరక్కూడదు.దయచేసి మీ రాయన్ను హెచ్చరించండి—" అంది రమ.

"ఆ పని మీరే చెయ్యొచ్చుగా—" అన్నాను.

"ఆయనకు ఫోన్ చేశాను. ఇదంతా నేనాడుతున్న నాటకమని ఆయన అనుమానం. ఆయన నా మాటలు బొత్తిగా చెవిని పెట్టలేదు...." అంది రమ.

"ముకుందాన్ని చంపడం అంత తేలిక కాదు—" అన్నాను నేను. రమ చెప్పే విషయం అంత సీరియస్ గా తీసుకోనవసరం లేదని నాకు అనిపించింది.

"నా అన్నయ్య సంగతి తెలిస్తే మీరలా అనరు!" అన్నది రమ.

"తెలియ జెప్పండి-" అన్నాను కాస్త వ్యంగ్యంగా.

"పట్టుబడకుండా హత్య చెయ్యగలగడం వాడి ప్రత్యేకత...." అందామె.

కాస్త తడబడి—"అతడు హంతకుడా?" అన్నాను.

"అవును—" అందామె.

శ్రీమతి ముఖంలో భయం కనబడింది—"సరేనమ్మా- నా భర్త ముకుందంగారిని హెచ్చరిస్తారు. మీరు వెళ్ళండి—" అంది. ఆమెను త్వరగా అక్కణ్ణించి

పం పేయాలనుకున్నట్లుంది తను.

"మీ అన్నయ్య గురించి ఇంకా చెప్పండి—" అన్నాను కుతూహలంగా.

"ఏడాదిక్రితం సేట్ రతన్‌లాల్ హత్య జరిగింది. ఇంతవరకూ పోలీసులకు హంతకుడి ఆచూకీ దొరకలేదు. ఆ హత్య అన్నయ్యే చేశాడనడానికి నా వద్ద చాలా ఆధారాలున్నాయి. కానీ చెప్పను—" అందామె.

"ఇప్పుడు నే నేం చేయాలి?" అన్నాను.

"అన్నయ్య ఆయనకు రెండువారాలు టైమిచ్చాడు. ఆయనకు పటిష్టమైన రక్షణ ఏర్పాట్లయినా చేసుకోమనండి. లేదా నన్ను వివాహం చేసుకోమనండి. విషయాన్ని తేలికగా తీసుకోనవద్దనండి—" అందామె.

"మీ అన్నయ్య ఇంతవరకూ తప్పించుకోగలదేమో కానీ ముకుందం విషయంలో తప్పించుకోలేడు. అతడిని నే నే పట్టిస్తాను—" అన్నాను.

"మీదాకా ఎందుకు—వాడిని నే నే పట్టించగలను. కానీ వాడిని పట్టించడంకంటే ముకుందంగారి ప్రాణాలే నాకు ముఖ్యం—" అంది రమ.

అవును. నిజమే! ముకుందం పోయాక హంతకుడిని పట్టించి ఏమి ప్రయోజనం? రమకంటే ఎక్కువగా నాకు ముకుందం ప్రాణాలు ముఖ్యం.

"బాగా చెప్పారు. నేను ముకుందాన్ని హెచ్చరిస్తాను. కానీ అతడిది మంకుపట్టు. ఒకోసారి నా మాట కూడా వినకపోవచ్చును. నాకు మీ అన్నయ్య గురించిన పూర్తి వివరాలు కావాలి...." అన్నాను.

రమ అన్నివిధాలా సిద్ధపడే వచ్చింది. ఆమె తన అన్న ఫోటోను నా కిచ్చింది. ఫోటోలోని యువకుడికి

ముప్పై ఏళ్ళుంటాయేమో—అతడు మాంతపడంటే నాకు నమ్మ బుద్ధి వేయలేదు. కానీ ముఖంచూసి ఏం చెప్పగలం?

తన యింటి వివరాలతో పాటు రమ మరో చిన్న సమాచారం కూడా ఇచ్చింది. డిటెక్టివ్ అంజనేయులుకు తన అన్న గురించి బాగా తెలుసునట. నేను అతడి సాయం కోరటం మంచిదని నాకు సూచించిందామె.

రమ వెళ్ళిపోయింది. నాకు మనసు స్థిమితంగా లేదు. వెంటనే ముకుందానికి ఫోన్ చేశాను.

"హలో! నీతో అర్జంటుగా మాట్లాడాలి...." అన్నాను.

"ప్లీజ్—రేపటికి వాయిదా వెయ్యి—" అన్నాడు ముకుందం.

"ఎందుకని?"

"నాకు కళ్ళు తెలియని నిద్రవస్తోంది. చాలా అలసటగా వుంది—" అని ఫోన్ పెట్టేశాడు ముకుందం. ఆ తర్వాత మరోసారి ఫోన్ చేస్తే ఎంగేజ్ రింగ్ వచ్చింది. బహుశా ఫోన్ తీసి పైన పెట్టేసి వుంటాడు.

అన్నీ తెలిసి అతడికంత నిద్ర ఎలా వస్తోందో—నాకు ఆ రాత్రంతా సరిగ్గా నిద్రపట్టలేదు.

## 4

మర్నాడుదయం కాఫీ తాగగానే ముకుందం ఇంటికి వెళ్ళాను. ముకుందం నాకు చాలా ఫ్రెష్‌గా కనబడ్డాడు.

"రాత్రి బాగా నిద్రపట్టిందా?" అన్నాను.

"పట్టింది—ఏం?" అన్నాడు ముకుందం.

"రమ నీ సంగతి అంతా చెప్పింది నాకు—" అన్నాను.

"రమ ఎవరు?" అని—"ఓహో—రమ అన్నావు కదూ-

ఆమె నీ దగ్గరకు వచ్చిందా? మా ప్రేమ వ్యవహారం చెప్పిందా?" అన్నాడు ముకుందం.

"చెప్పింది. ఆడవాళ్ళ విషయంలో నువ్విలాగుంటావని ఆమె కారణంగానే నాకు తెలిసింది—" అన్నాను.

"నేనంటే అసహ్యం వేస్తోందా?" అన్నాడతను.

"లేదు. నాకు నీ చరిత్రతో సంబంధంలేదు. నువ్వే కావాలి—"

"చాలా బాగా అన్నావు. నువ్వు ఫ్రాంక్ గా మాట్లాడతావు. అందుకే నువ్వంటే నాకిష్టం. రమ కథ చెప్పనా?" అన్నాడతను.

నేను తల ఊపాను.

ముకుందం బ్రహ్మచారి. కానీ అతడిలోనూ కోరిక లుంటాయి. తన కోరికలను తీర్చుకునేటందుకు అతడికి తేరే పద్ధతులున్నాయి. శరీరాన్నమ్ముకొని డబ్బు సంపాదించే ఆడవాళ్లున్నారు. ముకుందం వాళ్ళ జోలికే తప్ప-ఆడపిల్లల జీవితాలు పాడుచేయలేదు. రమ విషయంలో ఓ తమాషా జరిగింది. శత్రువులతడిపైన ఆమెను ప్రయోగించారు. అది ప్రయోగమని తెలియక అతడామె తళుకు బెళుకులకు లొంగిపోయాడు. అప్పుడే ఇద్దరూ కలిసి కొన్ని ఫోటోలు తీయించుకున్నారు.

ఓ సంవత్సరం పరిచయం తర్వాత రమ పెళ్ళి ప్రసక్తి తెచ్చింది.

పెళ్ళి గురించి తన అభిప్రాయమేమిటో ముకుందం ఆమెకు వివరించి చెప్పి—"నేను బ్రహ్మచారిగానే చచ్చిపోతాను—" అన్నాడు.

అప్పుడు రమ ఏడ్చింది—"నా జీవితం అన్యాయమైపోయింది—" అంది.

రమకు పేరుప్రతిష్ఠల తాపత్రయం ఎక్కువ. తన పేరు అన్ని వార్తాపత్రికలలోనూ రావాలనీ, తన ఫోటో— దేశంలోని ప్రజలందరి ఇళ్ళలోనూ వుండాలని ఆమె కోరిక.

మొదట్లో ఆమె సినిమాల్లో చేరాలనుకొంది. ఎవరో చెప్పారామెకు-సినిమా ఫీల్డులో శీలం కాపాడుకోవడం కష్టమని! అదీకాక సినిమాల్లో పేరు—వయసున్నంత కాలమే ఉంటుంది. తర్వాత ప్రజలు మర్చిపోతారు.

రాజకీయాల్లో అయితే సినిమా కంటే ఎక్కువ పలుకుబడి వుంటుంది. రాజకీయ నాయకులకున్న గ్లామర్ సినిమా తారలకు లేదు. వయసు పెరిగినకొద్దీ రాజకీయాల్లో గ్లామర్ పెరుగుతుంది.

రమ రాజకీయాల్లో ప్రవేశించాలనే అనుకుంది. అందుకు సులభ మార్గం ఆమెకు కొందరు మిత్రులు సూచించారు. పేరున్న రాజకీయవాదిని ఆశ్రయించడం-ఆశ్రయించడం అంటే పెళ్ళిచేసుకోనడం!

ముకుందం పేరును కూడా వారామెకు సూచించారు.

రమకు అందముంది. వయసుంది. ముకుందాన్ని వలలో వేసుకోనడం ఆమెకు అసాధ్యంకాదు. అతడితో వివాహమైతే ఆపైన పేరుప్రతిష్ఠలు వెతుక్కుంటూ ఆమెను వచ్చి చేరతాయి.

రమ దూరం ఆలోచించలేదు. కానీ చాలా దూరం వెళ్ళిపోయింది.

చేతులు కాలిపోయాయి.

ముకుందం ఆమె కథ విని ఆమెపైన జాలిపడ్డాడు. ఆ ఫోటోలు బయటపెట్టమని కొందరామెను ప్రోత్స

హించినా అందుకామె అంగీకరించనందుకు ముకుందం ఆమెను అభిమానించాడు కూడా.

"ఈ వ్యవహారం నడిపి నా శత్రువులు నాపై ఏం సాధించాలనుకున్నారో ఇప్పటికీ నాకు తెలియదు. కానీ మ చాలా మంచివి. అందువల్ల నాకే ఇబ్బందీ లేక పోయింది. మళ్ళీ ఇన్నాళ్ళకు నిన్న ఆమె అన్న నన్ను ఫోన్‌లో హెచ్చరించాడు. సరిగా రెండువారాలు పైమిచ్చాడు నాకు—" అని నవ్వాడు ముకుందం.

"వాడు నిన్ను చంపుతానని బెదిరించాడు కదా—అలా ఎలా నవ్వగలుగుతున్నావు నువ్వు?" అనడిగాను.

"ధైర్యవంతు డొక్కసారే మరణిస్తాడు. వెయ్యి చావులు చచ్చేది పిరికివాడు మాత్రమే!" అన్నాడు ముకుందం.

"బాగుంది. అయితే ఏ జాగ్రత్తలూ తీసుకోవా నువ్వు...."

"నీకు తెలుసో తెలియదో—చంపుతానన్న బెదిరింపు నాకిది ప్రథమం కాదు. నా గురించి నువ్వేమీ బెంగ పడకు—" అన్నాడు ముకుందం.

అతడికి రమ అన్న ఫోటో చూపించాను. ముకుందం ఆ ఫోటోను చూస్తూ— "ఇతడినెక్కడా చూసిన గుర్తు లేదు—" అన్నాడు.

"పోలీసు రిపోర్టిస్తావా?" అన్నాను.

"ఇవ్వను—" అన్నాడు ముకుందం.

"ఏం?"

"మనదేశంలో పోలీసులు హంతకుడిని పట్టుకునేందుకు ఎంతవరకూ పనికొస్తారో తెలియదు కానీ—ప్రాణాలు కాపాడడానికి మాత్రం పనికిరారు-అని నాకు తెలుసు-"

"అయితే ఏం చేస్తావ్?"

"నువ్వు నిశ్చింతగా వుండు. ఇలాంటి టుమ్రీగాళ్ళని చూసే పద్ధతులు నాకున్నాయి—" అన్నాడు ముకుందం.

అతణ్ని చూస్తే బాగా రాటుదేలినవాడనే అనిపించింది.

## 5

రమ చెప్పిన డిటెక్టివ్ ఆంజనేయుల్ని కలిశాను.

ఆంజనేయులు పేరుకు తగ్గట్టుగానే ఉన్నాడు రూపంలోనూ కూడా. అతడికి నేను తెచ్చిన ఫోటో చూపించాను.

"అరే—వీడా—వీడు నా ప్రాణ స్నేహితుడు—" అన్నాడు ఆంజనేయులు.

"నువ్వు డిటెక్టివ్వా, హంతకుడివా?" అన్నాను చిరాగ్గా.

"ఏం?"

"ఈ ఫోటోలోని మనిషి పచ్చి హంతకుడు...."

ఆంజనేయులు నవ్వి—"దేశ ప్రజలందరూ అమ్మ, అమ్మ అని ప్రేమించే ఇందిరాగాంధీని మొరార్జీ దేశాయ్ ద్వేషిస్తాడు. ప్రేమ, ద్వేషం అనే పదాలకు మనుషుల్లో నిమత్తంలేదు. అవసరం మాత్రమే!" అన్నాడు.

"అంటే?"

"వీడో హత్య చేసినపుడు నేను పరిశోధించి ఆచూకీ పట్టేశాను. కానీ వీడికి ఎందరో రాజకీయ నాయకుల మద్దతు వుంది. వాళ్ళు తమ అవసరాలకు వీడిని ఉపయోగించుకుంటూ, తమ స్వార్థం కోసం వీడిని కాపాడుతూంటారు. నేను వీడి ఆచూకీ పట్టేయగానే మొత్తం అంతా కలిసి నన్ను చంపడానికి సిద్ధమయ్యారు. అప్పుడు

వీడే జాలిపడి నన్ను రక్షించి నా స్నేహితుడయ్యాడు. కాబట్టి ప్రాణస్నేహితుడిగానే భావిస్తూంటాను.

వాడికీ నాకూ ఒప్పందమేమిటంటే—వాడు నేరం చేసినప్పుడా నేరం నేను పరిశోధించకూడదు. వాడే నేరమైనా రెండు వారాలు ముందుగా పథకం వేసుకుంటాడు. ఆ రెండు వారాలూ నేను ఏ కేసు చేపట్టకూడదు. ప్రతిఫలంగా నాకు అయిదువేలిస్తాడు. డబ్బు అడ్వాన్సుగా ముందే ఇచ్చేస్తాడు. ఈ పద్ధతి నాకు చాలా బాగుంది. వాడు నెలకొక్క నేరం చేసినా చాలు నాకు ఇల్లు కదలకుండా అయిదువేలు సంపాదించవచ్చు. కానీ నా దురదృష్టం. వాడు చాలా తక్కువగా నేరాలు చేస్తాడు. ఇన్నాళ్ళకిన్నాళ్ళకి మళ్ళీ నిన్న అయిదువేలు ఇచ్చాడు...."

ఉలిక్కిపడ్డాను. నిన్న! నిన్ననే వాడు ముకుందాన్ని హెచ్చరించి రెండు వారాలు టయిమిచ్చాడు. నిన్ననే డిటెక్టివ్ ఆంజనేయులికి డబ్బు ఇచ్చాడు.

అంటే?!

వాడు హత్యా విషయంలో సీరియస్‌గానే వున్నాడన్నమాట....

"నీకు తను చేయబోయే నేరం వివరాలు చెప్పాడా?" అన్నాను.

"అది నేనడగను. వాడు చెప్పడు...."

"ప్రముఖ రాజకీయవాది ముకుందాన్ని వాడు హత్య చేయబోతున్నాడు. ఈ హత్యను నువ్వు ఆపగలవా?"

"అలా చేస్తే మా ఒప్పందం దెబ్బతింటుందే?" అన్నాడు ఆంజనేయులు. అతడికి ముకుందం ప్రాణాలకంటే తన ఒప్పందమే విలువైనదిగా అనిపిస్తున్నట్లుంది.

"నువ్వు బల్లకట్టి డిటెక్షన్ ప్రారంభించినది—హంతకులకు సహకరించడానికా, నేరాలు ఆపడానికా?" అన్నాను తీవ్రంగా.

"రెండూ అక్కర్లేదు. నాకు డబ్బు కావాలి...." అన్నాడు ఆంజనేయులు.

"ముకుందం ప్రాణాలు వీడిచేతిలో పోకుండా ఆపగలిగితే నీకు వీడిచ్చినదానికి రెట్టింపు డబ్బు ఇస్తాను—" అన్నాను.

ఆంజనేయులు కళ్ళు చిట్లించి — "ప్రముఖ రాజకీయవాది ముకుందంగారి ప్రాణాల విలువ పదివేలు మాత్రమేనా?" అన్నాడు.

"ఓ పెన్సిలిన్ ఇంజక్షన్ ముకుందం ప్రాణాలు నిలబెడితే—అతడి ప్రాణాల విలువ అయిదు రూపాయలకు దిగిపోదు—" అన్నాను తీవ్రంగా.

"ఆల్ రైట్! మీరు పాతికవేలిస్తానంటే వీ డాహత్య చేయకుండా ఆపుతాను. అయితే అడ్వాన్సు కావాలి నాకు...." అన్నాడు ఆంజనేయులు.

ఓ క్షణం ఆలోచించి—"రమ అన్న ఇచ్చిందే మా అడ్వాన్సనుకో. రెండు వారాల అనంతరం నీకు పాతికవేలు ఇస్తాను...." అన్నాను.

"అలా అయితే అగ్రిమెంట్ కాగితంమీద సంతకం పెట్టండి—" అన్నాడు ఆంజనేయులు.

ముకుందం ప్రాణాలు ప్రమాదంలో ఉన్నట్లూ, అవి కాపాడమని నేనాంజనేయుల్ని కోరినట్లూ—ఫలానా తేదీకి నేను అతడికి ముకుందం ప్రాణాలు ఆనాటికి కాపాడబడిన పక్షంలో పాతికవేల రూపాయలు ఇస్తానన్నట్లూ ఆ కాగితంమీద వ్రాసి సంతకం పెట్టాను.

ఆంజనేయులు తృప్తిగా తలాడించి—"స్వయంగా ఆ యమధర్మరాజే దిగివచ్చినా ఆ ముకుందం ప్రాణాలను తీసుకొని వెళ్ళలేడు. మీరింక నిశ్చింతగా వుండండి. డబ్బు సిద్ధం చేయించడం మాత్రం మరిచిపోకండి-" అన్నాడు.

నేను అసంతృప్తిగా అక్కణ్నించి కదిలాను. తెలివి తక్కువగా కొందరు మోసగాళ్ళ పథకంలో నేను ఇరుక్కున్నానేమోనని బెంగపట్టుకుంది. పాతికవేలంటే మరీ చిన్న మొత్తం కాదు. అయితే పాతికవేలు ముకుందం ప్రాణాలకంటె ఎక్కువకాదు నాకు. ముకుందం పచ్చగా వుంటే—వేలేం కర్మ—లక్షలకు లక్షలు పోగుచేయగలను నేను.

ఈ విషయం రెండువారాల అనంతరమే ముకుందానికి చెప్పాలనుకున్నాను.

# 6

డిటెక్టివ్ ఆంజనేయుల్ని వదిలాక నేను పోలీసు ఇన్స్పెక్టర్ చంద్రశేఖర్‌ని కలుసుకున్నాను. ముకుందం కారణంగా ఆయనా నేనూ మంచి స్నేహితులయ్యాము.

"ఏమిటిలా వచ్చారు?" అన్నాడు చంద్రశేఖర్.

నేను క్లుప్తంగా ముకుందానికి వచ్చిన సమస్య చెప్పాను. తర్వాత రమ అన్న ఫోటో చూపించాను.

"ఈ ఫోటో ఎక్కడో చూసినట్లుందే!" అన్నాడు చంద్రశేఖర్.

"ఆశ్చర్యమేముంది? మీరు ఇన్స్పెక్టర్. అతను పట్టుబడని హంతకుడు. ఏదో సమయంలో మీరు కలుసుకునే ఉంటారు—" అన్నాను.

"అలా కాదు. ఇటీవలే ఇతడి ఫోటో చూశాను—" అన్నాడు చంద్రశేఖర్—"ఆఁ గుర్తొచ్చింది. నాలుగు

రోజుల క్రితం అన్ని పోలీసుస్టేషన్లకూ ఈ ఫోటో పంప బడింది. జైలునించి తప్పించుకున్న హంతకుడితను...."

ఆశ్చర్యంతో నాకు నోట మాటరాలేదు. రమ తన అన్న పట్టుబడని హంతకుడని చెప్పింది. చంద్రశేఖర్ ఇలాగంటున్నాడు.

"ముకుందాన్ని రక్షించడానికి మీరు చేతనైనది చేయండి—" అన్నాను.

చంద్రశేఖర్ నవ్వి—"కంప్లయింట్ లేనిదే మేము రంగంలోకి దిగలేము. కంప్లయింట్ ఇచ్చినా అందుకు సరైన ఆధారాలుంటేనే ఆ కేసు టేకప్ చేస్తాం. మీ కేసు మీది కాదు. ముకుందంగారు నిమ్మకు నీరెత్తినట్లున్నారని మీరంటున్నారు. అందువల్ల నేను చేయగలిగిం దేమీ లేదు. అయితే మీ కో ఉపకారం చేయగలను. దానివల్ల మీకు మనశ్శాంతి కలుగుతుంది—" అన్నాడు.

చంద్రశేఖర్ అప్పుడు నా కో గొప్ప రహస్యం చెప్పాడు. ప్రముఖ రాజకీయవాదులెవ్వరూ తమకు తాము ఆత్మరక్షణ ఏర్పాట్లు చేయనవసరంలేదు. పార్టీ చూసు కుంటుంది. ప్రతి ప్రముఖ రాజకీయవాదికీ అండగా ఒక రిద్దరు గూండాలుంటారు. వాళ్ళకు కొండలను పిండి చేయగల శక్తి వుంటుంది. అందువల్లనే మన దేశంలో ఎవరి ప్రాణాలకైనా ప్రమాదముంటుంది కానీ రాజకీయ వాదుల ప్రాణాలకు ప్రమాదముండదు.

చంద్రశేఖర్ మాటలు నాకు కాస్త తృప్తిని కలి గించాయి. ఈ విషయం నాకు కూడా చెప్పకుండా ముకుందం రహస్యంగా వుంచాడు. బహుశా అలా వుంచాలేమో!

నేను రమ ఇంటికి వెళ్ళాను. ఆమె ఇంట్లోనే వుంది.

నేను వస్తానని ఊహించలేదేమో—చాలా ఆశ్చర్యం కలిగిందామెకు.

"మీ అన్న గురించి మాట్లాడాలని వచ్చాను—" అన్నాను.

"ఏం జరిగింది?" అందామె.

"మీ అన్న పట్టుబడని హంతకుడని మీరన్నారు. కానీ అతడు జైలునించి పారిపోయినట్లు నాకు తెలిసింది" అన్నాను.

రమ ముఖంలో ఆశ్చర్యం వర్ణనాతీతం—"ఎలా తెలిసింది మీకు?" అంది.

నేను చంద్రశేఖర్‌ను కలుసుకొన్న విషయం చెప్పాను.

"అయాం సారీ—మీకు కొన్ని అబద్దాలు చెప్పాను. అయినా తన అన్న హంతకుడని చెప్పుకోవడం ఏ చెల్లికీ ఇష్టముండదు కదా—మీరింత త్వరగా ఈ విషయాన్నింత లోతుగా పరిశోధిస్తారనుకోలేదు. అయితే ఇంక ముకుందం గారి ప్రాణాలకు తప్పక రక్షణ లభించగలదు—" అంది రమ.

"మీ అబద్ధం సంగతి చెప్పండి—" అన్నాను.

"చెప్పడానికేముంది? వాడో హంతకుడు. హత్యలు చేసి జైలుకు వెడుతూంటాడు. వాడికి రాజకీయపక్షాల మద్దతు వుందంటారు. అందువల్లనే ఏమో — మళ్ళీ తప్పించుకొని బైటపడుతూంటాడు. ఇటీవలే వాడు జైలు నుంచి పారిపోయొచ్చాడు. వాడిలో ఎప్పటికీ మార్పు రావడంలేదని నేను వాడికో అబద్ధం చెప్పాను—" అంది రమ.

రమ అన్నకు ముకుందం ప్రేమ కథ తెలియదు. ఆమె వాడికిలా చెప్పింది. ముకుందం రమను ప్రేమించాడు.

రమ అతడిచేత ఆకర్షించబడింది. ఇద్దరూ పెళ్ళిచేసుకుందా మనుకొన్నారు. అప్పుడు రమ అన్న గురించి ముకుందానికి తెలిసింది. అప్పుడే పేరు తెచ్చుకొంటున్న రాజకీయవాది అతను. ఒక హంతకుడి చెల్లిని వివాహమాడటం అతడి ప్రగతిని దెబ్బతీస్తుంది. ఆ వివాహం చెడిపోయింది.

రమ అన్న ఈ కథను నమ్మాడు. తనవల్ల చెడిపోయిన వివాహం తన కారణంగానే జరగాలని పట్టుబట్టాడు.

"కనీసం ఇదైనా నిజమని నమ్మొచ్చా?" అన్నాను.

"మొదటిసారి అబద్ధం చెప్పినందుకే సిగ్గుపడుతున్నాను...." అంది రమ.

ఆమె సిగ్గుపడుతున్నట్టే వుంది. సిగ్గు ఆమెకు అందాన్నిచ్చింది. నేనక్కడ ఎక్కువసేపుండలేదు. ఆమె నన్ను ఆకర్షిస్తోంది.

రమలో గొప్ప ఆకర్షణ వుంది. ముకుందం ఆమె వలలో పడటంలో ఆశ్చర్యంలేదు. అయితే అందువల్ల రమ సాధించినదేమిటి?

ఎంత ఆలోచించినా నాకేమీ స్ఫురించలేదు. కానీ ఏదో వున్నదనే అనిపిస్తోంది. కేవలం కీర్తి ప్రతిష్ఠలకోసం ఆమె అతడి వెంటబడిందంటే నాకు నమ్మబుద్ధి కావడం లేదు.

## 7

మర్నాడుదయం కాఫీ తాగుతూండగా ఇంట్లో ఫోన్ మ్రోగింది. నేనే స్వయంగా ఎత్తాను.

"హలో!" అంది అవతలి కంఠస్వరం. నేను నా పేరు చెప్పాను.

"నువ్వు నా గురించి ఎక్కువగా తెలుసుకోవాలనుకొంటున్నావు. బుద్ధిగా వుండకపోతే నీకు చాలా

ప్రమాదం—" అంది అవతలి కంఠం.

"హలో—ఎవరు నువ్వు?"

"నేనెవరో నీకు తెలుసు. తెలిసిందానికంటే ఇంకా ఎక్కువ తెలుసుకోవాలనుకొన్నావో నీకు ప్రమాదం. ప్రస్తుతానికి నావల్ల ముకుందానికి మాత్రమే ప్రమాదం. ఇకముందు నీకూ వుండగలదు—బుద్ధిగా ఉండకపోతే-"

అవతల ఫోన్ క్లిక్ మంది. నేను వెంటనే ఎక్స్ఛేంజ్ కి ఫోన్ చేసి కాల్ ఎక్కణ్ణించి వచ్చిందో అడిగాను. వాళ్ళు చెప్పింది విని ఆశ్చర్యపడ్డాను. ఆ నంబరు నాకు బాగా పరిచయమైనది. అది ముకుందానిది.

వెంటనే ముకుందానికి ఫోన్ చేసి జరిగింది చెప్పాను.

"కలలు కనకు...." అన్నాడు ముకుందం.

ముకుందం ఇంట్లో రెండు కనెక్షన్స్ న్నాయి. ఒకటి మేడమీద, ఒకటి కింద. ఈ విషయమై అతడు జాగ్రత్త పడతాడేమోననుకొంటే నా మాటలు తేలికగా తీసి పారేశాడు. ఎటువంటి అండదండలున్నప్పటికీ మరీ అంత నిర్లక్ష్యం పనికిరాదనిపించింది.

మరో గంటలో నాకు ఇంకో ఫోన్ వచ్చింది. మళ్ళీ అదే గొంతు.

"నువ్వు నామీద డిటెక్షన్ మానలేదు కదూ—"

"నాకాస్త భయం వేసింది—"

"సాయంత్రం సిటీ పార్కుకిరా — నీకో గొప్ప రహస్యం చెబుతాను. ఆ తర్వాత నువ్వు ముకుందం గురించి పట్టించుకోవు...." అందా కంఠం.

ఈసారి నేనింక డిటెక్షన్ చేయదల్చుకోలేదు. అతడు చెప్పిన టైముకి అతడు చెప్పిన చోటుకి సిటీ పార్కుకి వెళ్ళాను. వెళ్ళేముందు ఇన్స్పెక్టర్ చంద్ర

శేఖర్ కి కూడా చెప్పలేదు. ఆమాత్రం ధైర్యం అవసర మనిపించింది నాకు.

## 8

సిటీపార్కులో అతడు చెప్పినచోట ఓ అమ్మాయి వుంది. ఆమె చాలా అందంగా వుంది. నాకు ఫోన్ చేసింది ఆమె కాదని చెప్పగలను. ఆ కంఠం మగవాళ్ళది. అందులోనూ బొంగురుగా వుంది.

ఎందుకైనా మంచిదని ఆమెను పలకరించాను. ఆమె పలికింది.

ఆ గొంతు తియ్యగా వుంది.

“నేనిక్కడ కూర్చుంటే మీకు అభ్యంతరమా?” అన్నాను. లేదన్నట్లు అడ్డంగా తల ఊపిందామె.

“మీరు ఎవరికోసమో ఎదురుచూస్తున్నట్లున్నారు-” అన్నాను.

“అవును—” అందామె.

“నేనూ ఎవరికోసమో ఎదురుచూస్తూ ఇక్కడకు వచ్చాను—” అన్నాను.

“ఎవరు?” అందామె.

“ఎవరో, ఎలా వుంటారో తెలియదు—కలుసుకోనే దాకా—” అన్నాను.

“అరే—ఆశ్చర్యం.... నా విషయమూ అంతే—” అందామె.

అసలు విషయం తెలియడానికి ఎంతోసేపు పట్టలేదు. రమ అన్న ఆమెను అక్కడికి పంపాడు. ఆమె ద్వారా అతడు నాకేదో చెప్పదల్చుకొన్నాడు. నేను పోలీసులతో వస్తానన్న అనుమానంతో అతడామెను నియోగించాడు.

"అతడు మీకెలా తెలుసు?" అన్నాను.

"ఇద్దరూ రాజకీయాల్లో మనుషులం...." అందామె.

"అంటే?"

"అతడు రాజకీయ హంతకుడు. నా భర్త రాజకీయ గూఢచారి. ఆ విధంగా మా ఇద్దరికీ పరిచయమయింది" అందామె.

"రాజకీయాల్లో మీ పాత్ర ఏమిటి?" అన్నాను.

"నా పాత్ర ఏమీ లేదు. రాజకీయాలంటే నాకు విసుగు కూడాను...."

"ఈ విషయం మీరు మీ భర్తకు చెప్పలేదా?" అన్నాను.

"చెప్పి—ఏం లాభం? నా భర్త నన్ను రాజకీయ ప్రయోజనాల నాశించే వివాహం చేసుకొన్నాడు" అందామె నిట్టూర్చుతూ.

"అంటే?"

"అంటే ఏముంది? నా అందాన్నాయన రాజకీయ ప్రయోజనాలకు వాడుకొంటున్నాడు—" అందామె మళ్ళీ నిట్టూర్చుతూ.

"ఆడదానికి స్వతంత్రం కావాలని అంతా గోలెడు తూంటారు. నాకు అలా అనిపించటంలేదు. నా భర్త నన్ను అదుపులో వుంచితేనే నాకు బాగుంటుంది. నేను తనకే స్వంతమనీ—తనను తప్ప వేరెవర్నీ కన్నెత్తికూడా చూడరాదనీ ఆయననుకోవాలి. కానీ ఆయన నాకు పూర్తి స్వతంత్ర మిచ్చాడు. ఫలితంగా నాకు విచ్చలవిడితనం అలవాటయింది. అది నాకు తృప్తినివ్వటంలేదు. నన్ను నన్నుగా ప్రేమిస్తూ ఆత్మీయతతో నాతో కబుర్లు చెప్పే మగవాడికోసం నేను ఎదురుచూస్తున్నాను" అందామె.

మగవాడికి ఆడది బలహీనత. ఆమె అంటే నాకు ఆశ పుట్టింది.

"మిమ్మల్ని చూస్తే నాకు జాలి వేస్తోంది—" అన్నాను.

"నేను పురుషుడినుంచి ప్రత్యేకంగా కోరేదేమీ లేదు. ఎలాగూ వివాహితను. అందువల్ల యెవరికీ బాధ్యతను కాను. ప్రతిఫలంగా శరీరం ఉండనే ఉన్నది—" అన్నదామె నన్ను క్రీగంట చూస్తూ.

అప్రయత్నంగా ఆమెచేయి నా చేతిలోకి వచ్చింది—

"నా నిండు మనసు నీది—" అన్నాను ఆవేశంగా.

ఆమె వెంటనే నా గుండెల మీద వాలిపోయి ఏడ్చింది.

ఆమెను బలంగా హత్తుకొన్నాను నేను.

కొద్ది క్షణాల్లో ఇద్దరూ విడిపోయాం — "అయాం సారీ!" అన్నాను నేను.

"నాకు తెలిసిపోయింది. కొంతసేపటి క్రితం మీ రెవరో, నే నెవరో తెలియదు. కానీ ఈ కొద్దిక్షణాల్లో మన పరిచయం ఈ జన్మది కాదనిపిస్తోంది—"అందామె' ఆమె కంటిలో మెరుపు వుంది.

"నాకూ అలాగే అనిపించింది—" అన్నాను.

అదెంతవరకూ నిజమో నాకు తెలియదు. కానీ ఆమె నాకు కావలనిపిస్తోంది. మధ్యలో ఆమెను వదిలినందుకూ, మేమున్నది సిటీ పార్కు అయినందుకూ నాకెంతో అసంతృప్తి కలిగింది.

"ఈమాత్రం అభిమానం మీరు నామీద చూపించండి. మీరేం కోరితే అది చేస్తాను—" అందామె.

కాసేపు ఇద్దరం ప్రేమకబుర్లు చెప్పుకొన్నాం. ఆమె

నన్ను తన ఇంటికి ఆహ్వానించింది. భర్త ఊళ్ళోలేడనీ— ఇంట్లో తను ఒంటరిగా వున్నాననీ అంది. అన్నింటికీ నేను తల ఊపాను. వనిత వలచి వస్తానంటే—ప్రవరాఖ్యుడై నా కథల్లో తప్పు కాదనడు.

"అన్నట్లు చెప్పడమే మరిచిపోయాను—" అందామె.

రమ అన్న ఆమె ద్వారా నాకేదో సందేశం పంపాడు.

ముకుందాన్ని నేనెలాగూ రక్షించలేను. అటువంటప్పుడు ముకుందం గురించి ఆలోచించి నా ప్రాణాల మీదకు తెచ్చుకోవడమెందుకు? డబ్బు, పలుకుబడి వున్నవారు జీవితాన్ని ఆనందంగాగడిపే ఉపాయాలున్నాయి. ఆ ఉపాయాల్లో జానకి కూడా వుంది.

జానకి ఈమె పేరు!

"నువ్వు ఇంత తేలికగా...." అన్నాను నోట మాట రాలేదు నాకు.

"ఇటీజ్ సై ప్లెజరు అండ్ దెయిర్ బిజినెస్...." అందామె.

"మిమ్మల్ని చూశాను. మీరు వచ్చారు కాబట్టే మొత్తం విషయం చెప్పాను. నా సలహా వినండి. ఆ ముకుందంగారు తన్ను తాను కాపాడుకోగల సమర్థుడు. ఆయనను రక్షించడానికి ఎందరో వుంటారు. మీరు ఈ వ్యవహారంలో తలదూర్చడంవల్ల ప్రయోజనమేమీ వుండదు ప్రమాదం తప్ప! పైగా ఇంకో రహస్యం విన్నాను నేను. అది మీదాకా వచ్చి వుండదని నేననుకోను...." అంది.

"ఏమిటది?" అన్నాను.

"పార్టీ చూస్తూ చూస్తూ ఏ వర్గాన్నీ వదులుకోదు. ముకుందంగారిని తప్పనిసరి పరిస్థితులలో పార్టీ వదులుకో

వలసి వచ్చింది. అంతమాత్రాన ఆయన వర్గాన్నంతా వదులుకోరు. ముకుందం వర్గంలో మీరు ముఖ్యులని అంతా అనుకొంటూంటారు. ముకుందం పోగొట్టుకొన్న స్థానాన్ని మీరు పొందవచ్చునని పుకారు బయల్దేరింది. అప్పుడు మీరు ముకుందంగారి పలుకుబడి పెంచడానికి కొన్ని ప్రయత్నాలు చేయవచ్చు. ఆయనకు సాయపడ వచ్చు. కానీ ఇప్పుడు శాంతంగా ఊరుకోవడం మంచిది" అందామె. ఆమెకు నా గురించి ఇంత తాపత్రయ మెందుకో తెలియలేదు.

"ఆలోచించాలి...." అన్నాను.

"మా యింటికి రండి. ఆలోచించడానికి బాగుం టుంది—" అందామె.

ఆమెతో వెళ్ళాను.

ఆమె ఇల్లు బాగుంది. పడక గది బాగుంది. ఆ ఇంట్లో వేరెవ్వరూ లేకపోవడం బాగుంది.

అక్కడ ఆలోచించడానికి వేరే ఏముంది?

నా ఆలోచనలను ఆమె పూర్తిగా ఆక్రమించేసింది.

జీవితంలో అన్ని అనుభవాలతోపాటు ఇలాంటి అను భవమూ ఒకటి వుండాలనిపించింది. ఆ అనుభవం నా కెంతగా నచ్చిందంటే ప్రతిరోజూ ఏదో వీలు చూసుకొని ఆమెను కలుస్తూనే వున్నాను.

# 9

డిటెక్టివ్ అంజనేయులు మా యింటికి వచ్చాడు ఆ రోజు.

"ఏమిటి విశేషాలు?" అనడిగాను.

"రేపు మీరు నాకు పాలిక వేలివ్వాల్సి వుంటుంది—" అన్నాడతను.

"అవును—రేపు కదా—" అన్నాను.

"చూశారుగా—నేను నా బాధ్యత నెంత సక్రమంగా నిర్వహించానో—"

"ఇంతవరకూ బాగానే నిర్వహించావు. అయితే నీ బాధ్యత ఇంకా అయిపోలేదు—" అన్నాను.

"ఇంచుమించు అయిపోయినట్లే—"

"అదేంకాదు. హంతకుడు చివరి క్షణందాకా వేచిస్తాడు. తీరికూర్చుని ఎవరూ హత్యచేయాలనుకోడు. అందువల్ల రేపు సాయంత్రందాకా ఎదురుచూడాలి. అప్పుడే గండం గడిచినట్లు...."

"మీరింత కచ్చితంగా చెబుతున్నారు. ముకుందం గారు బ్రతకాలని మీకు లేదా?" అన్నాడు ఆంజనేయులు.

"వుంది కాబట్టే జాగ్రత్త పడుతున్నాను...." అన్నాను.

సరిగ్గా అప్పుడే నా పక్కనున్న ఫోన్ మ్రోగింది. తీశాను.

"హలో!" అన్నాను. అవతలి వార్త వినగానే నేను కొద్దిక్షణాలు నిశ్చేష్టుడైపోయాను.

"ఏమిటి సార్ — అలాగై పోయారు?" అన్నాడు ఆంజనేయులు.

అతికష్టంమీద ప్రయత్నించి — "ముకుందం...." అన్నాను.

"ముకుందంగారు ఫోన్ చేశారా? ఏమయింది సార్?" అన్నాడతను.

"ఫోన్ చేసింది ముకుందం కాదు. ముకుందానికి కారు ఆక్సిడెంటయిందట. డ్రైవర్ అప్పటికప్పుడు చచ్చి

పోయాట. ముకుందం పరిస్థితి కూడా...." అని ఆగి పోయాను. ఫోన్ నా చేతిలోంచి జారిపోయింది.

"అయితే నా పాతిక వేలూ...." డిటెక్టివ్ ఆంజనేయులు గొణుక్కుంటున్నాడు.

నేను హాస్పిటల్ కి పరుగెత్తాను.

అనుకొన్నంతా అయింది. ముకుందం చచ్చిపోయాడు. అసలు ముకుందం కార్లోనే చచ్చిపోయాట్ట. రాజకీయ ప్రముఖుడు కావటంవల్ల హాస్పిటల్ కు తీసుకువెళ్ళేదాకా ఆ విషయం ధృడపర్చలేదట.

ముకుందం చచ్చిపోయాడు. బ్రతికొన్నంత కాలం ఈ జీవితం గురించి ఎంతో తాపత్రయపడ్డాడు. ఏం బావుకొన్నాడు? ఆ తాపత్రయం లేకపోతే మరికొంత కాలం బ్రతికేవాడేమో!

ఫోటోగ్రాఫర్లు, ప్రెస్ రిపోర్టర్లు....అంతా హడావుడి!

ముకుందం పోవడం ద్వారా దేశానికి వాటిల్లిన నష్టం గురించి ప్రముఖులు అభిప్రాయాలు వెలిబుచ్చారు. అతడి ముఖ్యానుచరుడిగా నా అభిప్రాయాలూ సేకరించబడ్డాయి.

కాసేపు నన్ను వేదాంతం బాధించింది.

హఠాత్తుగా నాకు రమ గుర్తుకు వచ్చింది.

ముకుందం చావలేదు. చంపబడ్డాడు. ఈ విషయం యెవరూ అనుకోవడంలేదేమిటి? ఈ యాక్సిడెంట్ ఎలా జరిగింది? ఇది జరగాలని ఎవరైనా పథకం వేశారా?— పోలీసులు కూడా అనుమానంతో వున్నట్లులేదు.

నేను ఇన్స్పెక్టర్ చంద్రశేఖర్ ని కలుసుకొని అభి

ప్రాయా లడిగాను.

"దీని విషయమై మామీద ఎటువంటి వొత్తిడీ లేదు. ముకుందంగారు పార్టీ ప్రముఖుల్లో ఒకరై ఉండివుంటే ఈపాటికి యాక్సిడెంట్ గురించి ఆరాతీయవలసిందిగా డిపార్టుమెంటుకు ఆదేశాలు వచ్చి వుండేవి. ఇప్పుడలాంటి బాధ ఏమీ లేదు. యాక్సిడెంట్ కావాలని యెవరో కల్పించినట్లు అనుమానాలు, ఆధారాలు లేవు. ఈ విషయమై ఆరాలు తీయడం ప్రారంభించామంటే కొరివితో తలగోక్కున్నట్లే అవుతుంది. సులభంగా కేసు తేలిపోయింది కదా—" అన్నాడు చంద్రశేఖర్.

పోలీసులకు సంబంధించినంతవరకూ వారి సుఖం వారు చూసుకొంటారు. ముకుందం ఏమైపోతే వాళ్ళకేం?— నా దగ్గర ఫోటో చూపించి — "పారిపోయిన ఈ హంతకుడి జాడ తెలిసిందా?" అనడిగాను.

"ఇంకా తెలియలేదు—" అన్నాడు చంద్రశేఖర్.

నేను అక్కణ్నించి బయటకు వచ్చేక నాతోపాటు ముకుందానికి ముఖ్యానుచరులుగా వుంటున్న మిగతా అయిదుగురినీ మా యింటికి పిలిచాను.

అంతా ముకుందం పోయాడని బాధపడ్డారు. ఒకడైతే "మనకిది చాలా క్లిష్ట దశ. ముకుందం అండ చూసుకొని ఇంతకాలం ధైర్యంగా ఉన్నాము. ఇప్పుడు మన గతి ఏమవుతుందోనని నాకు భయంగా వుంది—" అన్నాడు.

"అవన్నీ తర్వాత ఆలోచిద్దాము. మీకు గుర్తున్నదో లేదో — రెండువారాల క్రితం మనమంతా సమావేశ మయ్యాము. ఆ రోజే నాకు తెలిసింది. రెండువారాల్లో ముకుందంపైన హత్యాప్రయత్నం జరుగనున్నదని...."

అంతా ఆశ్చర్యపోయారు.

"మరి మాకెందుకు చెప్పలేదు?" అని కొందరంటే—"ఇంతకీ ఇది హత్యా, యాక్సిడెంటా?" అని మరికొందరన్నారు.

"హత్య జరిగే అవకాశమున్నట్లు తెలియగానే ముకుందాన్ని హెచ్చరించాను. అతడు నా మాటలు లక్ష్యపెట్టలేదు. అయినా నేను కొన్ని జాగ్రత్తలు తీసుకొన్నాను. ఓ, డిటెక్టివును కూడా నియమించాను. ముకుందం ఇంటికి ఎవరెవరు వస్తున్నారో, పోతున్నారో అన్నీ కనిపెట్టే ఏర్పాట్లు చేశాను. చివరికి ముకుందం ఇలా యాక్సిడెంట్‌లో చనిపోయాడు. ఇది యాక్సిడెంట్ కాదేమోనని నాకు అనుమానంగా వుంది—" అన్నాను.

అంతా నేను చెప్పింది శాంతంగా విన్నారు.

"ప్రతిపక్షంటే ముకుందం ఈ రోజు దేశాన్ని సంచలన పరిచే వార్త పత్రికా విలేఖరులకు చెప్పి వుండేవాడు-" అన్నాడు నా మిత్రుల్లో ఒకడు.

ఉలిక్కిపడ్డాను. ఇదేనా ముకుందం చావుకు కారణం?

కానీ ముకుందం ఈ విషయాన్ని చాలా రహస్యంగా ఉంచాడు. మా ఆరుగురికీ తప్ప బైటివారికెవ్వరికీ ఇది తెలియదు. అలాంటప్పుడతడి చావుకు ఈ వార్త కారణం కారాదు. కానీ పార్టీ హై కమాండ్‌కు ఈ విషయం తెలిసివుంటే?

నా శరీరం వణికింది.

అది కాదు ముకుందం చావుకు కారణం వేరే వుంది అందామనుకొన్నాను. కానీ నోరు రాలేదు. ముకుందం గురించిన ఈ రహస్యం అతడికి కళంకాన్ని తెచ్చిపెడుతుంది. ప్రస్తుతానికి అది నాకొక్కడికే తెలుసు. అలాంటప్పుడు వీళ్ళందరికీ అది ఎందుకు చెప్పాలి?

అంతేకాదు. ఈ పాయింటు ఆసరాగా తీసుకొని హై కమాండును బెదిరించాలి. ముకుందం లేడిప్పుడు. అతడి స్థానాన్ని నేనాక్రమించాలి.

నా మిత్రుడి వంక చూసి—"ముకుందం ఓ గొప్ప రహస్యాన్ని ఈ రోజు బయటపెట్టనున్నాడన్న విషయం హై కమాండ్‌కు తెలిసింది. వెంటనే అతడి హత్యకు ఏర్పాట్లు జరిగాయి—" అన్నాను.

మళ్ళీ అంతా తెల్లబోయారు.

"అయితే?" అన్నాడొకడు.

"మనం ఊరుకోము. అంతా ఒకటిగా ఉందాం. మనకు తెలిసిన ఈ రహస్యం పత్రికలకు వదిలామంటే— పార్టీ ప్రతిష్ట దెబ్బతింటుంది. ఈ రహస్యం మన గుప్పిట్లో వుండగా పార్టీ మన నేమీ చేయలేదు—...." అన్నాను.

అందరూ ఉత్సాహంగా-"నువ్వు చెప్పింది బాగుంది" అన్నారు.

అప్పటికి విడిపోయాం. మర్నాడు తెల్లవారకుండా నే నాకు ఢిల్లీ నుంచి ట్రంక్ కాల్ వచ్చింది. నేను అర్జంటుగా ఢిల్లీ వెళ్ళాలి.

నా గురించి పత్రికలు రాస్తున్నాయి. పార్టీలో ముకుందం పోగొట్టుకున్న స్థానం నాకు రావచ్చునని ఊహా గానాలు ప్రారంభమయ్యాయి. ఆ ఊహాగానాలు చూసి అవునో, కాదో అనుకోవటమే తప్ప నాకేమీ తెలియదు. ఇప్పుడు ఢిల్లీ నుంచి పిలుపు అందుకే వచ్చిందా?

నేను ఢిల్లీలో విమానం దిగగానే నా కోసం ఓ మనిషి వచ్చాడు. అతడెవరో నాకు తెలియదు. అతడు నా పేరు చెప్పి నా కోసమే వచ్చానని చెప్పాడు. నేనతడు తీసుకొనివచ్చిన కార్లో ఎక్కాను. ఆ కారు

సుమారు గంటన్నర సేపు నన్ను ఢిల్లీ నగరవీధుల్లో తిప్పి తిప్పి చివరకు ఎక్కడో అతి సామాన్యమైన ఇంటిముందు దింపింది. నాకోసం వచ్చిన వ్యక్తి నన్నాయింటి లోపలకు పంపించి తను వెళ్ళిపోయాడు.

లోపల ఓ వృద్ధుడున్నాడు. అతడు నాకు ఫలహారం పెట్టి పళ్ళరసం ఇచ్చాడు. పళ్ళరసం తాగేక నాకు మత్తు వచ్చింది. ఏదో మోసం జరిగిందని అనుకోనే లోగానే నాకు స్పృహ తప్పింది.

# 10

స్పృహ వచ్చేసరికి నేనో చీకటిగదిలో వున్నాను. జరిగిందంతా ఊహించుకోంగుకు ప్రయత్నిస్తున్నాను.

నామీద ఇటువంటి ప్రయత్నం జరుగుతుందని కలలో ఊహించినా నేను కొంత జాగ్రత్తపడి వుండేవాడిని.

యెవరు నన్నిక్కడకు తీసుకొని వచ్చారు? వారు నానుంచి ఏమాశిస్తున్నారు?

నా సందేహాలకు సమాధానమన్నట్లుగా గదిలో దీపం వెలిగింది. నా యెదురుగా నల్లని ముసుగులో ఓ మనిషి వున్నాడు.

"ఎవరు నువ్వు?" అన్నాను అప్రయత్నంగా.

ఆ ముసుగు మనిషి, "నే నెప్పుడూ ముసుగులోనే వుంటాను. ఏ పార్టీ ఏ దేశాన్నేలినా-ఆ పార్టీని శాసించ గల శక్తిసామర్థ్యాలు నాకున్నాయి—" అన్నాడు.

"ఎవరు నువ్వు?" అన్నాను.

"ముకుందం హత్యకు ఏర్పాట్లు చేసినవాడిని—" అన్నాడతను.

క్షణంపాటు నాకు నోట మాటరాలేదు.

"ముకుందం ఏం పాపం చేశాడు?" అన్నాను నీరసంగా.

"పార్టీ తనను రక్షించటం లేదన్న కోపంతో అతడు పార్టీని దెబ్బకొట్టే రహస్యం బయట పెట్టాలనుకొన్నాడు. అది చాలా పెద్ద తప్పు...." అన్నాడతను.

"పార్టీలో తప్పుండడం తప్పుకాదా?" అన్నాను.

"రాజకీయాల్లో ఒక్కటి తప్ప మరేదీ తప్పుకాదు" అన్నాడతను.

"ఏమిటది?"

"అధికారంలో ఏ పార్టీ వుంటే దాన్ని దెబ్బతీయాలనుకోవడం...."

అప్పుడు నాకు గుర్తువచ్చింది — "అతడి నింతకాలం ఎందుకు బ్రతకనిచ్చారు? ఈ మాట అతడు రెండువారాల క్రితమే అన్నాడు...."

ముకుందం పార్టీ గుప్పిట్లో వున్నాడు. అతడి జీవిత రహస్యాలెన్నో ముసుగుమనిషివద్ద వున్నాయి. అందువల్లనే ముకుందం పార్టీకి ఎదురుతిరగడానికి తటపటాయిస్తున్నాడు. ముసుగుమనిషి నాకు కొన్ని ఫోటోలు చూపించాడు. వాటిలో రమ, ముకుందం పూర్తి నగ్నంగా, పరమ అసభ్యంగా ఉన్నారు.

"ఈ ఫోటోలు బైటపడతాయని అతడు భయపడ్డాడు. కానీ ఇప్పుడతడు తెగించాడు. నలుగురినీ తృప్తి పర్చడంకోసం నామకః ఒక విచారణ సంఘాన్ని నియమిస్తున్నామనీ—దానివల్ల తనకేమీ ప్రమాదముండదనీ హామీ ఇచ్చినా నమ్మలేదు. తనకేమీ ప్రాణప్రమాదం ముండదనీ హామీ ఇచ్చినా నమ్మలేదు. తనకేదో ప్రాణ ప్రమాదం వచ్చిందని అనుమానించి నిజంగానే ప్రాణాలు

పోగొట్టుకొన్నాడు-" అని ముసుగు మనిషి నిట్టూర్చాడు.

"అసలు ముకుందం పార్టీ రహస్యాన్ని బైట పెడతా నన్నట్టు మీ కెలా తెలిసింది?" అన్నాను. ఈ విషయాన్ని ముకుందం చాలా రహస్యంగా ఉంచాడని నాకు తెలుసు.

"అతడి అనుచరులలో నా ఏజంటు వున్నాడు—"

ఉలిక్కి పడ్డాను. అంటే?

ముసుగు మనిషి కళ్ళు నన్నే చూస్తున్నాయి—"నిన్న నువ్వు నీ మిత్ర బృందంతో అన్న మాటలు మాకు చేరాయి.—" అన్నాడతడు.

"అందుకే నాకు పిలుపు వచ్చిందా?" అన్నాను ఆశ్చర్యంగా.

"అవును. నువ్విప్పుడు పార్టీలో ముకుందం స్థానాన్ని ఆక్రమించబోతున్నావు. అందువల్ల నా గురించి కొంత తెలుసుకోక తప్పదు...." అన్నాడతడు.

అతడు చెబుతున్నది నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

ముకుందం పార్టీ రహస్యాన్ని బయటపెట్టాలను కోగానే ఆ వార్త ముసుగు మనిషిని చేరింది. అతడు వెంటనే ముకుందం చావుకు ముహూర్తం పెట్టాడు. అది యాక్సిడెంటుగా చూపగల సామర్థ్యం ముసుగు మనిషికి వున్నది. అయినప్పటికీ ముందు జాగ్రత్తకోసం ముకుందం ముఖ్యానుచరుడినైన నాకు—అతడు హత్య చేయబడే అవకాశమున్నదన్న నమ్మకం కలిగించాడు.

ఎట్టి పరిస్థితుల్లోనూ అనుమానం పార్టీ హై కమండ్ మీదకు పోకూడదను. అందుకనే రమ కథ బయటకు వచ్చింది. రమ గురించి ముకుందం చెప్పింది నిజం. రమ చెప్పింది చాలావరకూ అబద్ధం. అసలామెకు అన్న లేడు.

"కానీ నీ ఆలోచనలు తప్పుదారిలో నడుస్తున్నాయి. నువ్వు పార్టీ హైకమాండ్‌పై నేరం ఆరోపించాలను కొన్నావు. హైకమాండ్ నిర్దోషిత్వాన్ని ఋజావు చేయగల శక్తి నాకున్నది. ముకుందంపైన రమ కారణంగా హత్యజరిగే అవకాశమున్నదని నువ్వు స్వయంగా డిటెక్టివ్ ఏంజనేయులుకు కాగితం రాసిచ్చావు. అదొక్కటి చాలు—పార్టీ నిర్దోషిత్వాన్ని బయటపెట్ట డానికి!

అయితే నిన్నిక్కడికి పిలవడానికి రెండు కారణా లున్నాయి. అసలు పార్టీ మీద ఇటువంటి ఆరోపణ రాకుండా చేయడం ఒకటి. సమర్థుడవైన నిన్ను పార్టీకి దూరం చేసుకోకూడదన్నది రెండు. పార్టీ సమర్థుల నెన్నడూ జారవిడుచుకోదు.

ముకుందం విరాళాల విషయంలో కాస్త తెలివి తక్కువగానే ప్రవర్తించాడు. సమర్థుల జాబితానుంచి అతడి పేరు తొలగించబడింది. పార్టీ ఇప్పుడు నీకు మంచి అవకాశాన్నిస్తోంది. అది ఉపయోగించుకో. నీ సమర్థతను నిరూపించుకో. నువ్వు వేసే ప్రతి అడుగూ ఆలోచించి వేయి...." అన్నాడు ముసుగుమనిషి.

"ఒకవేళ పార్టీ ప్రముఖులు తప్పుచేస్తే నేను వారిని విమర్శించడం తప్పవుతుందా?" అడిగాను.

"ఇతరుల తప్పు ఎంచేముందు—తప్పులు ఎంచే అర్హత నీలో ఎంతవరకూ ఉన్నదో, గ్రహించు—" అంటూ ముసుగుమనిషి నాకు మరికొన్ని ఫొటోలు చూపించాడు.

నేను అవాక్కయిపోయాను. ఫోటోల్లో నేను.... జానకి...

"ఎవరికైనా పార్టీలో ప్రముఖ స్థానం ఇచ్చేముందు

వారిని మా గుప్పిట్లో వుంచుకో నేందుకు అన్ని ఏర్పాట్లూ జరుగుతాయి—" అని నవ్వాడు ముసుగు మనిషి.

నాకింక మాట రావడంలేదు.

ముసుగు మనిషి అంటున్నాడు—"ఇక్కణ్నించి వెళ్ళి హైకమాండును కలుసుకొంటావు. తిరిగి మీ ఊరు చేరే టప్పుడు నీకక్కడ ఘన స్వాగతం లభిస్తుంది. నీ అనుచరుల మనసుల్లో విషబీజాలుండకుండా చూడు. పార్టీ ప్రతిష్ట పెంచే మాటలు చెప్పు. నీకు నా ఆశీర్వాదముంటుంది...."

నాకు అర్థమయింది. నేను ఇప్పుడు ముకుందం స్థానం ఆక్రమిస్తున్నాను. అన్నివిధాలా ముకుందం స్థానం ఆక్రమిస్తున్నాను. కానీ....

"ఎవరు నువ్వు?" మళ్ళీ అడిగాను.

"నేను ముసుగు మనిషిని. ఎప్పుడూ ముసుగులో నే వుంటాను—" అన్నాడతడు.

అప్పుడు నాకు అనిపించింది. రాజకీయాల్లో అంతా ముసుగు మనుషులే! ఇప్పుడు నేనూ వాళ్ళలో ఒకడి నయ్యాను.

—: అయిపోయింది :—

# మూడు నాణేలు

## బొమ్మిడి అచ్చారావు

మోహన్ చాలా సేపు మాట్లాడలేదు.

"ఏమిటి మౌనం? ఆడదాని సంపాదన మీద బతకటం నీకు నామోషీ అని చెప్పరాదూ?"

లలిత మాటలకు చివ్వున తలెత్తాడు మోహన్.

"నువ్వీ మాటలు నాలో కోపం తెప్పించాలనా, పౌరుషం తెప్పించాలనా, ఎందుకంటున్నావు?" అన్నాడు. అతని కంఠంలో బాధ తొణికిసలాడింది.

"కాకపోతే ఏమిటి, ఇంత సేపూ రాని నీ ఉద్యోగం గురించి బాధపడేకన్నా, ఉన్న నా ఉద్యోగం చూసి ధైర్యం తెచ్చుకొని సంతోషించరాదూ?"

"నాకు ఉద్యోగం లేకుండా, ఎందుకో, నిన్ను పెళ్ళి చేసుకోవాలంటే ఏదోలా వుంది లలితా! నన్ను నేను సమాధాన పరుచుకోలేక పోతున్నాను."

"నువ్వేదో లేనిపోనివి ఊహించుకొని అనవసరంగా వర్రీ అవుతున్నావు. మా ఆఫీసరుకి చెప్పి ఏదైనా

వేకన్సీస్ వున్నాయేమో కనుక్కోనా?"

"వద్దు, వద్దు. ఒకవేళ వున్నా అవి నాదాకా రావు. ఒకవేళ నీ మాటమీద నాకు ఉద్యోగం వచ్చినా, నలుగురు చాలా చులకనగా చూస్తారు, తేలిగ్గా మాట్లాడతారు-ఆడదానివల్ల ఉద్యోగం సంపాదించానని! అదింకా దుర్భరం!"

"చూడు, మోహన్! దీన్ని 'ఇన్ ఫీరియారిటీ కాంప్లెక్స్' అని ఇంగ్లీషులో ముద్దుగా పిలుస్తారు. నేను చెప్పిన సలహాకు నువ్వు ఏదో సాకు చూపిస్తున్నావు. నీకు బాధ కలిగించే విషయమైనా చెప్పేస్తున్నాను—నీకు ఆడదాని సంపాదన అంటే చాలా తేలిక భావం వుంది. అంటే ఆడదంటే నీ దృష్టిలో చాలా చులకన."

"నో నో అదేంకాదు లలీ! నన్నపార్థం చేసుకోకు. ఉద్యోగం సంపాదించాలనే తపన నాచేత అలా అని పిస్తోంది. నువ్వన్నా, నీ ఉద్యోగమన్నా నాకేమీ చిన్న చూపులేదు, నీకు వెనక పోషించాల్సినవాళ్ళు లేరు కాబట్టి నీ జీతం, నీ యిష్టం! కాని నాకింకా ఓ తల్లి, తమ్ముడు వున్నారు. వాళ్ళని పోషించాల్సిన బాధ్యత నామీదుంది. నీ జీతం మనిద్దరికీ వాడుకోవటానికయితే నాకిష్టమే! కాని వాళ్ళిద్దర్నీ నీ జీతంమీద పోషించాలంటే..ఆలోచించు. అందుకే నేను వెనుతీసేది."

లలిత కాసేపు మాట్లాడలేదు.

మోహన్ కూడా సీరియస్‌గా ఆలోచిస్తూ వుండి పోయాడు. అతని చేతులు యాంత్రికంగా గార్డెన్‌లోని గడ్డి మొక్కల్ని పీకేస్తున్నాయి. అన్యమనస్కంగా వున్నాడన్న విషయం అతని ప్రవర్తన సూచిస్తోంది.

"ఏమిటది? మొక్కలు పీకేస్తున్నావు, గార్డెన్

వాచ్ మెన్ చూస్తే నీతో తగాదా వేసుకొంటాడు!”
అన్న లలిత మాటలతో మోహన్ యీ లోకంలోకి వచ్చి తను చేసిన పనికి సిగ్గుపడ్డాడు.

చుట్టూ చూసుకొన్నాడు. చాలా సేపటికి పారేశాడు. అతని దృష్టిని ఓ వస్తువు ఆకర్షించింది. చటుక్కున దాన్ని చేతిలోకి తీసుకొన్నాడు. గుండ్రటి కాయిన్!

పైన మట్టి తుడిచాడు. బంగారు నాణెం.

ఆశ్చర్యంగా చూస్తోంది లలిత.

మోహన్ పరీక్షగా అటు యిటు తిప్పాడు. ఇండియా నాణెంకాదు. ఈజిప్టుది. దానిమీద సంవత్సరం చూసి యిద్దరు నోళ్ళు వెళ్ళబెట్టారు.

అది పదకొండో శతాబ్దం నాటిది! అప్పుడు ఈజిప్టుని పరిపాలించిన రాజు బొమ్మ ఓ పక్క, రెండో పక్క పిరమిడ్ చిహ్నం, దానికిందుగా సంవత్సరం ముద్రింపబడి వున్నాయి.

ముందుగా లలితే ఆశ్చర్యంనించి తేరుకొంది.

“ఇక్కడ యీ నాణెన్ని యెవరు పాతిపెట్టి వుంటారు?” అన్నది సాలోచనగా.

“పాతిపెట్టారో, పారేసుకొన్నారో! లేక ఎప్పుడో వర్షానికి కొట్టుకొనివచ్చి కప్పబడిపోయిందో?....”

“నో నో, ఇది ఎప్పుడో భూమిలో పూడుకుపోయిన నాణెం కాదు. ఈ మధ్యనే ఎవరో కావాలని పాతిపెట్టి వుండాలి!”

మోహన్ కళ్ళు పెద్దవయ్యాయి.

“ఎందుకలా అనుకొంటున్నావు?”

“వెరీ సింపుల్. కాయిన్ మీద అంటిన మట్టి చాలా తేలికగా జారిపోయింది. చాన్నాళ్ళ క్రితం పూడుకు

పోయివుంటే మట్టి బాగా కాయిన్‌కి పట్టేసి తోమితే గాని అసలు నాణెం రూపు కనిపించేది కాదు."

మోహన్ తలూపాడు.

"నంబర్ టూ మనచుట్టూ నేలంతా పచ్చికతో నిండి వుంది. నువ్వు మొక్కలు పీకినచోట పచ్చికలేదు. నేల గుల్లగా తవ్వినట్టుంది. ఈ మొక్కలు కావాలనే ఎవరో పాతిపెట్టారు, నేల తవ్వి. అందుకే యీ మొక్కలు పాతినంత మేరా గడ్డిలేదు."

మోహన్ క్షణమాత్రం ఊహించలేకపోయినందుకు మరోసారి సిగ్గుపడ్డాడు.

"అయితే, ఈ కాయిన్ ఎవరో కావాలనే ఇక్కడ పాతిపెట్టి వుండాలంటావు, అంతేనా?"

"ఖచ్చితంగా అంతే! ఎవరినుంచో సంగ్రహించబడి వుండాలి. దాన్ని కొన్నాళ్ళపాటు దాచిపెట్టాల్సిన అవసరం వచ్చి వుంటుంది. అందుకా వ్యక్తి యీ స్థలం ఎన్నుకొన్నాడు."

"ఇదంతా నీ అనుమానం కావచ్చు!"

"నిరాధారమయిన అనుమానం కాదు."

"అపరాధ పరిశోధన పత్రిక చదువుతావు కదూ! రీజనింగ్ బాగా అలవడింది."

"థాంక్యూ ఫర్ యువర్ కాంప్లిమెంట్!"

"అయితే యిప్పుడేం చెయ్యాలి?"

"బుద్ధిగా ఆ నాణెం మళ్ళీ యథాతథంగా పాతిపెట్టెయ్యటమే!"

"ఇంతటి అపురూపము, అలభ్యము అయిన నాణెం చేతులారా వదులుకోవాలా?

"నాణెం కోసం ప్రాణాలే వదులుకోవలసివస్తే...?"

ఉలిక్కి పడ్డాడు మోహన్.

"ఏమిటి నువ్వంటున్నది....?"

"ఇది అపురూపమైన నాణెం కాబట్టే యింత జాగ్రత్తగా, మనకంట పడకుండా భూస్థాపితం చేయబడింది! అనుకోకుండా, యధాలాపంగా నువ్వా పిచ్చి మొక్కలు పీకుతుంటే, దానంతటది బయటపడింది. అది మనకంట బడలేదనుకొని పూడ్చిపెట్టేస్తే ఎవరికీ సమస్య వుండదు."

"అయామ్ సారీ లలీ! దీని విలువ రూపాయల్లో నాకు తెలీదుగాని, యిలాంటి అపురూపమైన నాణెం వదులుకోలేను. నా హాబీ నీకు తెలుసుగా. ఇలాంటివి సేకరించటం నాకెంతో యిష్టం."

"నా మాట విను మోహన్. ఆ నాణెం తాలూకు మనిషి వెయ్యికళ్ళతో దీన్ని కాపలా కాసుకొంటూ వుండొచ్చు. నా ఊహే నిజమయితే యిప్పుడు దీన్ని నువ్వు యిటికి తియ్యటం కూడా ఏ మూలనించో పరిశీలించినా ఆశ్చర్యపడనక్కర్లేదు. యింత విశాలమైన గార్డెన్‌లో యెవరెవరు ఏం చేస్తున్నారో యెవరు చూడొచ్చారు?"

మోహన్ తన వైఖరి మానలేదు.

లలిత బలవంతాన మోహన్ చేతిలోనించి నాణెంతీసి పాతిపెట్టేసి, పైన మొక్కలు సర్దేసింది మట్టి కప్పి.

మోహన్ ఇబ్బందిగా చూశాడు.

"పద, యింకో క్షణం ఇక్కడ వుండొద్దు. మనం ఈ సంగతి యీ స్పాట్‌లోనే మరిచిపోదాం. మరోసారి ఈ స్థలంలో కూచోవద్దు" తను లేస్తూ అతని చెయ్యిపట్టి లేపింది లలిత.

మోహన్ అయిష్టంగానే లేచి ఆమె వెంట గార్డెన్ బయటికి నడిచాడు.

"మన సమస్యకు సరైన పరిష్కారం దొరకటంలేదు. నువ్వు నా మాట వింటావని, మన్నిస్తావని ఆశిస్తున్నాను" అన్నది లలిత తన రూట్ సిటీబస్ ఎక్కుతూ.

మోహన్ మౌనంగా నిల్చుండిపోయాడు.

బస్ వెళ్ళిపోయింది.

మోహన్ చకచక గార్డెన్‌లోకి మళ్ళీ వచ్చాడు. కాయిన్ పాతిన స్పాట్‌కి వెళ్ళాడు. గబగబ మట్టిని తొలగించాడు.

లలిత పాతిన ముక్కలు ఎవరో పీకేసినట్టుంది. పక్కన చిందరవందరగా పడివున్నాయి. కంగారులో మోహన్ అది గమనించలేదు.

ఎంత లోతుగా వెతికినా కాయిన్ కనిపించలేదు. మళ్ళీ మట్టి బాగా పెళ్ళగించి చూశాడు.

నాణెం లేదు!

## 2

"నీకోసం ఎవరో వచ్చారబ్బాయ్!"

తల్లి మాటలకు లోపలినుండి బయిటికి వచ్చాడు మోహన్.

బయట హాలు అని చెప్పబడే చిన్న గది వుంది అందులో ఎవరో అపరిచిత వ్యక్తి కూచుని వున్నాడు.

"మీరెవరో నేనెప్పుడూ చూసిన గుర్తులేదు" అన్నాడు మోహన్.

ఆ వ్యక్తి వంకరగా నవ్వాడు.

"నువ్వు నా మాట వింటే మిత్రులం, లేకుంటే శత్రులం అవుతాం మనం, నీకేది యిష్టం?" అన్నాడు.

మోహన్ తెల్లబోయి చూశాడు. లోపలికి తొంగి చూశాడు. తల్లి వంటగదిలో వున్నట్టుంది. తమ మాటలు వినే అవకాశంలేదు.

"మీరనేదేమిటో...."

మోహన్ మాటలు పూర్తికానేలేదు. ఆ అపరిచిత వ్యక్తి చేతిలో కత్తి తళుక్కుమంది.

"నువు మర్యాదస్తుడవనే నా నమ్మకం. నా మాట కాదన్నా, నన్ను మభ్యపెట్టాలని చూసినా ఈ కత్తి నీ గుండెల్లోకి దిగిపోతుంది" అతను మళ్ళీ నవ్వాడు.

మోహన్ అయోమయంగా చూశాడు.

ఇంతలో మోహన్ తల్లి రెండు కప్పుల్తో టీ తీసుకొని వచ్చి స్టూలుమీద పెట్టింది. అపరిచిత వ్యక్తి చేతిలో యిప్పుడు కత్తిలేదు.

మోహన్ తల్లి లోనికి వెళ్ళిపోయింది

అపరిచిత వ్యక్తి మోహన్ కళ్ళలోకి సూటిగా చూశాడు; "ఆ నాణెం యెక్కడ?" చలి పిడుగులాంటి ఆ మాటకి గతుక్కుమన్నాడు మోహన్.

"ఏ నాణెం?"

"నిన్న సాయంత్రం నువు పబ్లిక్ గార్డెన్‌లో తవ్వి తీశావే, ఆ నాణెం—ఈజిప్టు కాయిన్."

"ఎవరన్నారు అది నేను తీశానని?"

అతను నవ్వాడు.

"మిష్టర్ నాకు వెయ్యి కళ్ళు. నేను స్వయంగా చూశాను. మట్టి పెళ్ళగించి ఆ కాయిన్ నువు తియ్యటం."

"మొదట నేను అనుకోకుండా ఆ కాయిన్ తీయటం జరిగింది. అయితే దాన్ని మళ్ళీ కప్పెట్టేశాం."

"అబద్ధం! నువ్వూ, నీ ప్రియురాలు ఆ కాయిన్

గురించి చర్చించుకున్నారు. ఆమె కప్పిపెట్టెయ్యమంటే నువ్వు ఒప్పుకోలేదు. దాన్ని నీ దగ్గరే దాచుకున్నావు. ఆ తర్వాత మీరిద్దరు అక్కణ్ణించి లేచివెళ్ళిపోయారు."

"నేను దాచుకోవాలనుకొన్న మాట నిజమే! కాని లలిత బలవంతాన నానుంచి లాక్కొని తనే స్వయంగా భూమిలో పూడ్చేసింది."

"కథ చెప్పకు. మీరిద్దరు గార్డెన్ బయటికి వెళ్ళగానే నేను వెంటనే అక్కడ కాయిన్ కోసం వెతికాను. ఖాళీ గొయ్యి నన్ను వెక్కిరించింది. అంతలోనే మరో వ్యక్తి దాన్ని కాజేశాడంటావా?"

"నిజంగా అంతే జరిగింది. నేను లలితని బస్ ఎక్కించి, ఆ కాయిన్ పట్ల మమకారం వదులుకోలేక మళ్ళీ గార్డెన్‌లోకి వచ్చి స్పాట్‌లో వెతికాను. అప్పటికే యెవరో మట్టి పెళ్ళగించి కాయిన్ తీసుకుపోయారు. మొక్కలు చుట్టూ చిందరవందరగా పడివున్నాయి."

"నేను నమ్మను. నేను వెతికేసరికే మొక్కలు పీకేసి వున్నాయి. మట్టి పెళ్ళగించి వుంది. నీకు నాకు మధ్య అంత తొందరగా, అంత స్వల్ప వ్యవధిలో మరో వ్యక్తి ఆ కాయిన్ చేత చిక్కించుకున్నాడంటే నమ్మేటంత ఫూల్‌ని కాదు."

"నీకెలా నచ్చచెప్పాలో అర్థంకావటంలేదు. మేము కూచున్నది ఎవరూ కూచోని మరుగు ప్రదేశం. చుట్టూ పొదలు. ఆ పొదల చాటున మరో వ్యక్తి పొంచివుంటే కనిపించే అవకాశం లేనంత దట్టమైన పొదలవి. నువు మేం వెళ్ళేవరకు చూశావు కదా! ఈ లోపల, అంటే మేము అక్కణ్ణించి లేచి బయటకు వచ్చేలోపల ఆ

సమీపంలోనే ఎవరైనా వ్యక్తి యిది చూసి వుంటే, నీకు కూడా కనిపించకుండా ఆ కాయిన్ చేజిక్కించుకునే అవకాశముంది. అదే జరిగింది యీ విషయంలో."

"మిస్టర్! నన్నింకా నమ్మించాలని కట్టు కథ అల్లకు. నేను పగబట్టిన కోడెని తాచును. నాతో ఆటలు వద్దు. నీకు యిరవై నాలుగు గంటలు గడువిస్తున్నాను. ఈలోగా నాకా కాయిన్ కావాలి. దాని ఇప్పటి విలువ పన్నెండు గ్రాముల బంగారం కన్న ఎక్కువుండదు. అంటే దాదాపు రెండు వేలు. నీకు మరో వెయ్యి అదనంగా యిస్తాను. డబ్బు కోసమే నువ్వా కాయిన్ తీసుకొంటే, ఆ డబ్బు నేనిస్తాను. అది నాకు వెంటనే స్వాధీనం చెయ్యి."

మోహన్ కోపంగా చూశాడతని వంక.

"నేనెంత చెప్పినా వినుపించుకోవేం? నీ పాపిష్టి డబ్బు కోసం నేనాశపడను. పురాతన వస్తువులని సేకరించడం నా హాబీ. అందుకే ఆ కాయిన్ జాగ్రత్త పెడదామని సరదాపడ్డాను. లలిత వద్దంటే ఆమె మాట ప్రకారం పూడ్చెయ్యటానికి ఆమెకిచ్చాను. నా కళ్ళ ముందే దాన్ని పూడ్చి మొక్కలు పైన సర్దేసింది."

"ఆ కాయిన్ మీద ఆమె మోజుపడిందేమో! దాన్ని తనే తస్కరించి పూడ్చేసినట్టు నాటకమాడిందేమో?"

"ఛ ఛ! మరీ అంత నీచంగా మాట్లాడకు. ఆమెకు అలాంటి తక్కువ బుద్ధి ఏ కోశానా లేదు. ఆమె కాయిన్ మట్టిలో పూడ్చెయటం కళ్ళారా చూశాను."

"నీ మొండి వాదనతో నా టైం పాడుచేశావు. రేపు ఉదయం సరిగ్గా యిదే సమయానికి వస్తాను. కాయిన్ నా స్వాధీనం చేశావా సరే, లేకుంటే ఎల్లుండి

సూర్యోదయాన్ని చూడవు. వస్తాను."

అపరిచిత వ్యక్తి విషపుమాపు విసిరి వెళ్ళిపోయాడు.

మోహన్ చేష్టలుడిగి నిలబడిపోయాడు.

## 3

"వెల్‌కం బ్రదర్!" మనోహర్ చిన్నగా నవ్వాడు.

రహీం కోరగా చూశాడు.

"కాయిన్ చేజారిపోయింది. యెవడో కొట్టేశాడు."

మనోహర్ నిటారుగా చూచున్నాడు.

"ఏమిటి కొత్త కథ అల్లుతున్నావా?"

"నో నో, కథ కాదు. పబ్లిక్ గార్డెన్‌లో ఎవడికీ కనిపించని చోట దాచాను నిన్నరాత్రి చూడబోతే కాయిన్ లేదు."

"ఒకచోట పాతి మరోచోట వెదికావేమో, సరిగ్గా గుర్తుపెట్టుకున్నావా?"

"గుర్తే! పాతినచోట నేల సరిచేసి, క్రోటన్ మొక్కలు పాతాను. అవి యెవడో పీకేశాడు."

"ఐ.సీ. నువ్వు పాతటం ఎవడైనా గమనించాడేమో?"

"ఎవరూ చూడని సమయంలో రాత్రి పదకొండుంన్నర ప్రాంతాల పాతాను. ఎప్పటికప్పుడు వెరిఫై చేసుకుంటూనే వున్నాను. క్రోటన్స్ కూడా బతికింది. దాదాపు నెలరోజులు ఎవరికీ కనపడకుండా రక్షించుకుంటూ వచ్చాను. నిన్న ఎవడిచేతిలోనో పడిపోయింది."

"చిత్రంగా వుందే! ఈ కాయిన్స్ గురించి తెలిసింది ముగ్గురికే! అందులో యిద్దరు మనం. మూడోవాడు సులేమాన్ కాయిన్‌తోబాటు మాయమయి నెలదాటింది. నా కాయిన్ యిదిగో భద్రంగా ఇక్కడ దాచాను"

మనోహర్ సీలింగ్ ఫాన్ నట్లు విప్పి మోటర్ డైప్లేటు

ఓపెన్ చేసి, కీచుగా అరిచాడు.

"అరె భాయ్, ఇందులో కాయిన్ మాయమయింది. యెవడో కొట్టేశాడు."

రహీం అనుమానంగా చూశాడు మనోహర్ వంక.

"నిజం భాయ్, నిన్న రాత్రి కూడా చూశాను. భద్రంగా వుంది. తెల్లారేసరికి ఎలా మాయమయిందో అర్థంకాదు."

"నమ్మమంటావా?"

"అబద్ధం చెప్పాల్సిన ఖర్మ నాకేముంది? నువు చెప్పిన విషయం నేను నమ్మేనా లేదా! నమ్మకం లేనిది ఈ బిజినెస్ ఎలా చెయ్యగలం భాయ్!"

రహీం కణతలు రుద్దుకుంటూ దీర్ఘాలోచనలో పడిపోయాడు.

మనోహర్ బోనులో పెట్టిన పులిలా గదిలో పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ పచార్లు చేస్తున్నాడు.

"అయితే, యిది ఆ సులేమాన్‌గాడి పనే అయి వుంటుంది. బేరం మన ముగ్గురివద్దా వున్న మూడు నాణేలకు కుదిరింది. మూడు నాణేలు ఒక్కచోటు కలిసేనే దానికి నిర్ణయించిన ధర పలుకుతుంది. అవకాశం చూసి సులేమాన్ నీ నాణెం, నా నాణెం దొరకబుచ్చుకున్నాడు. ఈసరికి వాడు ఇండియా వదిలేసి వుంటాడు. ఒకటా, రెండా, ఇరవై లక్షలు! ఇరవై లక్షల బిజినెస్ వాడొక్కడి పరం అయిపోయింది."

"ఏం చెయ్యాలి? ఆ సులేమాన్‌గాడి ఆచూకీ ఎలా తెలుస్తుంది? వాడ్ని ప్రాణాలతో వదలకూడదు."

"అసలు వాడు మన చేతికి దొరికితేనే కదా వాడి అంతు చూసేది? చేజారిపోయాడు."

"ఐడియా!" అరిచాడు రహీం.

"ఏమిటది?"

"మనతో బిజినెస్ టరమ్స్ కుదుర్చుకొన్న అరబ్ పార్టీని కల్సుకొంటే...."

"ఎలా కల్సుకోగలం? సౌదీ అరేబియా ఉన్న పళంగా ఎలా వెళ్తాం ఇప్పుడు?"

"వెళ్ళనక్కర్లేదు. ప్రతి శుక్రవారం సౌదీనుండి ఆ పార్టీ తాలూకు రిప్రజెంటేటివ్స్ వస్తుంటారు. వాళ్ళ నడిగితే అసలు సంగతి తెలిసిపోతుంది."

"గుడ్ అయిడియా!"

## 4

"వెరీగుడ్ జాన్సన్! మొత్తానికి సాధించుకొచ్చావన్నమాట!" ప్రశంసగా చూశాడు ఫరూక్ అలీ.

జాన్సన్ గుంభనగా నవ్వాడు.

"రహీం, మనోహార్ వద్దనున్న కాయిన్స్ ఎలాగో సంపాదించగలిగాను. అసలైనవాడు సులేమాన్ ఎక్కడో మాయమయ్యాడు. అతని ఆచూకీ తెలిస్తేగాని, ఆ కాయిన్ చేజిక్కించుకోలేం. మూడూ కలిస్తేగాని ఇరవై లక్షలు మనకు చిక్కవు."

"కరెక్టే—కాని, ఆ సులేమాన్ ఏమయిపోయాడో, అసలు బతికున్నాడో లేదో ఎలా తెలుసుకోవటం?"

"మన మనుషులు వేటకుక్కల్లాంటి వాళ్ళు. ఇండియాలో ఏ మారుమూల దాగినా పట్టేస్తారు."

"వాడు ఇండియా వదిలేసి వుంటే?"

"మనది ఇంటర్నేషనల్ స్మగ్లింగ్! మన ఏజెంట్సుకి చెప్పివుంచామంటే సులేమాన్ని బతికుండగాగాని, శవంగాగాని పట్టేస్తారు."

"శవాన్ని మనమేం చేసుకుంటాం?"

"ఏవీ కాయిన్స్!?"

జాన్సన్ అందించాడు.

ఫరూక్ ఆనందంగా తలాడించాడు.

ఓ కాయిన్ పదో శతాబ్దాలనాటి ఈజిప్టు దేశానిది. రెండోది పదకొండో శతాబ్దం నాటిది ఈజిప్టుదే!

"తొమ్మిదో శతాబ్దం కాయిన్ సులేమాన్ దగ్గరుంది."

ఫరూక్ అలీ సాలోచనగా తలూపాడు.

"అదే అన్నిటికన్న అపురూపమయినది. ఈ రెండూ వుండి అదిలేక విలువలేనివే! రెండు లక్షలు కూడా యెవరూ ఇవ్వరు."

"మూడింటికి ఇరవై లక్షలు ఆఫరుంది."

"అదే కదా, నా బాధ."

"పది లక్షలు నీకు రావాల్సి వున్నా, శ్రమకు ఫలితంగా రెండు లక్షలు నేను ఎక్స్ట్రా తీసుకొంటాను."

"కరక్టే! నీకు ఎలాంటి సాయం కావాలన్నా నేను సిద్ధంగా వున్నాను. ఎంత ఖర్చయినా సరే సులేమాన్ దగ్గర్నుంచి దాన్ని సాధించు."

"సాధించి తీరతాను. నా ప్రయత్నాలు కొనసాగిస్తాను, సులేమాన్ జాడ తెల్సుకోవటానికి మన ఏజెంట్సుకి వర్తమానాలు పంపించు" అన్నాడు జాన్సన్.

# 5

"ఇదిగో ఇవి హతుని వివరాలు."

ఇన్స్పెక్టర్ శ్రీనివాస్ అందించిన ఫైలు తీసుకొని ఆమూలాగ్రం పరిశీలించాడు డిటెక్టివ్ కిరణ్.

"హతుడి పేరు సులేమాన్. పురావస్తు ప్రదర్శనశాల

వాచ్‌మన్. రెండు నెలలుగా పరారీలో వున్నాడు. అతను పరారీ అయిన రోజే పురావస్తు ప్రదర్శనశాలలో భద్రపరచబడిన అమూల్యమైన బంగారు నాణెం మాయమయింది. అది ఈజిప్టు దేశం మనకు బహూకరించిన తొమ్మిదో శతాబ్దంనాటి ఈజిప్టు నాణెం. చిత్రంగా ఆ నాణెం మాయమయిన ఒకటి రెండు రోజుల తేడాలో బ్రిటన్ మ్యూజియంలోని పదో శతాబ్దంనాటి ఈజిప్టు నాణెం, న్యూయార్క్ మ్యూజియంలోవీ పదకొండో శతాబ్దంనాటి నాణెం మాయమయ్యాయి. ఇవిగో వాటి తాలూకు పేపర్ కటింగ్స్."

మరో ఫైలు కిరణ్ అందించాడు శ్రీనివాస్.

కిరణ్ వాటిని చదివి ఫైలు శ్రీనివాస్‌కి ఇచ్చేస్తూ, "అయితే ఈ మూడు నాణేలు ఈజిప్టువే కావటం, మూడూ రోజులు తేడాలో అపహరింపబడటం-ఇదంతా ప్లాన్‌డ్‌గా జరిగిందన్న విషయాన్ని రుజువుచేస్తున్నాయి. అంతేనా?" అన్నాడు.

"ఎగ్జాట్లీ. ఇవి చాలా అపురూపమైన నాణేలు. మ్యూజియంస్ ప్రతిష్ఠకి సంబంధించిన వ్యవహారం. అందుకే భారత ప్రభుత్వం దీని విషయమై చాలా శ్రద్ధ వహిస్తున్నది."

కిరణ్ తలూపాడు.

"బ్రిటన్, న్యూయార్క్, ఇండియా మూడు విభిన్న దేశాల ప్రదర్శనశాలలనించి ఒకే రకమైన చోరీ జరిగింది. అంటే, కచ్చితంగా ఈ మూడు చోరీలకు సంబంధముంది. ఒకే వ్యక్తివల్ల ఇవి జరగలేదు. ముగ్గురు చేసిన పని. అయితే ఆ ముగ్గురి వెనక ఇంకా ఎంతోమంది పాత్ర వుండొచ్చు."

"అవును."

"సులేమాన్ శవం దుస్తుల్లో ఏమయినా వివరాలు దొరికాయా?"

"అతని షర్టు ఇన్నర్ పాకెట్‌లో అతని ఐడెంటిటీ కార్డు, ఈ కాగితాలు దొరికాయి. దీన్నిబట్టే అతని శవాన్ని పోల్చగలిగాం."

శ్రీనివాస్ కార్డు, కాగితం అందించాడు.

కిరణ్ కార్డు పక్కన పెడుతూ, కాగితం వంక దీక్షగా చూశాడు.

అందులో ఓ పాడుబడ్డ మసీదు బొమ్మ గీయబడివుంది. మసీదుకి కుడిపక్క ఓ చెట్టు బొమ్మ దానికింద ఎనిమిది అంకె వేసివున్నాయి. ఎనిమిది అంకెకి దిగువ తొమ్మిది అంకె వేసివుంది.

"ఈ కాగితం ఈ కవర్లో పెట్టి వుంది. దీనిమీద ఏదో చిరునామా వుంది గాని, తడిసిపోయి చెరిగిపోయింది" శ్రీనివాస్ బాగా నలిగి, తడి ఆరిన కవరు ఇచ్చాడు కిరణ్‌కి.

కిరణ్ కవరు పరిశీలనగా చూశాడు. బ్రౌన్ రంగు కవరది. ఇంకు పెన్నుతో ఏవో అక్షరాలు గజిబిజిగా రాసివున్నాయి. చివర 'హైదరాబాదు' అన్న అక్షరాలు అతి కష్టంమీద గుర్తుపట్టాడు. అంటే ఈ కాగితాన్ని కవర్లో పెట్టి హైదరాబాదులోని యెవరికో పోస్టు చెయ్యాలని సులేమాన్ ఉద్దేశ్యమయి వుండాలి.

కవరు తిప్పి చూశాడు. పోస్టల్ స్టాంపు అంటించిన గుర్తు కనిపించింది. స్టాంపు తడికి నాని ఊడిపోయి వుండాలి!

"శవం హుస్సేన్ సాగర్‌లో కనిపించిందన్నావుకదూ!"

"అవును. బాగా నాని ఉబ్బిపోయింది. ప్లాస్టిక్ కవర్ లో దాచినందువల్ల ఐడెంటిటీ కార్డు తడవలేదు. అందుకే శవాన్ని గుర్తుపట్టగలిగాం. విడిగా వుండటంవల్ల కవరు లోపలి కాగితం బాగా తడిసిపోయింది. బాల్ పాయింట్ పెన్నుతో గీసినందువల్ల మశీదు బొమ్మ సాంతం చెరిగిపోలేదు" అన్నాడు శ్రీనివాస్.

"సులేమాన్ ది ఏ ప్రాంతం?"

"ఏ ప్రాంతమో సరిగా చెప్పినవారు లేరు. చాలా ఏళ్ళ క్రితమే ఇక్కడ హైదరాబాద్ లో మ్యూజియంలో ఉద్యోగం సంపాదించుకున్నాడు. అతనికి భార్యాపిల్లలు ఎవరూ లేరు. ఎవరో ఉంపుడుకత్తె వుందని తెలిసింది. బహుశా ఈ కవరు ఆమె పేరనే రాసి వుండొచ్చు."

"పురావస్తు ప్రదర్శనశాలలో అతని గురించి ఎంక్వయిరీ చేశావా?"

"ఎంక్వయిరీకి నేను వెళ్ళేసమయానికి క్యూరేటర్ సెలవుమీద వున్నాడు. ఈ పన్నెండో తేదీకి వస్తారని విన్నాను. ఇన్ ఛార్జిని అడిగితే పూర్తి వివరాలు క్యూరేటర్ గార్ని కలిసి మాట్లాడమని చెప్పాడు."

"అయితే, యింకా రెండు రోజుల తర్వాతగాని క్యూరేటర్ తిరిగిరాడు. ఆయన వస్తేగాని కేసుకి పూర్తి రూపం రాదు."

"కేసు ఇంకా ప్రాథమిక దశలోనే వుంది. అయితే దేశంలో సంచలనం కలిగించిన నాణెం చోరీకి సంబంధించిన అతిముఖ్యమైన వ్యక్తి దొరకటంతో—అందునా శవరూపాన — మా డిపార్టుమెంటుకి చేతినిండా పని తగిలింది. ప్రత్యేకం, స్థానిక క్రైంబ్రాంచ్ ఇన్స్పెక్టర్ని కావటంతో, నాకే అప్పచెప్పారు ఈ కేసు. అందుకే

నిన్ను వెంటనే రప్పించాను."

కిరణ్ మందహాసం చేశాడు.

"హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ అయి రాగానే తగిలిన గడ్డు కేసు ఇదేననుకుంటాను."

"అదే బ్రదర్, నా బాధాను. యింకా ఓ పక్క ఇక్కడ సెటిల్ కాలేదు. ఇంతలోనే పెద్ద కేసు. ఇది ఒక్కరికి సంబంధించిన వ్యవహారం కాదు, భారతదేశ ప్రతిష్ఠకి సంబంధించినది. అందుకే దీన్నెలా గట్టెక్కాలోనని నాకు ఓ పక్క భయంగా వుంది. నువ్వు వచ్చావు, నాకు కొండంత ధైర్యం."

"డోంట్ వర్రీ మైడియర్ ఇన్స్‌పెక్టర్! నేను కూడా ఇది ప్రతిష్ఠాకరమైన కేసుగానే తీసుకుంటున్నాను. నేనూ భారతీయుడ్నే కదా!"

ఇంతలో ఓ పాతికేళ్ళ యువతి లోపలికి అడుగుపెట్టి శ్రీనివాస్‌ని విష్ చేసింది.

కిరణ్ ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఈమె పేరు లలిత. ఇక్కడే ఎ. జి. ఆఫీసులో పనిచేస్తోన్నారు. వీరు ప్రఖ్యాత డిటెక్టివ్ కిరణ్" పరిచయం చేశాడు శ్రీనివాస్.

లలిత విస్ఫారిత నేత్రాలతో కిరణ్ వంక చూసింది.

"చాలా సంతోషం సార్! మీ గురించి వినడమేగాని చూసే అదృష్టం కలగలేదింతవరకు. ఈ రోజు సుదినం."

మందహాసం చేశాడు కిరణ్.

"మోహన్‌గారి ఆచూకీ ఇంకా తెలియలేదమ్మా! దర్యాప్తు చేస్తున్నాం" అన్నాడు శ్రీనివాస్.

లలిత ఏదో చెప్పేంతలో శ్రీనివాస్, కిరణ్ వంక తిరిగి, "ఈమె ఫ్రెండు మోహన్ నాలుగు రోజులుగా

కనిపించటంలేదని స్టేషన్‌లో రిపోర్టిచ్చారు. అయితే, అతనికేదైనా అపకారం జరిగివుండొచ్చని అనుమానిస్తున్నట్టు రిపోర్టులో సూచించారు. అది మన క్రైం బ్రాంచ్‌కి రిఫర్ చేశారు" అన్నాడు.

"అనుమానించడానికి కారణం?" అడిగాడు కిరణ్.

"ఇదివరకోసారి ఎవరో వచ్చి తనను చంపుతానని బెదిరించినట్టు మోహన్ లలితగారికి చెప్పాడట. కారణం ఈమెకు చెప్పలేదట. ఆ మర్నాటినుంచే మోహన్ కనిపించటంలేదని రిపోర్టిచ్చారు."

కిరణ్ లలితవంక తిరిగి, "మీరు మోహన్‌కి బంధువులా, స్నేహితులా?" అనడిగాడు.

లలిత కొద్దిగా సిగ్గుపడి, "మేమిద్దరం వివాహం చేసుకోవాలనుకున్నామండి. అయితే తనకి ఉద్యోగం అవలేదు. ఉద్యోగం దొరికేవరకు పెళ్ళి వాయిదా వేసుకుంటూ వచ్చారు. నాకున్న ఉద్యోగంతో సరిపెట్టుకుందామన్నా ఆయన వినలేదు, అంతలోనే ఇలా జరిగింది" అన్నది.

"ఏదైనా ఉద్యోగాన్వేషణలో వెళ్ళారేమో?"

"నాకు చెప్పకుండా ఆయన ఎక్కడికీ వెళ్ళరండి. ఒక రోజు రెండు రోజులయితే చెప్పకపోవచ్చుగాని, ఇన్నాళ్ళు వెళ్ళాల్సిన పనయితే తప్పక చెప్పేవారు. అదీగాక హైదరాబాద్‌కన్న ఉద్యోగం దొరికే పట్టణంగాని నగరంగాని ఆంధ్రాలో ఎక్కడున్నాయండి?"

"యూ ఆర్ రైట్! చెప్పకూడని పరిస్థితిలోగాని, చెప్పరాని విషయమైగాని ఆయన వెళ్ళివుంటే....?"

"నో నో. అంత చెప్పకూడని రహస్యాలు మా మధ్య ఏవీ లేవండి."

"ఆయనకు బాధ్యతలేమైనా వున్నాయా?"

"ఓ తమ్ముడు, తల్లి వున్నారండి. ఇక్కడ వాళ్ళకు స్వంత ఇల్లుందండి. ఓ పోర్షన్ అద్దెకిచ్చారు. అదే ప్రస్తుతం జీవనాధారం. తమ్ముడి చదువు త్వరలో పూర్తి కాబోతుంది. ఆడపిల్లలెవరూ లేరు."

కిరణ్ ఓ నిమిషం మౌనం వహించాడు.

"మీరు ఆయన తరచు కలుసుకుంటూరా?"

"కల్సుకుంటామండి దాదాపు ప్రతిరోజు."

"మరి యీ మధ్య వారం—పదిరోజులుగా ఏమైనా అనుమానించదగ్గ పరిస్థితులేమైనా ఎదురయ్యాయా? ఐ మీన్ మిమ్మల్ని యెవరైనా వెంబడించటంగాని, మోహన్‌తో ఎవరైనా ఘర్షణపడటంగాని—అలాంటిది ఏమైనా...."

"అదేం లేదండి. అలాంటిది నా పరోక్షంలో జరిగినా మోహన్ నాతో తప్పక చెప్పివుండేవాడు."

కిరణ్ రెండు క్షణాలు మౌనం వహించాడు.

లలిత ఏదో గుర్తువచ్చినదానిలా తలెగరేసింది.

"మీరు అడుగుతుంటే గుర్తువచ్చింది. వారం రోజుల క్రితం పబ్లిక్ గార్డెన్స్‌లో మాకో బంగారు నాణెం దొరికింది."

వింటున్న శ్రోతలిద్దరు ఉలిక్కిపడ్డారు.

"ఈజిప్టు నాణెమా?" శ్రీనివాస్ ఆత్రుతగా అడిగాడు.

"మీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగింది లలిత.

"తెలుసులెండి. తొమ్మిదో శతాబ్దంనాటిది. ఈజిప్టు రాజు బొమ్మ ఓ పక్క, పిరమిడ్స్ వెనకపక్క వున్నాయి, అవునా?"

"మీరు చెప్పినదాంట్లో రెండో భాగం రైటే! కాని ఆ నాణెం పదకొండో శతాబ్దంనాటిది. దానిమీద సంవత్సరం ముద్రింపబడివుంది."

శ్రీనివాస్ కొంత నిరుత్సాహపడ్డాడు.

"మీరు సంవత్సరం సరిగానే చూశారు కదా!"

"చాలా స్పష్టంగా చూశామండి. దానిమీద మా ఇద్దరికీ కొంతసేపు వాదన కూడా జరిగింది."

"యూ ఆర్ రైట్! మిష్టర్ శ్రీనివాస్, ఆ నాణెం న్యూయార్కు మ్యూజియంనించి అపహరింపబడినది!"

శ్రీనివాస్ ఏదో అడగబోతుండగా వారించి, కిరణ్ లలితని అడిగాడు. "చెప్పండి, ఆ తర్వాత ఏం జరిగింది?"

"మోహన్ ఆ నాణేన్ని భద్రపరుస్తానన్నాడు. నేను వద్దన్నాను. అది యెవరో కావాలని అక్కడ పాతి పెట్టినట్టు గ్రహించాను. అది పాతినచోట పచ్చిక మొలవలేదు. నేల గుల్లగా వుంది. మట్టి కప్పి క్రోటన్స్ మొక్కలు కొత్తగా పాతిపెట్టారు. అవి చిగురించి వున్నాయి. దాన్ని వెంట తెచ్చుకోవటమంటే, కష్టాల్ని కోరి తెచ్చుకోవటమేనని హెచ్చరించాను. మోహన్ దానిమీది వ్యామోహం వదులుకోలేక పోతుంటే నేనే దాన్ని లాక్కుని మళ్ళీ భూస్థాపితం చేసేశాను."

"ఆ తర్వాత మళ్ళీ ఆ నాణెం విషయం ప్రస్తావన కొచ్చిందా?"

"లేదు. ఆ తర్వాత, అదే రోజున యెవరో వ్యక్తి తన ఇంటికే వచ్చి తనని బెదిరించాడని మోహన్ చెప్పాడు. ఎందుకని అడిగితే చెప్పలేదు. నేను రెట్టించ లేదు. జాగ్రత్తగా వుండమని సలహా ఇచ్చాను. మర్నాడు మోహన్ కనిపించకుండా పోయిన రోజు రాత్రి

మోహన్ గదినంతా యెవరో చిందరవందరగా చేసి దేని కోసమో వెతికిపోయాడని, ఏ దొంగోడో అయుండాలని మోహన్ తల్లి నాకు చెప్పింది."

కిరణ్ శ్రీనివాస్ వంక తిరిగి, "ఈ మెతో ఓసారి మనం పబ్లిక్ గార్డెన్సుకి వెళ్ళి ఆ నాణెం పాతిన స్థలం వెరిఫై చెయ్యాలి" అన్నాడు.

శ్రీనివాస్ తలూపాడు.

# 6

"ఇదిగోనండి, ఇక్కడే మేం ఆ కాయిన్ చూసి పాతేశాం" లలిత చూపించిన స్థలంలో పరిశీలనగా దృష్టి నిలిపి చూశారు—కిరణ్, శ్రీనివాస్.

అది పబ్లిక్ గార్డెన్సు చివరిగేటు దగ్గరున్న లాన్స్. అందులో మళ్ళీ ఆ స్థలం చాలా మరుగ్గా వుంది. చుట్టూ దట్టమైన పొదలు, క్రోటన్స్ మొక్కలు, ఎర్రటి పచ్చటి పూల మొక్కలు. వాళ్ళకి బయటివాళ్ళు కనిపించక పోవచ్చుగాని, వాళ్ళు చేసేపని పరీక్షగా చూస్తే ఎత్తున గట్టుమీదున్న వాళ్ళకు కనిపిస్తుంది.

కిరణ్ ఎత్తయిన ప్రదేశంమీదికి వచ్చాడు. అక్కడ గార్డెన్ కోసం నీళ్ళు స్టాకుచేసే సిమెంటు టాంకు లున్నాయి. అక్కడినుంచి చూస్తే ఆ నాణెం పాతిన స్థలం కనిపిస్తోంది.

కిరణ్ మళ్ళీ స్పాట్ కొచ్చి చుట్టూ చూశాడు. మోహన్, లలిత కూచున్న చోటికి ఎడమ పక్కగా గుబురుగా వున్న పొద దగ్గిర గడ్డి బాగా నలిగివుంది.

కిరణ్ మోకాళ్ళమీద వంగి చూశాడు—గడ్డిలో రెండు మూడు సిగరెట్ పీకలు కనిపించాయి. కర్చీఫ్‌తో వాటిని పట్టి జేబులోనించి ఓ కాగితంతీసి దానిలో

వేశాడు.

శ్రీనివాస్ ప్రశ్నార్థకంగా చూశాడు.

అవి 'డంకన్స్' బ్రాండ్ సిగరెట్లు, రాయల్ సిగరెట్లు.

"ఇవి న్యూయార్క్‌లో దొరికే సిగరెట్స్. బహుశా ఆ కాయిన్ చేజిక్కించుకున్న వ్యక్తి ఇక్కడే చాలా సేపు వెయిట్ చేసి వుంటాడు. మోహన్, లలిత కాయిన్ పూడ్చి వెళ్ళిన మరుక్షణం ఆ వ్యక్తి దాన్ని వెతికి తీసి పట్టుకుపోయాడు. మోహాన్‌ని బెదిరించిన వ్యక్తి అది గమనించి వుండడు. మోహన్, ఆ వ్యక్తి కూడా లేని కాయిన్ కోసం అక్కడ వెతికారు. ఒకరు వెతికినట్టు మరొకరికి తెలీదు. ఆ వ్యక్తి మోహానే ఆ కాయిన్ పట్టుకుపోయాడని భావించి ఆతన్ని బెదిరించి వెంట పడి వేధించాడు" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ తలూపాడు.

"ఇక మీరు వెళ్ళిరండి లలితగారూ!" అన్నాడు కిరణ్.

లలిత వెళ్ళిపోయాక, "మిష్టర్ శ్రీనివాస్! మనం పురావస్తు ప్రదర్శనశాలకు వెళ్ళాలి!" అన్నాడు కిరణ్.

"ఇంకా క్యూరేటర్ సెలవునించి తిరిగిరారను కుంటాను."

"సులేమాన్ కొలీగ్స్‌నుంచి కొంత సమాచారం రాబట్టాలి. క్యూరేటర్‌తో పెద్ద పనుండకపోవచ్చు."

ఆర్కిలాజికల్ మ్యూజియంవద్ద జీపు దిగారిద్దరు.

# 7

మ్యూజియం యిన్‌ఛార్జి సాదారంగా ఆహ్వానించాడు.

"సులేమాన్ హత్య విషయంలో కొంత ఇన్ఫర్మేషన్

కావాల్సి వచ్చాం" అన్నాడు కిరణ్.

"ఇది వరకు ఇన్స్పెక్టర్ గారికి మనవిచేశాను—మా క్యూరేటర్ లేరండి."

"ఆయన లేకపోయినా ఫరవాలేదు. ఒకటి రెండు విషయాలు మీరు చెప్పగలిగినవే అడగాలని వచ్చాం."

"అడగండి."

"సులేమాన్ ఇక్కడ ఎన్నాళ్ళుగా పనిచేస్తున్నాడు?"

"దాదాపు పన్నెండేళ్ళుగా చేస్తున్నాడండి. మనిషి నమ్మకస్తుడే!"

"సులేమాన్ కనిపించకుండా పోయి ఎన్నాళ్ళయింది?"

"రెండు నెలలవుతుందండి."

"అతను పారిపోయాకనే నాణెం కనిపించలేదు. అవునా?"

"అవునండి. ప్రతిరోజు మ్యూజియం మూసేవేళకు క్యూరేటర్ గారు, నేను, మరో ఇద్దరు బాధ్యతగల ఆఫీసర్లు స్టోర్ తాళాలు పరీక్ష చేస్తుంటామండి. స్టోర్ కి సాధారణంగా గేటువేసి వుంటుంది. అది కరెక్టుగా వుంటుందో లేదో పరీక్ష చేస్తూంటాం.

సులేమాన్ పారిపోయిన మర్నాడు అంటే ఆగష్టు పదమూడో తేదీన పురాతన నాణేలున్న స్టోర్ తో పని వచ్చింది. ఎందుకంటే అరబ్ నించి కొంతమంది ముఖ్య అతిథులు మన రాష్ట్రానికి వచ్చారు. సందర్శనార్థం మ్యూజియంకి వచ్చారు. వారు మ్యూజియంలోని పురాతన నాణేలు, ఈజిప్షియన్ మమ్మీని చూడాలని కోరారు.

మేడమీదున్న మమ్మీని చూశాక నాణెల స్టోర్ ని

క్యూరేటర్ గారు మా అందరి సమక్షంలోనూ తెరిచి చూశారు. అయితే నాణేలున్న కేస్‌లో అన్ని నాణే లున్నాయిగాని, తొమ్మిదో శతాబ్దంనాటి ఈజిప్టు నాణెం లేదు. స్టోర్‌కి వేసిన సీలు వేసినట్టే వుంది. నాణెం ఎలా మాయమయిందో మాకర్థం కాలేదు."

"సులేమాన్‌ని మీరు చివరిసారిగా యెప్పుడు చూశారు?"

"పదకొండో తేదీ ఉదయం."

"మరి పన్నెండో తేదీన చూడలేదా?"

"పన్నెండో తేదీ జన్మాష్టమి సందర్భంగా మ్యూజియంకి సెలవు. పన్నెండో తేదీ టర్న్ డ్యూటీ సులేమాన్ కేపడింది. చోరీ పన్నెండో తేదీనే జరిగుండాలి."

"అయితే మీరు సులేమాన్ దొంగిలించాడని ఎందుకనుకున్నారు?"

"అతనే డ్యూటీకి హాజరు కాలేదు పదమూడో తేదీన. తక్కిన అందరూ వచ్చారు. పదమూడో తేదీ ఉదయం వాచ్‌మన్‌కి అతను కనిపించి, అతనొచ్చేక డ్యూటీనుంచి దిగవలసింది! కాని అతను వాచ్‌మన్‌కి పదమూడు ఉదయం కనపడలేదు."

"వెంటనే అతని గురించి రిపోర్టిచ్చారా పోలీసులకి?"

"లేదండి. ఎందుకంటే ఈ మహానగరంలో డ్యూటీకి రాలేకపోవటానికి ఎన్నో కారణాలుండవచ్చు. అంచేత ఒకటి రెండు రోజులు చూశాకగాని ఆ వ్యక్తి డ్యూటీకి అబ్‌స్కాండ్ అయినట్టు పరిగణించం."

"పద్ధాలుగున రిపోర్టివ్వలేదు, కారణం? అప్పటికి రెండురోజులయిపోయిందిగా సులేమాన్ మాయమయి!"

"పధ్నాలుగు, పదిహేను తేదీలు సెలవు దినాలు—రెండవ శనివారం, ఆగష్టు పదిహేను సందర్భంగా. అంచేత పదహారో తేదీన రిపోర్టిచ్చాం పోలీసులకి."

"అంటే సులేమాన్ గురించా, చోరీ గురించా?"

"చోరీ గురించి పదమూడో తేదీన వెంటనే రిపోర్టు ఇచ్చాం. సులేమాన్ గురించి పదహారుని రిపోర్టిచ్చాం—చోరీకి, అతని అంతర్ధానానికి సంబంధముంటుందని వూహించి."

"సులేమాన్‌కి భార్యాబిడ్డలు, బంధువులు వున్నారా?"

"అతను ఎందుకో పెళ్ళిచేసుకోలేదండి, వెనక ముందు ఎవరూ లేరనుకుంటాను. అయితే ప్రతినెలా కర్నూల్‌లో వున్న తల్లికి వందరూపాయలు తన జీతంనించి పంపిస్తూండేవాడు" అన్నాడు ఇన్‌ఛార్జి.

"పదకొండో తేదీనగాని, అంతక్రితం ఒకటి రెండు రోజుల ముందుగాని కాయిన్స్ వున్న స్టోర్ ఏ కారణం చేతనైనా తెరవటం జరిగిందా?"

"సాధారణంగా బంగారంలాంటి విలువైన వస్తువులు, అపురూపమైన మాన్యుమెంట్సు — డిస్టింగ్విషెడ్ విజిటర్సు (ముఖ్య అతిధులు)కి తప్ప ప్రదర్శించమండి. ఏడో తేదీన ఓసారి స్టోర్ తెరిచి నాణేలు ప్రదర్శించాం. మళ్ళీ పదమూడున అరబ్ అతిధులకి తెరిచాం."

కిరణ్ ముఖం వికసించింది.

"పదో తేదీన సందర్శించిన అతిధులెవరు?"

"అరబ్‌నించి వచ్చిన ఫరూక్ అలీ అనే పెద్ద వాణిజ్యవేత్త. న్యూయార్క్‌నించి వచ్చిన జాన్సన్ అనే ప్రముఖ పారిశ్రామికవేత్త. మా డైరెక్టరునించి పర్మిషన్ లెటర్ తెచ్చాక క్యూరేటర్‌గారు స్వయంగా

వారికి నాణేలు చూపించారు."

కిరణ్ వాళ్ళ పేర్లు నోట్ చేసుకున్నాడు.

"మీవు పేర్లు దేశాలతోబాటు రెండు నెలల క్రిందట విజిటర్స్ ఎలా గుర్తున్నారు?"

"సాధారణంగా గుర్తుండరండి. కానీ ఫరూక్ అలీ అనే ఆ అరబ్ దేశస్థుడు ప్రత్యేకంగా ఈజిప్టు నాణెం గురించి చాలా వివరాలు అడిగాడండి. అది ఎవరు ఎప్పుడు మన దేశానికి బహూకరించారని అడిగాడు. దాని విలువ కూడా అడిగాడు. అది అమూల్యమని మేం చెప్పాం. జాన్సన్ అనబడే వ్యక్తి కూడా ఆ నాణెం గురించి వివరాలడిగాడు. తర్వాత అతను మా స్టాఫ్‌కి కృతజ్ఞత పూర్వకంగా చిన్న అల్పాహారవిందు ఇచ్చాడు. అందుకని వాళ్ళిద్దరు మాకు బాగా గుర్తున్నారు."

"మంచి ఇన్ఫర్మేషన్ ఇచ్చారు. వాళ్ళిద్దరి ఫోటోలు లభిస్తాయా?"

"ఫోటోలు లేవండి. 'ఫారినర్స్ రిమార్క్స్' కోసమని మేము ప్రత్యేకం ఓ పుస్తకం మెయిన్‌టెయిన్ చేస్తాం. దాంట్లో వాళ్ళిద్దరు రిమార్క్స్ రాసి సంతకాలు పెట్టారు చూస్తారా?"

"మీ అనుమతితో!" అన్నాడు కిరణ్.

ఇన్‌ఛార్జి విజిటర్స్ బుక్ కిరణ్‌కి అందించాడు.

మ్యూజియంని చూసి చాలా సంతోషించినట్టు ఫరూక్ అలీ రాశాడు. ఆసియాలోకెల్ల చక్కటి అమూల్యమైన పురాతన వస్తు సంపదగల ఏకైక ప్రదర్శన శాలగా జాన్సన్ పేర్కొన్నాడు.

ఇద్దరు ఆంగ్లంలోనే సంతకాలు చేశారు.

కిరణ్ మస్తిష్కంలో ఏదో మెరిసింది.

"ఆ ఇద్దర్లో ఎవరైనా ఛెయిన్ స్మోకరున్నాడా?"

"ఆఁ.... జాన్సన్ ఛెయిన్ స్మోకర్! చాలా ఖరీదైన రాయల్ సైజు సిగరెట్లు కాలుస్తాడు."

"బ్రాండ్ మీకు గుర్తుందా?"

"డంకన్స్. నాకో ప్యాక్ ఉచితంగా యిచ్చాడు కూడా."

"గుడ్. మరో చక్కటి 'క్లూ' ఇచ్చారు. థాంక్యూ వెరీమచ్!"

ఇన్ ఛార్జి ముఖం ఆనందంతో వెలిగింది.

"సులేమాన్ వ్యక్తిగతంగా ఎలాంటివాడు? డ్రింకింగ్ అలవాట్లున్నాయా? డబ్బు ఇబ్బందుల్లో వున్నట్టు ఎప్పుడయినా గమనించారా?"

"లేదు సార్. అతనికి మంచి చరిత్ర వుంది. తోటి వాచ్ మన్ లకు అతనే అప్పుడప్పుడు ఆర్థికంగా సహాయ పడటం నాకు తెలుసు. తాగుడు, స్త్రీ వ్యసనాలు లేవు. బ్రహ్మచారిగా ఎందుకుండిపోయాడో మాత్రం నాకు తెలీదు. అతనీ చోరీ చేశాడంటే నాకూ నమ్మబుద్ధి కావటంలేదు. కాని ఎప్పుడు ఎవరికెలాంటి బుద్ధి పుడుతుందో చెప్పలేం కదా!"

"యు ఆర్ రైట్!"

మరోసారి ఇన్ ఛార్జికి ధన్యవాదాలు చెప్పి యిద్దరు బయటకి వచ్చారు.

"చూశావా, మైడియర్ ఇన్స్పెక్టర్! క్యూరేటర్ లేరని నీ పరిశోధన అసంపూర్తిగా వదిలేశావు. నేను దాదాపు కేసుకి అవసరమైన ఇన్ఫర్మేషన్ అంతా సేకరించాను. కేసుకి ఓ రూపం వచ్చింది" అన్నాడు కిరణ్ నవ్వుతూ.

శ్రీనివాస్ మందహాసం చేసి, "నాకు కొంతవరకు అర్థ మయింది. కాని పూర్తి రూపం రాలేదు" అన్నాడు.

"పద, అలా కాసేపు లాన్‌లో కూచుందాం" అన్నాడు కిరణ్ ఫౌంటెన్ వున్న లాన్‌లోకి దారితీస్తూ.

ఇద్దరు హైలు మ్యూజియంకి, జవహర్ బాలభవన్ లోకి మధ్యనున్న ఫౌంటెన్‌కి దగ్గరగా చక్కటి పచ్చిక మీద కూచున్నారు. అక్కడికి సాయంకాలం నీరెండలో మంచి ముత్యంలా తెల్లగా మెరిసిపోతున్న బిర్లామందిర్ శిఖరం కనులపండువుగా కనిపిస్తోంది. అటుపక్క అర్కి లాజికల్ మ్యూజియం, ఇటు పక్క జూబిలీ హిల్స్, దాని పక్కగా అసెంబ్లీ హాలు నిజాం నవాబు వైభవాన్ని గుర్తుకి తెస్తున్నాయి.

"సులేమాన్ నాణెం దొంగిలించలేదు!" అన్నాడు కిరణ్ కూర్చుంటూ.

శ్రీనివాస్ అదిరిపడ్డాడు.

కిరణ్ కోటు జేబునుండి బ్రౌన్ కలర్ కవరు తీశాడు. అది సులేమాన్ జేబులో దొరికిన కవరు.

"ఎస్. ఇదిగో యీ కవరు మీద అడ్రసు చూడు. చివర హైద్రాబాద్ అన్న అక్షరాలు మసకగా కని పిస్తున్నాయి. పైన 'టు' అడ్రసులో రెండు ఇంగ్లీషు అక్షరాలు అస్పష్టంగా కనిపిస్తున్నాయి చూడు. మొదటి అక్షరం 'సి', చివరది 'అర్' అవునా? ..... అవి 'క్యూరేటర్' హోదాని సూచిస్తున్నాయి. కింది లైన్‌లో ఆర్కియాలజీ మ్యూజియం పేరు, ఆ దిగువ పబ్లిక్ గార్డెన్స్ అనీ రాసివుంటాడు. అంటే నాణెం ఎక్కడ దాచిందీ యీ కవర్లో కోడ్ రాసి క్యూరేటర్ పేర పోస్టు చెయ్యాలని అతని సంకల్పం. కాని అంతలోనే

అతన్ని హత్య చేశారు. నాణెం కోసమే అతని దుస్తుల్లో వెతికారుగాని, ఇన్నర్ పాకెట్‌లో భద్రంగా దాచిన యీ కవరు హంతకుడి దృష్టికి రాలేదు. సులేమాన్ నిర్దోషిత్వానికి ఇంతకంటే నిదర్శనం అక్కరలేదు!" అన్నాడు కిరణ్.

"అయితే యీ 'కోడ్' ఏమిటంటావు?" అడిగాడు శ్రీనివాస్.

కిరణ్ కవర్లోని కాగితం బయటికి తీస్తూ, క్రీగంట తమచుట్టుపట్ల గమనిస్తున్నాడు.

"దీన్ని 'డీకోడ్' చేశావా?"

"ఆఁ! బ్రెయిన్‌లో. పద, స్టేషనులో వివరంగా మాట్లాడుకుందాం. మన తదుపరి కర్తవ్యం—నాణెం స్వాధీనం చేసుకోవటం!" అంటూ లేచాడు కిరణ్.

శ్రీనివాస్ అతనితో జీపు వద్దకు నడిచాడు.

## 8

పోలీసు స్టేషన్‌లో కిరణ్ శ్రీనివాస్ కూచున్నారు.

"జంట నగరాల్లోని మశీదులని ఓసారి మనం సందర్శించాలి" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ విచిత్రంగా చూశాడు.

కిరణ్, సులేమాన్ ఉత్తరాన్ని పైకి తీశాడు.

కాగితాన్ని టేబిల్ మీద పరిచాడు.

"ఇదిగో యీ మశీదు బొమ్మ చూశావు కదా! శిథిలావస్థలో వున్నట్టు సూచించాడు. గోడలు పడిపోయినట్టు, చిందరవందరగా మొక్కలు పెరిగినట్టు గీశాడు కదా! అంటే చాలా పురాతనమైన మశీదు. మశీదుకి కుడిపక్క ఓ చెట్టు వుంది. దానికింద ఎనిమిది అంకె వేసివుంది. అంటే సిటీలో వున్న పాడుబడ్డ మశీదు పక్కనున్న ఓ

చెట్టుకింద నాణేన్ని సులేమాన్ పాతిపెట్టాడు. ఎనిమిది అంకె ఎనిమిది అడుగుల లోతుని సూచిస్తోంది. తొమ్మిది అంకె నాణేనికి సంకేతం! తొమ్మిదో శతాబ్దంనాటి ఈజిప్టు నాణెమని అర్థం. సులేమాన్ అవటానికి వాచ్‌మన్ అయినా బాగా తెలివైనవాడు. డొక్క శుద్ధి వున్న వాడు. అందుకే నాణెం కోసం తన ప్రాణాన్ని పణం పెట్టాడు."

శ్రీనివాస్ ఆశ్చర్యంగా చూశాడు కిరణ్ వంక.

ఇంతలో లలిత హడావిడిగా లోనికి వచ్చింది. ఇద్దరికీ విష్ చేసి హేండ్ బ్యాగ్ లోనించి ఓ కవరుతీసి శ్రీనివాస్‌కి అందించింది. అతను గబగబ కవర్లోంచి అరఠావు సైజు కాగితాన్ని బయటకితీసి చదివాడు. కిరణ్‌కి అందించాడు. "కూచోండి" అన్నాడు లలితతో. ఆమె కూచుంది.

కిరణ్ ఉత్తరం చదివాడు.

"మైడియర్ లల్లీ,

నేనేమయిపోయానో అని కంగారు పడుతూండి వుంటావు. నేను ప్రస్తుతానికి క్షేమంగానే వున్నాను. అయితే ఆపదల విష వలయంలో చిక్కుకొని వున్నాను. నీకు చెప్పకుండా ఓ విషయం దాచాను. అది యిప్పుడు తెలియజేస్తున్నాను. మనం పబ్లిక్ గార్డెన్‌లో చూసిన కాయిన్ న్యూయార్క్ పురావస్తు ప్రదర్శనశాలనించి తస్కరింపబడింది. రహీం అనే మనిషి దాన్ని అక్కడ పాతిపెట్టాడు. అతనే నన్ను కాయిన్ గురించి మా ఇంటికొచ్చి బెదిరించాడు. అతనికి మరో పార్ట్‌నర్ వున్నాడు. అతని పేరు మనోహర్. వీళ్ళిద్దరు తోడు దొంగలు.

నన్ను బెదిరించి వెళ్ళిపోయాక రహీంని ఫాలో

అయ్యాను. వాళ్ళ రహస్య స్థావరం కనుక్కున్నాను. మనోహర్ అనే వాడివద్ద పదో శతాబ్దంనాటి ఈజిప్టు నాణెం వుండేది. రహస్యంగా విన్న, వాళ్ళ సంభాషణని బట్టి ఆ నాణెం కూడా ఎవడో కొట్టేశాడని అరమయింది. అంటే ఆ రోజు పబ్లిక్ గార్డెన్ లోని నాణెము, మనోహర్ దగ్గరుండాల్సిన నాణెము కూడా మరో వ్యక్తి కాజేశాడు.

నేను వాళ్ళిద్దర్నీ వెంబడించాను. వాళ్ళు శుక్రవారం నాడు అరబ్ నించి వచ్చే ఓ పార్టీని కలుసుకున్నారు. నేను వాళ్ళనే ఫాలో అవుతూ వచ్చాను. ఆ పార్టీ వాళ్ళు రహీం మనోహర్ లని కాయిన్స్ గురించి అడిగారు. వాళ్ళు త్వరలో అందిస్తామనీ, కాయిన్స్ గాని ఎవరైనా వాళ్ళకు అమ్మజూపితే తమకు వెంటనే తెలియజేయమనీ తమ వద్దనించి ఎవరో వాటిని కాజేశారనీ చెప్పారు. అరబ్ పార్టీ వాళ్ళు అలాగేనని అంగీకరించాక రహీం, మనోహర్ తిరిగి వెళ్ళిపోయారు. వాళ్ళ సంభాషణనిబట్టి మరో నాణెం సులేమాన్ అనే వ్యక్తి వద్ద వున్నట్టు ఆ మూడు నాణేలకు ఇరవై లక్షల రూపాయలు అరబ్ పార్టీ ఇవ్వజూపుతున్నట్లు తెలిసింది.

నేను అరబ్ పార్టీని ఫాలో అయ్యాను. వాళ్ళు హోటల్ జయా ఇంటర్నేషనల్ లో దిగారు. నేను రహస్యంగా వాళ్ళ ఉనికిని గమనిస్తూ వచ్చాను.

రహీం, మనోహర్ లు వెళ్ళిపోయిన తర్వాత ఆ సాయంత్రం మరో ఇద్దరు వ్యక్తులు అరబ్ పార్టీని కల్సుకోవటానికి హోటల్ లోకి వచ్చారు. నేను హోటల్ రూంబోయ్ వేషంలో వాళ్ళ రూంకి వెళ్ళాను, సర్వ్ చేసే నెపంతో. జయా హోటల్ మేనేజర్ నాకు తెలుసు. అందుకని యాజమాన్యం నాతో సహకరించారు. ఓ

స్మగ్లింగ్ కేసు విషయం ఇన్ఫర్మేషన్ కావలసి వచ్చిందని వాళ్ళతో చెప్పి ఒప్పించాను.

నేను వెళ్ళిపోయిన సమయానికి అరబ్ పార్టీని కలవటానికి వచ్చిన వాళ్ళిద్దరితో పార్టీ నాయకుడు నాణేల గురించి మాట్లాడుతున్నాడు. వాళ్ల మాటలనిబట్టి వాళ్ళిద్దరి పేర్లు జాన్సన్, ఫరూక్ అలీ అని తెలుసుకున్నాను. నాముందు వాళ్ళు నాణేల విషయం ప్రస్తావించటం ఆపేశారు. వాళ్ళకేం కావాలో అర్ధంచేసుకొని బయటికి వచ్చేశాను. కీ హోల్ లోనించి చూశాను.

రెండు నాణేలు—మనం గార్డెన్ లో చూసిన నాణెంలానే వున్నాయి—జాన్సన్ అరబ్ పార్టీకి చూపిస్తున్నాడు—మూడో నాణెం గురించి పార్టీ నాయకుడు అడుగుతున్నాడు. త్వరలో దాన్ని తెచ్చి ఇస్తామని ఫరూక్ అలీ వాగ్దానం చేస్తున్నాడు. మూడూ తీసుకొని రమ్మని నాయకుడు అన్నాడు. ఆ మూడు నాణేలు కలిస్తే వాళ్ళకు ఎలాగో కొన్ని కోట్లు కలిసొస్తాయట. తర్వాత జాన్సన్, అలీ వెళ్ళిపోయారు. నేను వాళ్ళ వెంట ఫాలో అవుతూ వాళ్ళ స్థావరం చూశాను.

ప్రస్తుతం నీకు వాళ్ళ స్థావరం దగ్గిర్లో వున్న పోస్టాఫీసునించి ఈ లెటరు రాస్తున్నాను. జాన్సన్ నించి ఆ నాణేలు ఎలాగైనా సంపాదించి మన ప్రభుత్వానికి అప్పచెప్పాలనుకుంటున్నాను.

నాకు ఎడ్వెంచర్ అంటే ఇష్టమని నీకు తెలుసు. ఈ ఎడ్వెంచర్ ప్రాణాపాయమని నాకు తెలిసీ ఇందులో దిగుతున్నాను. నాణేల గురించి చాలా పెద్ద మొత్తంలో వ్యాపారం జరుగుతోంది. కొంతమంది యింటర్నేషనల్ స్మగర్ల హస్తాలు ఇందులో వున్నాయి. వాళ్ళ ఉనికిని

తెలుసుకున్నాను. వాళ్ళని ప్రభుత్వానికి అప్పగించటం భారత పౌరుడిగా నా విధి, విధ్యుక్త ధర్మం. అందుకే యీ బృహత్కార్యంలో ప్రాణాలు పోయినా నేను లెక్క చెయ్యదలచుకోలేదు.

బతికుంటే మళ్ళీ నీకు ఉత్తరం రాస్తాను. లేదా విజయుడినై వచ్చి కలుస్తాను. అమ్మకు నా క్షేమ వార్త తెలియచెయ్యి. నే నీ విషయం పోలీసులకి తెలియ చెయ్యటంలేదు. ఎందుకంటే వాళ్ళు జోక్యం చేసుకుంటే యీ స్మగ్లర్సు దొరక్కుండా తప్పించుకు పారిపోయే అవకాశముంది. అందుకని నేనే స్వయంగా యిందుకు పూనుకున్నాను.

ఉంటానిక, జాన్సన్ సంగతి తేల్చుకున్నాక బతికుంటే కలుద్దాం.

నీ

మోహన్."

ఉత్తరం చదివి శ్రీనివాస్‌కి అందించాడు కిరణ్.

"మోహన్ చాలా ఉపయోగకరమైన ఇన్ఫర్మేషన్ పంపించాడు. థాంక్స్ మిస్ లలితా మీరు కూడా సివిల్ డ్రెస్సులో వెంటనే ఈ లెటరు మాకు అందచేశారు. మోహన్ కే ఆపదా రాకుండా మేం చూస్తాం. అతడు మన అందరం గర్వించదగ్గ పనిచేస్తున్నాడు. అతని ప్రయత్నాన్ని మేము విజయవంతం చేస్తాం. ఈ కేసు ఓ ఇంటర్నేషనల్ స్మగ్లింగ్ కి సంబంధించినది. త్వరలోనే ఆ గ్యాంగ్ ని పట్టుకుంటాం. యింతకీ మోహన్ తను ఎక్కడనించి రాశాడో అదీ రాయలేదు, జాన్సన్ వాళ్ళ అడ్రస్ గాని, రహీం వాళ్ళ అడ్రస్ గాని యిందులో రాయలేదు__"

అని ఏదో గుర్తుచ్చి శ్రీనివాస్‌నించి ఆ కవరు తీసుకొని పోస్టల్ ముద్ర చూశాడు.

గోల్కొండనించి పోస్టు అయింది ఉత్తరం.

కిరణ్ ముఖం వికసించింది.

"బహుశా ఇది జాన్సన్ సొవరానికి దగ్గర్లో వుందన్న మాట! సరే, కొంతవరకు ముందుకు సాగటానికి ఈ లెటరు చాలా ఉపయోగపడ్తుంది.... మిస్టర్ శ్రీనివాస్! మనం మోహన్ విషయం గవర్నమెంటుకి రికమండ్ చెయ్యాలి. వీలయితే యిన్వెస్టిగేషన్ బ్యూరోలో అతన్ని అపాయింట్ చెయ్యమని చెప్పాలి" అన్నాడు కిరణ్.

"ష్యూర్, ష్యూర్" అన్నాడు శ్రీనివాస్.

లలిత ముఖం వికసించింది.

"చాలా థాంక్స్ సర్" అన్నది కృతజ్ఞతగా.

"మీరు వెళ్ళిరండి. ఇక మేము మోహన్‌కి సాయంగా వెళ్తాం. వీలయినంత త్వరలో అతన్ని మీకు అప్పగిస్తాం."

లలిత సెలవు తీసుకొని వెళ్ళిపోయింది.

"తెల్లవారగానే మనం గోల్కొండ వెళ్దాం. తర్వాత సులేమాన్ నాణెం దాచిన మశీదుకి వెళ్దాం. సులేమాన్ సూచించిన పాత మశీదులాంటివి సిటీలో ఎక్కడెక్కడున్నాయో వివరాలు రహస్యంగా సేకరించాలి. అది నీకే వదిలేస్తున్నాను. మనం మశీదు గురించి ఎంక్వయిరీ చేస్తున్నట్టు ఎంతమాత్రం బయటికి రాకూడదు" హెచ్చరించి బయటకి వచ్చేశాడు కిరణ్.

అంతలోనే ఏదో గుర్తువచ్చి మళ్ళీలోనికి వచ్చాడు. కోటుజేబులో నుండి సులేమాన్ కవరు శ్రీనివాస్‌కి

అందించి, "దీన్ని భద్రంగా సేఫ్‌లో దాచు. చాలా భద్రంగా, దీని నకలు నా బ్రెయిన్‌లో రికార్డయిపోయింది. దీన్ని కేసు పూర్తయేవరకు బయటకి తియ్యకు" అన్నాడు.

శ్రీనివాస్ దాన్ని జాగ్రత్తగా సేఫ్‌లో దాచాడు.

# 9

హోటల్ రూం తలుపు తియ్యబోతూ ఓ క్షణం ఆగాడు కిరణ్.

కీహోల్‌లోనించి చూశాడు. గదంతా చిందరవందరగా వుంది. ఉలిక్కిపడ్డాడు. అయితే ఆ ప్లాన్ కాగితం కోసం వేట మొదలయిందన్నమాట! తన రూం కూడా శత్రువులకి తెలిసింది.

తాళంతీసి తలుపు తోస్తూనే, తనమీదకి దాడి చెయ్యబోయిన ఇద్దరు వ్యక్తుల్ని ఒకడ్ని గడ్డంకింద పూనిగుద్దాడు కిరణ్. ఒకడ్ని తలుపుతో కొట్టాడు.

వాళ్ళిద్దరు వెల్లకిల పడిపోయారు. కిరణ్ కోటుజేబు నించి రివాల్వర్ పైకి తీసి గురిపెట్టేంతలో ఒకడు పారిపోయాడు.

రివాల్వర్ రెండోవాడికి గురిచేసి "కదలకు జాన్సన్! నీ పార్ట్‌నర్ ఫరూక్ పారిపోయినా మాకు చిక్కక తప్పదు. వెర్రి వేషాలువేసి ప్రాణాలు పోగొట్టుకోకు" గర్జించాడు కిరణ్.

జాన్సన్ జేబులో చెయ్యిపెట్టబోయిన వాడల్లా ఆ ప్రయత్నం విరమించుకుని చేతులు పైకెత్తాడు.

కిరణ్ తలుపు మూసి, లాక్ చేశాడు. డ్రాయరు సొరుగులాగి పొడవాటి నైలాన్ తాడు పైకి తీశాడు. కాని ఇంతలోనే జాన్సన్ మెరుపు దాడిచేశాడు. కిరణ్

చేతిలోని రివాల్వర్ ఎగిరి అవతల పడింది.

రాబోయే ప్రమాదాన్ని గ్రహించిన కిరణ్ పక్కకి గంతేశాడు.

కింద కార్పెట్ లాగేశాడు జాన్సన్.

కిరణ్ ఆకలిగొన్న సింహంలా జాన్సన్ మీదికి లంఘించి, అతని తల చిక్కించుకొని రెండు చేతులమధ్య వెనక్కి విరిచాడు.

జాన్సన్ మెడ నరాలు పటపటమన్నాయి. నిస్సహాయంగా తల వాల్చేశాడు.

కిరణ్ తాడుతో జాన్సన్ కాళ్ళుచేతులు కట్టేసి కుర్చీకి కట్టేశాడు.

ఇన్స్పెక్టర్ శ్రీనివాస్‌కి ఫోన్ చేశాడు.

"జాన్సన్! సులేమాన్‌ని ఎందుకు హత్య చేశావు?" సూటిగా అతని కళ్ళలోకి చూస్తూ అన్నాడు కిరణ్.

"నా దారికి అడ్డు వచ్చాడు. నేను సంపాదించుకున్న నాణెం చేజిక్కించుకొని పారిపోయాడు. ఆ నాణెం విలువ ఇరవై లక్షలు. దాన్ని ఎక్కడో దాచేశాడు. దానికోసమే వాణ్ని చంపేశాను. కాని నాణెం దొరకలేదు. సాయంత్రం గార్డెన్‌లో నీ దగ్గిర ప్లాన్ కాగితం ఏదో చూశాను. అది సులేమాన్ నాణెం దాచిన ప్లాన్ అని గ్రహించాను. ఫరూక్‌తో ఇక్కడికొచ్చాను" అన్నాడు జాన్సన్.

"మీ స్థావరానికి మనిషి ఒకడు వచ్చాడు. అతన్ని ఏం చేశారు?"

"ఏం చెయ్యలేదు. మా దగ్గర నాణేలు తస్కరించుకుపోవాలని చూశాడు. ఫరూక్ షూట్ చేశాడు. కాలికి దెబ్బ తగిలింది. అతన్ని మా దగ్గరే బంధించాం. ఎంత

హింసించినా తనెవరో చెప్పలేదు. సి.బి.ఐ. ఏజెంటు అయివుంటాడని ప్రాణాలు తియ్యకుండా బంధించాం."

"నాణేలు ఎక్కడున్నాయి?"

"ఫరూక్ దగ్గర. అతనే ఇప్పుడు తప్పించుకు పారిపోయాడు.

"న్యూయార్క్ మ్యూజియంనించి నాణెం దొంగిలించినది ఎవరు?"

"రహీం అని నేను నియమించిన మనిషి. నాణెం ఇండియా తెచ్చి దాచేసి, ఎక్కడో పోయిందని అబద్ధమాడేడు—వాడు దాన్ని పబ్లిక్ గార్డెన్‌లో ఓ చోట పాతిపెట్టడం నేను గుర్తించాను. వాడికి తెలీకుండా దాన్ని నేను తవ్వి తెచ్చేశాను."

"మరి బ్రిటన్ నాణెం....?"

"దాన్ని మనోహర్ అని మరో ఏజెంట్ తెచ్చాడు. వాడు, రహీం లాలూచీ పడ్డారు. వాళ్ళని పోషించిన మమ్మల్నే మోసంచెయ్యాలనే చూశాడు. అందుకే నేను మనోహార్ ఫ్లేన్‌లో బిగించిన బ్రిటన్ నాణెం కూడా తెచ్చేశాను."

"వాళ్ళిద్దరు ఎక్కడున్నారు?"

"పరలోకంలో. మా స్థావరంమీద దాడిచేశారు. నేనే చంపేసి సులేమాన్ లాగానే సాగర్‌లో పారేశాను. ఈపాటికి శవాలు తేలి వుంటాయి."

"ఇంతకీ మీ స్థావరం ఎక్కడ?"

అంతలో తలుపు దగ్గర ఏదో చప్పుడైంది. కిరణ్ చటుక్కున పక్కకు తప్పుకున్నాడు.

జాన్సన్ నోరు తెరిచేంతలో 'సుయ్‌న' గుండు వచ్చి అతని తలలోనించి దూరిపోయింది.

కిరణ్ నిర్ఘాంతపోయాడు. గ్లాస్ విండో వంక పరు గెత్తాడు. బాల్కనీలోనించి పరుగెత్తుతున్న వ్యక్తి కాలికి గురిచూసి కాల్చాడు. అతను అమాంతం విరుచుకు పడి పోయాడు.

కిరణ్ ఒక్క అంగలో అతన్ని సమీపించాడు.

ఆ వ్యక్తి మెరుపులా లేచి కిరణ్ని కాల్చబోయాడు.

అతని చేతికి గురిచూసి కాల్చాడు కిరణ్. రివాల్వర్ వదిలేసి బాధగా చెయ్యి పట్టుకున్నాడు ఆ వ్యక్తి.

అంతలో ఇన్స్పెక్టరు శ్రీనివాస్ బలగంతో వచ్చాడు.

"మిస్టర్ శ్రీనివాస్! జాన్సన్ చచ్చిపోయాడు. మనం వెంటనే గోల్కొండలోని ఫరూక్ అలీ నివాసానికి వెళ్ళాలి. దారి ఫరూక్ చూపిస్తాడు. అక్కడ మోహన్ క్షేమంగానే వున్నాడుగాని చాలా దీనావస్థలో వుండి వుంటాడు. ముందు అతన్ని విడిపించాలి. తర్వాత నాణెం విషయం...." అన్నాడు కిరణ్.

ఫరూక్ అలీ చేతికి కఫ్స్ బిగించాడు శ్రీనివాస్. అతడి దగ్గరున్న రెండు నాణేలను స్వాధీనం చేసుకున్నాడు.

# 10

సికింద్రాబాద్లోని మారేడిపల్లి రోడ్న వుంది సులేమాన్ సూచించిన పాడుబడ్డ మశీదు.

అక్కడ ఆగింది పోలీసు వాను.

కిరణ్ సూచన ప్రకారం మశీదుకి కుడిపక్కనున్న మర్రిచెట్టుకింద తవ్వకం కొనసాగింది.

సరిగ్గా ఎనిమిది అడుగుల లోతున ఓ చెక్కపెట్టె కనిపించింది. పైకి తీశారు.

పెట్టె తెరిచాడు శ్రీ ని వా స్. లోపల నాణెం, దానితో ఓ చీటీ వుంది.

చీటీలో — జాన్సన్ అనబడే విదేశీ యాత్రికుడు నాణెం మ్యూజియంనించి తస్కరించి పోతుండగా తాను పసిగట్టి వెంటాడి నాణేన్ని చేజిక్కించుకున్నట్టు, దాన్ని తిరిగి మ్యూజియంకి అందచేసేలోపల తనకేదైనా ప్రాణాపాయం కలగలచ్చునన్న అనుమానంతో నాణేన్ని ఇక్కడ భద్రపరుస్తూన్నట్టు, నాణెం భద్రపరిచిన స్థలాన్ని తాను సాంకేతంగా ఓ ఉత్తరంలో సూచించి పంపుతున్నట్టు క్యూరేటర్ పేర సులేమాన్ రాశాడు.

"సులేమాన్ గొప్ప దేశభక్తుడు. ప్రభుత్వోద్యోగులకు ఆదర్శప్రాయుడు" అన్నాడు కిరణ్. "అతని ఆత్మకు భగవంతుడు శాంతి కలగజెయ్యాలి!"

శ్రీనివాస్ హేట్ తీసి, తనూ దేవుడ్ని స్మరించాడు.

"ఇక మోహన్ గారికి మీ డిపార్టుమెంటులో స్థానం కల్పించాలి".అన్నాడు కిరణ్ పక్కనే వున్న మోహన్ ని చూస్తూ శ్రీనివాస్ తో.

మోహన్ కృతజ్ఞతగా నవ్వాడు. అతని ముఖం పీక్కుపోయివుంది. గడ్డం బాగా పెరిగిపోయింది.

"మిస్టర్ శ్రీనివాస్. నీ కోసం సాగర్ లో మరో రెండు శవాలు సిద్ధంగా వున్నాయి. వెళ్ళి వాటి పని చూడు" అన్నాడు కిరణ్.

"ఏం చేస్తాం బ్రదర్, మా డ్యూటీయే అంత!" అన్నాడు శ్రీనివాస్ కిరణ్ వంక నవ్వుతూ చూస్తూ.

—:ఐ పో యిం ది:—

# రాక్షసి పక్షి

మోహన్

భయంకరమైన కాంగో అడవులు.

దట్టమైన ఆ అడవుల్లో ఎన్నో క్రూర జంతువులు, విష క్రిములు విచ్చలివిడిగా తిరుగుతున్నాయి. ఆ అడవుల్లో అప్పుడప్పుడూ జరిగిన అగ్ని ప్రమాదాలవల్ల అక్కడక్కడా చెట్లు కాలిపోయి కొంత విశాల ప్రదేశం ఏర్పడింది.

అటువంటి ఒక చిన్న మైదానం చుట్టూ హంటర్ జాక్సన్, అతని బృందం మాటువేసి వున్నారు.

జాక్సన్ చిన్నతనంలోనే గొప్ప హంటర్‌గా పేరు పొందాడు. బ్రెజిల్ దేశానికి చెందిన జాక్సన్ ప్రపంచంలోని అడవులన్నీ తిరిగాడు. ఎన్నో భయంకరమైన జంతువులనూ, వింత మృగాలనూ వేటాడి చంపి, వాటి శరీరం చెడకుండా రసాయనాలు పూసి, బ్రెజిల్‌లోని తన నివాసాన్ని ఒక అపురూపమైన మ్యూజియంగా మార్చాడు.

ప్రపంచంలో ఎక్కడ ఏ రకమైన వింత జంతువున్నట్లు తెలిసినా, ఎన్ని కష్టనష్టాలకయినా వోర్చి అక్కడకు వెళ్ళి ఆ జంతువును వేటాడి తన గృహానికి తెస్తాడు జాక్సన్. అటువంటి పనిమీదే అతడు తన బృందంతో భయంకరమైన కాంగో అడవుల్లో అడుగుపెట్టాడు.

అంతటి సాహసుడైన జాక్సన్ మహా క్రూరుడు. మనుషులను కూడా జంతువుల్లా చూస్తాడు. అతని సేవకులు ఏ చిన్న తప్పుచేసినా వారిని విచక్షణా రహితంగా, క్రూరంగా శిక్షిస్తాడు. అందుకే అతనివద్ద పనిచేసేవారికి క్రూర మృగాలకన్నా — జాక్సనంటే నే ఎక్కువ భయం.

"జూబో, నీవు చెప్పినవేళ సమీపిస్తుంది. అవి నిజంగా వస్తాయంటావా?" తన పక్కనున్న తన కాంగో ఫారెస్టు గైడ్ జూబోను చూస్తూ అడిగాడు జాక్సన్.

"వస్తాయి మాస్టర్—వరుసగా ఐదు రోజులు ఈ పొదల్లోనుండే చూశాను. సరిగ్గా ఈ సమయానికి ఇక్కడకు వచ్చి దాదాపు గంటసేపు ఉంటాయి—" ఆకాశంవైపు చూస్తూ అన్నాడు జూబో.

జాక్సన్ మైదానం చుట్టూ ఒకసారి తిరిగి ఏర్పాట్లన్నీ మరొకసారి పరిశీలించాడు. జూబో సందేశం ప్రకారం తను నాలుగు ఫిరంగులు తెచ్చాడు. వాటిని మైదానానికి నాలుగు ప్రక్కలా అమర్చాడు. ఫిరంగులు ఎదురెదురుగా కాకుండా కొద్దిగా పక్కగా అమర్చాడు. ఇక రైఫిల్స్ సరేసరి. జాక్సన్ చేయవలసినపనల్లా ఫైరింగ్ ఆర్డర్ ఇవ్వటం. మిగిలిన పనంతా అతని సేవకులు చూసుకుంటారు.

"మార్టిన్ బీ అలర్ట్. ఏ నిముషంలోనైనా ఆ

పక్షులు రావచ్చు. విల్లీ లోడ్ ద కానన్స్. అందరూ ఒక విషయం గుర్తుంచుకోండి — పక్షులు వచ్చి సెటి లయ్యేంత వరకూ నేను ఫైరింగ్ ఆర్డరు ఇవ్వను. ఆలోగా మీరు ఒక్కొక్క పక్షికి రెండు ఫిరంగులు గురిపెట్టాలి. గురి ఎట్టి పరిస్థితులలో కూడా తప్పకూడదు. బివేర్ —" అంటూ అందరికీ ఆదేశాలిచ్చి తిరిగి తను జూబో ప్రక్కన నిలుచున్నాడు జాక్సన్.

ఫిరంగులన్నీ అడవి లోపలికున్నాయి — మైదానం నుండి చెట్ల కొమ్మలు విరిచి కప్పారు. మైదానం నుంచి అసలు మనుషులు కాని, ఫిరంగులు కాని కనబడవు. ఎవరూ ఉన్నచోటునుండి కదలకుండా నిలుచున్నారు.

ఆకాశంవైపు తదేకంగా చూస్తున్న జూబో "మాస్టర్, అవి వస్తున్నాయి" ఉత్సాహంగా అన్నాడు.

జాక్సన్ జూబో చూపించినవైపు చూసాడు. ఆకాశంలో అవి రెండు చుక్కలమాదిరి కనబడుతున్నాయి. వలయాకారంలో తిరుగుతూ నెమ్మదిగా మైదానంవైపు వస్తున్నాయి.

అంత పెద్ద పక్షులు, అంత చిన్నగా కనబడుతుంటే, అవి భూమికి ఎంత ఎత్తున ఎగురుతున్నాయో—అంచనా వేయసాగాడు జాక్సన్. లేదా జూబో వాటి ఆకారం గురించి అతిశయోక్తులు చెప్పి వుండాలి.

అవి క్రిందకు వస్తున్న కొద్దీ వాటి ఆకారం కొద్ది కొద్దిగా కనబడసాగింది. చుట్టూ పొదల్లో నిలుచున్న వారంతా పక్షులను ఉత్సాహంగా గమనిస్తున్నారు.

సరిగ్గా పదినిమిషాల తర్వాత ఆ పక్షులు రెండూ మైదానంలో వాలాయి. వాటి రెక్కల చప్పుడు తుఫాను హోరులా వినిపించింది. అవి క్రిందకు దిగేటప్పుడు ఆ

గాలికి మైదానంలో వున్న ఎండుటాకులూ పుల్లలూ కొట్టుకు పోయాయి.

జాక్సన్‌కు, జూబో మామూలు తుపాకులు ఎందుకు పనికిరావన్నాడో అప్పుడు అర్థమయింది. ఒక్కొక్క పక్షి దాదాపు పదడుగుల ఎత్తుంది. మనిషి తలకంటే రెండింత లున్న తల. దాని ముక్కు ఒక అడుగు పొడవుతో వాడిగా వుంది. తలచుట్టూ పెంకులాంటి కవచముంది. ముఖమంతా వెంట్రుకలు. కళ్ళు రెండంగుళాల వ్యాసంతో ఎర్రగా భయంకరంగా వున్నాయి. వాటి మెడ కూడా తలంత లావుంది. భారీ శరీరం. ఒక్కొక్క రెక్క దాదాపు తొమ్మిది అడుగుల పొడవుంది. రెండు రెక్కలూ విప్పితే పక్షి ఇరవై అడుగుల నేలను ఆక్రమిస్తుంది. కాళ్ళు కురుచగా రెండడుగుల పొడవుతో బలిష్టంగావున్నాయి. పెద్ద పాదాలకు ఆరంగుళాల వ్రేళ్ళు, రెండంగుళాల వాడైన గోర్లున్నాయి.

భయంకరమైన ఆ రాక్షసి పక్షులను చూస్తూనే చుట్టూ పొదల్లో వున్న వారంతా భయంతో బిగదీసుకు పోయారు.

ఆ పక్షులను గురించి జూబో చాలా తక్కువగా చెప్పాడనిపించింది. ఒక్కొక్క పక్షి బరువు దాదాపు వెయ్యి కేజీలుండవచ్చని అంచనావేశాడు జాక్సన్. ఇటువంటి రాక్షసి పక్షులు ఇంకా జీవించి వున్నాయని ప్రపంచంలో ఎవరికీ తెలియదు. ప్రమాదవశాత్తు వాటి రహస్య స్థలం జూబో కంటపడింది.

ఆ రాక్షసి పక్షులను చూసి హంటర్ జాక్సన్ ఆనందంతో పొంగిపోయాడు. వీటిని చూసి ప్రపంచంలో చెలరేగే సంచలనం, తనకు రాబోయే కీర్తిని గురించి

ఆలోచిస్తున్నాడు.

రెండు నిమిషాలపాటు పక్షులు అటూ, ఇటూ తిరిగాయి. ఆ తరువాత రెండూ ఒకచోటికి చేరి నిశ్చలంగా నిలుచున్నాయ్. ఏదో అనుమానం వచ్చినట్లు చుట్టూ వున్న అడవిని పట్టి పట్టి చూడసాగాయి.

ఇక ఆలస్యం చేయదలచుకోలేదు జాక్సన్. "ఫైర్" అంటూ గట్టిగా అరిచాడు.

వెంటనే పక్షులు రెండూ అనుమానంతో అరుపు వినిపించినవైపు తిరిగాయి. అంతలోనే ఫిరంగి గుండ్లు వాటివైపు దూసుకొచ్చాయి.

ఒక గుండు ఆడపక్షి తోకను రాసుకుంటూ వెళ్ళి అడవిలోపడింది. దాని తోక అడుగుభాగం తెగి ఈకలు క్రింద పడ్డాయి. మిగతా గుండ్లు వచ్చేలోగా పక్షులు రెండూ దూరంగా జరిగాయి. అవి కదలటంతో మిగతా మూడు ఫిరంగి గుళ్లు మగపక్షికి తగిలాయి. ఒక గుండు దాని కడుపులో దూసుకుపోయింది. ఇంకొక గుండు తగిలి దాని మెడ అర్థ భాగం తెగిపోయింది. రివ్వున రక్తం చిమ్మింది. మూడవగుండు కుడికాలును విరగకొట్టేసింది. మగపక్షి పెద్ద శబ్దంతో క్రిందపడిపోయి గిలగిలా కొట్టుకోసాగింది.

మగపక్షి క్రిందపడగానే భయంకరంగా అరిచింది ఆడపక్షి. ఆ అరుపులకు అడవిలోని జంతువుల పక్షుల అరుపులు ఆగిపోయాయి. అడవంతా నిశ్శబ్దం ఆవహించింది. జాక్సన్ బృందమంతా నిలుచున్నచోటే గడగడా వణకసాగారు.

మరొకసారి అడవి దద్దరిల్లేలా అరచి రివ్వున గాలిలోకి లేచింది ఆడపక్షి. షాక్ నుంచీ తేరుకొన్న జాక్సన్, తన రైఫిల్‌తో దాన్ని కాల్చాడు. గుండు పక్షి ఈకల

కింనున్న బలమైన కవచానికి తగిలి క్రిందపడింది. మళ్ళీ కాల్చేలోపే క్షణంలోనే రాక్షసిపక్షి ఆకాశంలోకి వేగంగా ఎగిరిపోయింది. క్షణాల్లో అది ఆకాశంలో చుక్కలా మారిపోయింది.

# 2

రెండు నిమిషాల తరువాత జాక్సన్ బృందమంతా చనిపోయిన మగ పక్షి చుట్టూ గుమిగూడారు.

"ఫూల్స్, రెండో పక్షి గురి ఎలా తప్పింది? అమూల్యమైన అవకాశాన్ని పోగొట్టారు" కోపంగా అరిచాడు జాక్సన్.

"ఆఖరి క్షణంలో పక్షులు ప్రక్కకు జరిగాయి మాస్టర్. గురి మార్చే అవకాశం లేకపోయింది" సంజాయిషీగా అన్నాడు మార్టిన్.

అందరూ ఆ పక్షి రాక్షస కాయాన్ని ఆశ్చర్యంగా చూస్తున్నారు.

ఆకాశంలో చుక్కగా మారి మాయమైన ఆడ రాక్షసి పక్షి ఒక్కసారిగా రెక్కలు ఆడించటం మాని వేసింది. రెక్కలు మూసుకోవటంతో అది బుల్లెట్‌లా మైదానం కేసి దూసుకురాసాగింది.

చనిపోయిన పక్షిని పరిశీలించటంలో నిమగ్నులయిన జాక్సన్ బృందం వాయువేగంతో క్రిందకు వస్తున్న ఆడపక్షిని చూడలేదు.

"దీని కడుపు క్రింది భాగం జాగ్రత్తగా కోసి మాంసాన్ని తీసివేయండి" ఆదేశించాడు జాక్సన్. అందరూ హంటింగ్ నైవ్స్‌తో మగపక్షిని చుట్టుముట్టాయి. జాక్సన్ దూరంగా నిలుచుని చూస్తున్నాడు.

భూమికి కొద్ది దూరంలో రెక్కలు విప్పి, దూరంగా

ఒంటరిగా నిలుచున్న జాక్సన్ వైపు డైవ్ చేసింది రాక్షసి పక్షి. అది రెక్కలు విప్పగానే హోరుమని వినిపించిన శబ్దానికి అందరూ ఆకాశంవైపు చూసారు.

వేగంగా వస్తున్న పక్షిని చూడగానే కొద్ది సేపటి వరకూ భయంతో వారి కాళ్ళు కదలలేదు. అంతలో అది జాక్సన్‌ను సమీపించి, ముక్కుతో అతని మెడ పట్టుకొని పైకి లేచింది. మెడ ఒక పక్కకు వొంగిపోయి వికృత భంగిమలో జాక్సన్ పైకి లేచాడు. రైఫిల్ చేతి నుంచీ జారిపడింది.

ఇరవై గజాలు పైకి లేవగానే ముక్కు బలంగా నొక్కింది పక్షి. జాక్సన్ మెడ పుల్లలా విరిగిపోయి, తలా మొండెము వేరయిపోయి భూమిమీద పడ్డాయి.

జాక్సన్ శరీరం భూమిమీద పడ్డంతో-పారిపోతున్న గుంపువైపు తిరిగీ డైవ్ చేసింది రాక్షసి పక్షి. చివరగా పోతున్న జూబో శరీరాన్ని రెండు కాళ్ళతో పట్టి పైకి లేచింది. దాని గోర్లు జూబో శరీరంలో లోతుగా దిగబడ్డాయి. జూబోను అవలీలగా ఎత్తుకొని ఆకాశంలోకి ఎగిరిపోయింది. మిగిలిన బృందమంతా భయంతో భయంకరమైన కాంగో అడవుల్లో దిక్కుతోకరుగా పారిపోయారు.

అలా పైకిలేచిన పక్షి ఆకాశంలో రెండుగంటలసేపు వేగంగా తిరిగి, చివరకు ఒక కొండపైన వాలింది.

దాని కాళ్ళక్రింద చిక్కుకున్న జూబో నిస్సత్తువగా కళ్ళు తెరిచాడు. రాక్షసి పక్షి తలవంచి జూబోనే చూస్తుంది. దాన్ని అంత దగ్గరగా చూసేసరికి భయంతో వణుకుతూ తిరిగి కళ్ళు మూసుకున్నాడు.

పక్షి ముక్కుతో మూసుకునున్న జూబో కుడికన్నును

పొడిచింది. కనుగుడ్డును చీల్చుకొని దాని ముక్కు మూడం గుళాలు లోనికి వెళ్ళింది. భయంకరంగా చావుకేక వేశాడు జూబో. కన్నుతో పాటు ముఖంలో కుడిభాగ మంతా చితికిపోయింది. మళ్ళీ కడుపులో పొడిచింది. దాని ముక్కుతో పాటు పేగులు బయటకు వచ్చాయి. చివరిసారిగా మూలిగి తల వాల్చేశాడు జూబో.

ఐదునిమిషాలపాటు కసిగా జూబో శరీరాన్నంతా పొడిచేసింది. జూబో శరీరం ఆకారం, లేని మాంసం ముద్దలా తయారయింది. అంతవరకూ మానవుల జోలికి వెళ్ళని రాక్షసి పక్షి, మెల్లగా జూబో మాంసాన్ని తినసాగింది. దానికి జంతువులకన్నా—మనిషి మాంసమే రుచిగా కనిపించింది. కొద్దిసేపట్లోనే జూబో ఎముకలు మిగిలాయి.

కొండపైన కొద్దిసేపు అటూ ఇటూ తిరిగి గాలిలోకి లేచింది ఆడపక్షి. పది నిమిషాల్లో అది మైదానంలో వాలింది. చనిపోయిన మగ పక్షిని కొద్దిసేపు చూసి తిరిగి గాలిలోకి లేచింది. ఈసారి అది కాంగో అడవులను దాటి సముద్రంమీదుగా ప్రయాణించసాగింది.

ఆకాశంలో మేఘాల్లో కలిసిపోయి వేగంగా సముద్రంపైన ప్రయాణిస్తుంది రాక్షసి పక్షి.

అలా పదిగంటలసేపు విరామం లేకుండా అది ఎగురుతూనే వుంది. ఇరవై నాలుగు గంటలపాటు అది గాలిలో ఎగిరినా దానికి శ్రమనిపించదు. శాస్త్రజ్ఞుల దృష్టిలో అంత భారీ శరీరమున్న పక్షులు గాలిలోకెగరలేవు. కాని దాని శరీరాన్ని మించిన రెక్కలుండటంతో ఈ రాక్షసి పక్షి సునాయాసంగా గాలిలో ఎగరగలదు. ఆహారం, నీరు లేకుండా మూడురోజులపాటు వుండగలదు.

అది అరేబియా సముద్రం దాటింది. భారతదేశం భూభాగంపైన ఎగరసాగింది.

చివరకు అది సముద్రానికి దగ్గరగా వున్న ఒక ఎత్తయిన కొండపైన వాలింది. ఆ కొండకు ఇరవై కిలో మీటర్ల దూరంలో ఒక చిన్న పట్టణముంది.

## 3

రాత్రి ఏడు గంటలవుతోంది.

"రామూ సిగరెట్లు తెచ్చావా. మనకోసం సురేష్ వీధిలో చివర్లో ఎదురుచూస్తున్నాడు. త్వరగా రా" రామూ ఇంటికి వచ్చి రహస్యంగా అన్నాడు హరి.

హరి జేబులో మూడు సిగరెట్లున్నాయి. ఆ రోజు ఎలాగయినా సిగరెట్లు మొదటిసారిగా తాగాలను కున్నారు వారు. వారు ముగ్గురు పదిహేను సంవత్సరాల లోపువారే. తొమ్మిదవ తరగతి చదువుతున్నారు. ఆ ముగ్గురిలో హరి కాస్త ధైర్యవంతుడు కాబట్టి సిగరెట్లు తెచ్చే బాధ్యత హరిపైన పెట్టారు.

"అగ్గిపెట్టె తెచ్చావా" గొంతు తగ్గించి అడిగాడు రామూ.

"తెచ్చాను. ఎవరూ చూడకుండా రైల్వేస్టేషన్‌లో కొన్నాను సిగరెట్లు, అగ్గిపెట్టె."

"వుండు, ఇప్పుడే వస్తాను" అంటూ ఇంట్లోకి పరుగెత్తాడు రాము.

"అమ్మా, హరితో వాడింటికి వెళ్ళి నోట్సు తెచ్చుకుంటే నే" అని వాళ్ళమ్మతో చెప్పి చెప్పులేసుకొని బయటకొచ్చాడు.

హరి, రామూ వీధి చివరనున్న సురేష్‌ను కలుసు కున్నారు. ముగ్గురు పిల్లలూ భయంగా అటూ, ఇటూ

చూసారు. మొదటిసారిగా సిగరెట్ తాగబోతున్నందుకు వారిలో ఉత్సాహంతో పాటు, భయం కూడా చోటు చేసుకుంది.

"ఎక్కడ తాగుదాం రా" అడిగాడు రాము.

రాత్రి ఏడుగంటల ప్రాంతం కాబట్టి వీధిలో జన సంచారం ఇంకా వుంది.

"మనం బీచ్‌కి పోదాం రా. అక్కడ ఈ సమయంలో ఎవరూ వుండరు. భయంలేకుండా సిగరెట్ తాగవచ్చు" సురేష్ ప్రపోజ్ చేసాడు.

ఆ ఆలోచన మిగిలినవారికి కూడా నచ్చింది. బీచ్ — అక్కడనుండి రెండు ఫర్లాంగుల దూరం వుంది. అక్కడక్కడా కొన్ని జంటలు వున్నా, బీచ్ ఆ సమయంలో దాదాపు నిర్మానుష్యంగా వుంటుంది.

ముగ్గురు పిల్లలూ బీచ్‌కి బయలుదేరారు.

## 4

రెండు రోజులనుండి కొండపైన తిరుగుతున్న రాక్షసి పక్షికి, ఒక కుందేలు తప్ప ఎలాంటి ఆహారమూ దొరక లేదు. అది దాని భారీకాయానికి ఏ మూలకూ సరిపోలేదు.

దానికి మగపక్షి జ్ఞాపకం వచ్చింది. కోపంగా కొండ పైన అటూ ఇటూ తిరగసాగింది. కోపమూ, ఆకలి కలిసి దాన్ని గాలిలోకి లేచేలా చేసాయి. కొండపైనుండి ఆకాశంలోకి లేచి రెండు రౌండ్లు కొట్టింది. చీకట్లో కూడా చూడగలిగిన దాని కళ్ళకు దూరంగా సముద్ర తీరం కనపడింది. అది బీచ్ వైపు బయలుదేరింది.

రాక్షసి పక్షి బీచ్ పైకి వచ్చింది.

కొద్దిసేపటికి దాని కళ్ళకు సిగరెట్లు తాగుతున్న ముగ్గురు పిల్లలు కనిపించారు. వాళ్ళని గమనిస్తూ అది బీచ్

చుట్టూ తిరగసాగింది.

సురేష్ ముందు సిగరెట్ పారేశాడు. "నేను సముద్రంలో నోరు కడుక్కొస్తా(న్రా), లేకుంటే మా నాన్న సిగరెట్ వాసన గుర్తుపడ్తాడు" అని సముద్రంవైపు బయలుదేరాడు.

రాక్షసి పక్షి ఒక్కసారిగా సురేష్‌వైపు డైవ్ చేసింది. దాని రెక్కల శబ్దానికి సురేష్ ఆకాశంవైపు చూశాడు. 'కెవ్వు'న అరిచాడు. అంతలోనే ఆ పక్షి సురేష్ రెండు భుజాలూ కాళ్ళతో పట్టి ఆకాశంలోకి ఎగిరింది.

సురేష్ అరుపు విని హరి, రామూ ఆ వైపు చూసారు. సముద్రంపైన ఎగురుతున్న రాక్షసిపక్షి దాని కాళ్ళక్రింద చిక్కుకున్న సురేష్‌ని చూసి భ్రమాన్వడిపోయారు. వారు చూస్తూండగానే సురేష్ కనుమరుగైపోయాడు.

అప్పటికి తేరుకున్న రామూ, హరి పెద్దగా అరుస్తూ ఊరివైపు పరిగెత్తారు. ముందుగా సురేష్ వాళ్ళింటికి వెళ్ళి జరిగింది చెప్పారు.

సురేష్ వాళ్ళ నాన్న కృష్ణారావుకు, ముందు వీరు చెప్పింది అర్థంకాలేదు. పక్షి ఏమిటి, సురేష్‌ను తన్నుకు పోవడం ఏమిటి— ఈ పిల్లలకేం పిచ్చిపట్టలేదుకదా అనుకున్నాడు. కాని వారు ఏడుస్తూ మళ్ళీ మళ్ళీ చెప్పటంతో నమ్మక తప్పలేదు. సురేష్ వాళ్ళమ్మ బోరున ఏడ్చింది.

వీధిలో వాళ్ళను నలుగురిని వెంటపెట్టుకుని టార్చ్ లైట్లతో బీచ్‌కి బయలుదేరారు. రామూ, హరి చూపించిన చోటు చూసారు. ఆ ప్రాంతమంతా సురేష్ పేరు పిలుస్తూ రెండు గంటలసేపు వెతికారు. ఇక లాభం లేదనుకుని మనసు చిక్కబట్టుకుని కృష్ణారావు—హరి,

రాముతో పోలీస్ స్టేషన్‌కు వెళ్ళాడు.

కృష్ణారావు చెప్పిందంతా విని పోలీస్ సబ్ ఇన్స్పెక్టర్, పకపకా నవ్వాడు. "ఏమిటి సార్! వీరు చెప్పిందంతా మీరు నమ్మారా, పిల్లలేదో తమాషా చేస్తున్నట్టున్నారు" అన్నాడు మరోమారు నవ్వుతూ.

రాముకు ఏడుపు తన్నుకొచ్చింది. తమ మాట యెవ్వరూ నమ్మటంలేదు.

"నిజంగా మేము చూసాము సార్. ఏదో పెద్ద పక్షి సురేష్‌ను కాళ్ళతోపట్టి తీసుకెళ్ళింది. త్వరగా వెళ్ళి వాడిని రక్షించండి సార్" బోరున ఏడ్చేసాడు రాము.

"కనీసం వీరి మాటలు నిజమో, అబద్ధమో తెలుసుకునేందుకైనా మీరు పరిశోధించాలి సబ్ ఇన్స్పెక్టర్ గారూ. నేను మాత్రం వీరి మాటలను నమ్ముతున్నాను" బాధగా అన్నాడు కృష్ణారావు.

"క్షమించండి కృష్ణారావుగారూ, వీరు అబద్ధం చెబుతున్నారనికాదు. ఏదో చూసి, ఏదో అనుకుని భ్రమపడి వుంటారు. మనుషులను ఎత్తుకుపోగల పెద్ద పక్షులు ఇప్పుడు ఎక్కడున్నాయి? సురేష్ వీళ్ళను ఏడిపించాలని ఎక్కడో దాక్కుని వుంటాడు. మీరేం గాబరా పడకండి. రేపు ఉదయంవరకూ తిరిగిరాకుంటే అప్పుడు కేస్ టేకప్ చేస్తాను" అని టేబుల్ పైనున్న ఫైల్‌లో తల దూర్చాడు సబ్ ఇన్స్పెక్టర్.

## 5

పున్నమి రాత్రి.

బీచ్ — వెన్నెల్లో పట్టపగల్లా మెరుస్తోంది. రాత్రి ఎనిమిది గంటలయినా అక్కడ జనసంచారం తగ్గలేదు. జంటలతో పిల్లలతో బీచ్ అంతా సందడిగా వుంది.

బీచ్ మధ్యలో కూర్చుని వున్నారు—ఆ పట్టణానికి స్కౌట్ కాంప్ వచ్చిన పక్క ఊరి కాలేజి పిల్లలు. వారు పగలంతా హరిజన వాడలో రోడ్డు వేశారు. సాయంకాలమవగానే అమ్మాయిలూ, అబ్బాయిలూ వేరు వేరుగా ఊరు చూడడానికి బయలుదేరారు. ఆ రాత్రి అమ్మాయిలు బీచ్ ప్రోగ్రాం వేశారు. వారితో పాటు వారి లెక్చరర్ కూడా వచ్చింది.

అమ్మాయిలు చాలాసేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు. ఏవేవో ఆటలాడారు. అవికూడా వారికి బోర్ కొట్టాయి.

అమ్మాయిలంతా సముద్రపు వొడ్డున తడి ఇసుకపైన కూర్చున్నారు. అలలు వచ్చినపుడల్లా వాళ్ళ కాళ్ళు తడుస్తున్నాయి. కాళ్ళు తడిచినప్పుడల్లా ఉల్లాసంగా నవ్వుతున్నారు అమ్మాయిలు.

దూరంగా, ఒంటరిగా కూర్చున్న వారి మేడమ్, వారినే జాగ్రత్తగా చూస్తోంది. వారి జాగ్రత్తకోసం ఆత్రుతపడుతున్న మేడమ్, పాపం తన జాగ్రత్త కోల్పోయింది.

ముందు రోజు నరమాంసంతో కడుపునింపుకున్న రాక్షసి పక్షి అలవాటుపడ్డట్టుగా తిరిగి ఆ రోజు కూడా బీచ్ పైన తిరగసాగింది. ఆ రోజు కొండపైన అది ఎలాంటి ఆహారంకోసం ప్రయత్నించలేదు. జంతువుల కంటే మనుషులే తేలికగా దొరుకుతారనిపించింది దానికి.

కొన్ని వందల అడుగుల ఎత్తున తిరుగుతున్న దానికి, క్రింద బీచ్‌లో గుంపులు గుంపులుగా వున్న మనుషులు స్పష్టంగా కనిపిస్తున్నారు. రాక్షసి పక్షి ఉన్నట్లుండి రెక్కలు ముడుచుకుంది. దాని శరీరం రివ్వున బీచ్ కేసి

చూసుకొచ్చింది.

ఎందుకో యథాలాపంగా ఆకాశంవైపు చూసిన మేడం కళ్ళకు, వెన్నెల్లో తనవైపు వేగంగా వస్తున్న రాక్షసి పక్షి కనిపించింది. 'కెవ్వు'న అరిచి లేచి నిలుచుంది. అప్పటికే ఆలస్యం అయింది. పక్షి కాళ్లు ఆమె నడుమును చుట్టుకున్నాయి. దాని వాడిగోళ్లు ఆమె కడుపుకు రెండు వైపులనుండి, మెత్తని చర్మాన్ని చీల్చుకుంటూ లోపలికి జొరబడ్డాయి. గాల్లోకి లేచింది రాక్షసి పక్షి.

మేడం అరచిన అరుపుకు అమ్మాయిలేకాక చుట్టు ప్రక్కలున్న చాలామంది ఆ వైపుకు చూసారు. అక్కడ కనిపించిన ఆ భయంకరమైన దృశ్యం వారిని అచేతనంగా చేసింది.

మేడం కాళ్ళు చేతులూ భూమివైపు వ్రేలాడు తున్నాయి. ఆమె నడుము పక్షి కాళ్ళమధ్య వుంది. భయంతో, బాధతో ఇంకా అరుస్తూనే వుంది మేడమ్. ఆమె ఆర్తనాదాలు బీచ్‌లో వున్నవారికి చాలా సేపటి వరకూ వినిపించాయి.

# 6

రాక్షసి పక్షి గురించి పట్టణమంతా వ్యాపించింది. ప్రజలంతా భయభ్రాంతులయ్యారు. వారికి ముందురోజు సురేష్ మాయమైన వైనం, దానికి సబ్ ఇన్స్‌పెక్టర్ నిర్లక్ష్యం కూడా తెలిసింది.

ప్రజలంతా పెద్ద గుంపుగా తయారయి పోలీస్ స్టేషన్ పైన పడ్డారు. ఈ వార్త తెలిసిన డి. ఎస్. పి.గారు వెంటనే అక్కడికి వచ్చారు—సబ్ ఇన్స్‌పెక్టర్ పైన చర్య తీసుకుంటామని, ప్రజల భద్రతకు రక్షణ కల్పిస్తామని—అతను వచ్చేవరకూ ప్రజలు శాంతించలేదు.

జిల్లా హెడ్ క్వార్టర్స్‌లోవున్న ఎస్.పి.కి, డి.ఎస్.పి. ఫోన్ చేసి పరిస్థితి వివరించగానే హుటాహుటిన ఆయన బయలుదేరి వచ్చాడు. ఎస్.పి, డి.ఎస్.పి. ఆ పట్టణంలో వున్న పోలీస్ ఇన్స్పెక్టర్లు అందరూ సమావేశమయ్యారు.

చాలాసేపు రాక్షసి పక్షిని గురించి తర్జనభర్జనలు జరిగాయి. అటువంటి ఆకారమూ, పరిమాణమూ కల పక్షి ఉనికిని గురించి చాలామంది అనుమానం వ్యక్తం చేసారు. కాని వందమందికిపైగా దాన్ని చూసిన సాక్షులుండటంతో వారు నమ్మక తప్పలేదు.

రెండు గంటలు సమావేశం జరిపి, ప్రజల భద్రతకు తీసుకోవలసిన జాగ్రత్తలు గురించి నిర్ణయించారు.

రాక్షసి పక్షిని మట్టుపెట్టేందుకు, ప్రజల భద్రతా ఏర్పాట్లు పర్యవేక్షించేందుకు ఒక సర్కిల్ ఇన్స్పెక్టర్‌ను, టెంపరరీగా అలాట్ చేసారు.

సాయంకాలం ఆరుగంటలు దాటింతరువాత ప్రజలెవ్వరూ బీచ్‌లో ప్రవేశించకూడదని, పగలు కూడా నలుగురికి తక్కువున్న గుంపు బీచ్‌వైపు రాకూడదని, పోలీసులు పట్టణంలో మైక్‌లో అనౌన్స్ చేసారు. ఇక భయపడవలసిన పనిలేదని, రాక్షసి పక్షిని త్వరలో చంపేస్తామని చెప్పారు.

సర్కిల్ ఇన్స్పెక్టర్ సుదర్శన్ బీచ్ చుట్టూ నలభై మంది పోలీసులను రైఫిల్స్‌తో నియమించాడు. పక్షినసలేం చేయవలసినది యెలా చంపవలసిందీ, వారికి వివరించాడు.

## 7

రాక్షసి పక్షికిప్పుడు పగలు ఆహారం కోసం జంతువును వేటాడే బాధలేదు. కొండరాళ్ళ మధ్య కొద్దిసేపు తిరిగి,

హాయిగా కొండరాళ్ళమధ్య ముడుచుకొని రాత్రివరకూ విశ్రాంతి తీసుకుంది.

చీకటిపడగానే లేచి నిలుచుంది రాక్షసి పక్షి. ఒకసారి రెక్కలు బద్ధకంగా విదిలించింది. ఆ విసురుకు దాని చుట్టూ వున్న ఎండుటాకులు, చిన్న రాళ్ళు దూరంగా ఎగిరిపోయాయి. కొద్ది సేపటికి రివ్వున ఆకాశం లోకి లేచింది.

అలవాటు ప్రకారం బీచ్ పైన చీకట్లో రొండు కొట్ట సాగింది. అరగంట తిరిగినా దానికి జనసంచారం కనిపించ లేదు. ఆకాశంలో—ఇంకొద్దిగా క్రిందకు దిగి వెతక సాగింది. బైనాక్యులర్స్ వంటి దాని కళ్ళకు చీకట్లో దాక్కుని వున్న పోలీసులు కనిపించలేదు. నిర్మానుష్యమైన బీచ్ దానికి కొత్తగా అగుపించింది. ఈ కొత్తదనం దానిలో అనుమానం రేపింది. కొద్ది సేపు అలాగే ఎగిరి అసహనంగా మళ్ళీ కొండవైపు వెళ్ళిపోయింది.

భూమికి చాలా ఎత్తులో ఎగురుతున్న రాక్షసిపక్షి పోలీసులకు కనిపించలేదు. ఓపిగ్గా దానికోసం వారు ఎదురుచూస్తున్నారు.

తిరిగి కొండపైకి చేరింది రాక్షసి పక్షి. ఆకలితో కోపంతో అది కీచుమని అరచింది. దాని అరుపుకు చుట్టు ప్రక్కలున్న చిన్న చిన్న జంతువులు జాగ్రత్తపడ్డాయి. దాని భయంకరమైన అరుపు ఇరవై కిలోమీటర్ల దూరంలో వున్న పట్టణానికి వినిపించలేదు.

కొండరాళ్ళ మధ్య తిరుగుతూ ఆహారం కోసం ప్రయ త్నించసాగింది. చాలా సేపటికి దానికి పదడుగుల దూరంలో వున్న చిన్న పొదలో ముడుచుకుని కూర్చున్న ఒక కుందేలు కనిపించింది.

రివ్వున ఎగిరి దాన్ని ముక్కుతో పట్టుకోబోయింది. ఆఖరు నిమిషంలో అపాయం గ్రహించిన కుందేలు వేగంగా ప్రక్కనున్న రెండు పెద్ద కొండరాళ్ళమధ్య వున్న సందులో దూరిపోయింది.

పక్షి ముక్కును కొండరాళ్ళ మధ్య దూర్చి కుందేలును అందుకోవాలని ప్రయత్నించింది. కాని కుందేలు చాలా లోపలికి వెళ్ళినందున దానికి అందలేదు.

అందినట్లు అంది తప్పించుకున్న కుందేలు రాక్షసి పక్షి కోపాన్ని, ఆకలిని అధికం చేసింది. భయంకరంగా అరచి అది తిరిగి గాలిలోకి లేచింది. ఈసారి అది బీచ్ వైపు పోకుండా, దూరంగా లైట్ల వెలుతురులో కనిపిస్తున్న పట్టణం వైపు బయలుదేరింది.

## 8

రాత్రి పదిగంటలు.

పట్టణంలో సందడి సద్దుమణిగింది.

రాక్షసి పక్షి పట్టణం పైకి వచ్చింది. దానికి భవనాలు, విద్యుత్ దీపాలూ కొత్తగా కనిపిస్తున్నాయి. దీపాల వెలుగులో రోడ్డుపైన అక్కడక్కడా నడుస్తున్న ప్రజలు దానికంట పడ్డారు. ఆహారం చూస్తూనే దాని ఆకలి రెట్టింపయింది. కాని నడుస్తున్న మనుషులతోపాటు సైకిళ్ళు, రిక్షాలు, కార్లను చూసి అవేమిటో అర్థంకాక క్రిందకు రావటానికి సందేహించింది.

వాహనాలను చూస్తూ ఆకాశంలో తిరుగుతున్న దాని కళ్ళకు—వెన్నెలలో ఇళ్ళ మిద్దెలపైన నిద్రపోతున్న ప్రజలు కనిపించారు. క్రొద్దిగా ఊరికి చివరలో వున్న ఒక ఇంటిపైన దాని కన్నుపడింది. ఆ మిద్దెపైన రెండు

మంచాలలో ఇద్దరు మగవారు పడుకొనున్నారు.

కొద్ది సేపు వారిని గమనించి అపాయం లేదనుకొని మిద్దెపైకి దూసుకొచ్చింది. నిద్రపోతున్న పరాంకుశం కడుపును రెండు కాళ్ళతో పట్టుకొని పైకిలేపింది.

అకస్మాత్తుగా జరిగిన ఈ సంఘటనకు పరాంకుశం మేలుకొని 'కెవ్వున' అరిచాడు. తనను పట్టుకున్న దెవరో అర్థంకాక బలంగా గింజుకున్నాడు.

రెండు చేతులు బలంగా విదిలించడంతో, సరిగా పట్టుదొరకని పక్షి కాళ్ళ మధ్యనుండి జారి మేడపైన పడ్డాడు.

అప్పుడు వెన్నెల్లో చూసాడు రాక్షసిపక్షిని. భయంకరమైన దాని ఆకారం చూసి — లేవటం కూడా మరచి అదేపనిగా గావుకేకలు పెట్టసాగాడు. ఆ అరుపులకు పక్క మంచంలో నిద్రపోతున్న అతని పెద్ద కొడుకు లేచాడు. అతనికి జరుగుతున్నది అర్థమయ్యే లోపునే రాక్షసి పక్షి మళ్ళీ పరాంకుశం వైపు దూసుకొచ్చింది.

ఈసారి దాని కాళ్ళు పరాంకుశం కడుపును గట్టిగా పట్టుకున్నాయ్. గోళ్లు చర్మాన్ని చీల్చుకొని కడుపులో దూరిపోయాయి. చేతులతో దాని కాళ్ళను విడదీయాలని చూసాడు. కాని దానిబలంముందు అతనిబలం చాలలేదు. అతని కొడుకు తేరుకొని గట్టిగా అరుస్తూ పక్కనున్న నీళ్ళ చెంబును దానికేసి విసిరాడు.

అంతలోనే పక్షి గాలిలోకి లేచింది. పరాంకుశం కొడుకు గట్టిగా కేకలుపెట్టడం ప్రారంభించాడు. అర నిమిషంలో పక్షి పరాంకుశంతోపాటు ఆకాశంలో కలిసిపోయింది. పైనుంచి వినిపించిన కేకలకు — క్రింద పడుకున్న అతని కుటుంబ సభ్యులు, ఇరుగుపొరుగువారు

నిద్రలేచారు.

ఆకాశంవైపు తదేకంగా చూస్తున్న పరాంకుశం కొడుకు కళ్ళనుండి కన్నీటి చుక్కలు జలపాతంలా రాలి పడుతున్నాయి.

# 9

మరునాడు—రాష్ట్రంలోని అన్ని వార్తాపత్రికల్లో, రాక్షసి పక్షిని గురించి మొదటిసారిగా వ్రాసారు. దాని ఆకారాన్ని విశేషంగా వర్ణించారు. ఇంతవరకూ అది జరిపిన దారుణ హత్యా కాండ, ప్రజల భద్రతలో పోలీసుల వైఫల్యం—వివరంగా వ్రాశారు.

ఆ రోజు పట్టణంలో ఎక్కడ చూసినా ప్రజలు—రాక్షసి పక్షిని గురించి మాట్లాడుకుంటున్నారు. ఆడవారు మగవారిని ఇల్లు విడిచి బయటకు పోవద్దని బ్రతిమాలుకుంటున్నారు. పట్టణమంతా రాక్షసి పక్షి జ్వరం వ్యాపించింది.

సర్కిల్ ఇన్స్పెక్టర్ సుదర్శన్‌ను భద్రతా ఏర్పాట్లు విఫలమయినందుకు, తలవాచేలా చీవాట్లు పెట్టాడు ఎస్.పి. ఆ రోజు పత్రికలలో పోలీసులపై విసుర్లు. వారి చేతకానితనం ఎత్తి చూపటంతో ఎస్. పి. గిల్టీగా ఫీలయ్యాడు. అంతలో డి.ఐ.జి. ఆ పట్టణానికి వస్తున్నట్లు మెసేజ్ అందింది.

ఉదయం పదిగంటలకల్లా డి.ఐ.జి.గారు వచ్చారు. అతను రావటంతోటే మీటింగ్ మొదలయింది. అంతవరకూ రాక్షసి పక్షి జరిపిన దాడుల గురించి డి.ఎస్.పి. వివరించాడు. దాన్ని చంపటానికి తాము తీసుకున్న చర్యలు తెలిపాడు.

డి.ఐ.జి. ఆఫ్ పోలీస్ జయరామన్‌కు నలభై ఏళ్ళ

వుంటాయి. ఐ.పి.ఎస్.కు తోడు—మంచి మెరిట్ వున్న ఆఫీసర్ కావటంతో త్వరలో ఆ రాంక్ కు వచ్చాడు. చాలా పట్టుదలగల మనిషి అని పేరుంది. కాని అనవసరంగా కోపం చూపక, పరిస్థితులను అర్థంచేసుకోగల లౌకిక జ్ఞానం అతనిలో వుంది.

మౌనంగా డి.ఎస్.పి. చెప్పిందంతా విన్నాడు జయరామన్. కొద్ది సేపు ఆలోచించాడు.

"ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ నుండి ఫోన్ కాల్ వచ్చింది. ఈ రాక్షసి పక్షిని గురించి ఫుల్ రిపోర్టు పంపమన్నారు. ఇంతవరకూ మీరు చేసిన అరేంజిమెంట్స్ని నేను తప్పు పట్టను—కాని ఇకనుండి ఈ రాక్షసి పక్షి బాధ్యత నేను తీసుకుంటాను. రాక్షసి పక్షి రోజూ రాత్రిపూట వస్తుంది. పగలంతా అది ఎక్కడుంటుందో తెలుసుకోవాలి. ఈ పట్టణానికి ముప్ఫై మైళ్ళ పరిధిలో ఏమైనా అడవులున్నాయా" సబ్ ఇన్స్పెక్టర్ వైపు చూస్తూ అడిగాడు డి.ఐ.జి.

వున్నట్లుండి డి.ఐ.జి. తనను అడిగేసరికి లేచి అటెంషన్ లో నిలుచున్నాడు ఎస్.ఐ. "లేవు సార్. చిన్న చిన్న ముళ్ళపొదలు తప్ప—పెద్ద అడవులు ఈ చుట్టు ప్రక్కల లేవు—" అన్నాడు.

"అంత పెద్ద పక్షి—ఆ ముళ్ల పొదల్లో దాక్కోలేదు. ఇక పోతే మిగిలినవి కొండలు. ఈ చుట్టుప్రక్కలా చాలా కొండలున్నాయి. వాటిలో ఏదో ఒక కొండ ఈ పక్షి నివాసమై వుంటుంది. ఆ కొండలన్నీ వెతకాలంటే చాలా సమయమూ, చాలా బలగం అవసరం. అంత సమయం మనకు లేదు కనుక-నేను మిలిటరీ ఎయిర్ ఫోర్స్ సహాయం తీసుకోవాలనుకుంటున్నాను. హెలి

కాపట్లు ఇక్కడికి రావాలంటే ఒకటి, రెండు రోజులు పడుతుంది. అంతవరకూ మనం జాగ్రత్త వహించాలి. ఈ రోజు సాయంకాలానికి ఐదువందల మంది రిజర్వ్ పోలీసులు ఇక్కడికి వస్తారు" డి. ఎస్. పి. వైపు తిరిగి చెప్పసాగాడు.

"ప్రతి వీధిలో ఒక పోలీస్ వాన్, దానిపైన ఒక సెర్చ్ లైట్ ఫిక్స్ చేయించండి. ప్రజలెవ్వరూ చీకటి పడిన తరువాత బయటకు రావటంకాని, బయట పడుకోవటంకాని జరగకూడదని అనౌన్స్ చేయండి. ఫస్టు షో సెకండ్ షో సినిమాలు నిలిపివేయించండి. అన్ని హోటళ్ళూ—ఆరు తరువాత మూసివెయ్యాలి. రాత్రి పట్టణంలో సైకిళ్ళూ, రిక్షాలు, కార్లు ఏవీ తిరగకూడదు. రైల్వేస్టేషను, బస్టాండునుండి — యిళ్ళకు పోవలసిన పాసింజర్లను—పోలీస్ వాన్‌లలో దిగబెట్టండి. అలాగే ప్రజలెవరయినా అత్యవసరంగా ఇళ్ళనుండి బయటకు పోవలసి వస్తే, ఆ వీధిలోని పోలీస్ వాన్ సహాయం తీసుకోవాలి. ఒక్క మాటలో చెప్పాలంటే చీకటి పడింతరువాత పోలీసులు, పోలీస్ వెహికిల్స్ తప్ప ఎలాంటి మనిషి కాని వాహనంకాని రోడ్డుపైన కనిపించకూడదు. దీన్ని అతిక్రమించిని వాళ్ళను అరెస్టు చేయించండి" డి.ఎస్.పి. ని ఆదేశించాడు డి.ఐ.జి.

"అన్నట్లు మరిచిపోయాను, దేవాలయాల బయట, సత్రాల్లో వుండే బిక్షగాళ్ళను, బైరాగులను చీకటి పడేలోగా సురక్షిత ప్రదేశాలకు చేర్చండి."

అంతవరకూ నోరు తెరుచుకొని వింటున్న డి.ఎస్.పి. "ఎస్ సర్" అన్నాడు.

"ఇవన్నీ ప్రివెంటివ్ మెజర్స్, ఇక పోతే అటాక్—

సాయంకాలంలోగా నాలుగు పవర్ ఫుల్ రొటేటింగ్ ఫ్లడ్ లైట్స్ తెప్పిస్తాను. అవి పట్టణం నాలుగు చివర్లా ఎత్తయిన ప్రదేశాలలో అమర్చండి. చీకటిపడినప్పటి నుండి తిరిగి సూర్యోదయం వరకూ అవి పనిచేయాలి. వాటి వెలుగులో ఫర్లాంగు ఎత్తు వరకూ ఆకాశంలో తిరిగే ప్రతి జీవీ స్పష్టంగా కనిపిస్తుంది.

ఫ్లడ్ లైట్ కాంతిలోకి పక్షి వస్తూనే, వాన్ లపై నున్న సెర్చ్ లైట్లు వెలగాలి. పక్షి రైఫిల్ రేంజిలోకి వస్తూనే ఆ వీధిలో వున్న పోలీసులంతా ఒకేసారి రైఫిల్స్ ఫైర్ చేయాలి. అందరూ పక్షి కడుపుకు గురి చెయ్యండి. రైఫిల్ షాట్స్ వినిపించగానే చుట్టుప్రక్కల వీధుల్లో వున్న పోలీసులు ఆ వీధిని కవర్ చెయ్యాలి. వాన్ లో వున్న వైర్ లెస్ సెట్ ద్వారా ఆ, ఆ వీధుల్లో ఎప్పటికప్పుడు జరిగే విషయాలను—పోలీస్ కంట్రోల్ రూమ్ కు తెలియజేయాలి. నేను రాత్రంతా కంట్రోల్ రూమ్ లోనే వుంటాను" డి.ఐ.జి. వివరించాడు.

"ఎస్ సర్. ఆ ఏర్పాట్లన్నీ వెంటనే చూస్తాను. ఈ ఏర్పాట్లన్నీ పూర్తయితే పట్టణం ఒక కోటలా తయారవుతుంది. పక్షి పట్టణంపైన దాడిచేసి ప్రాణాలతో పోలేదు" అన్నాడు డి.ఎస్.పి. ఉత్సాహంగా.

## 10

మధ్యాహ్నం పన్నెండు గంటలనుంచి ఐదు పోలీసు వాన్ లు పట్టణంలో ప్రతి చిన్న సందూ తిరుగుతూ డి.ఐ.జి. ఆదేశాలను మైక్ లో అనౌన్స్ చేస్తున్నారు. సాయంకాలం ఐదుగంటలకల్లా జిల్లా హెడ్ క్వార్టర్స్ నుండి ఐదువందలమంది పోలీసులు, కావలసిన వాన్ లు వచ్చాయి. ఆరుగంటలకల్లా పట్టణం నలుమూలలా ఫ్లడ్

లైట్లు అమర్చడం జరిగింది. ప్రతి ఫ్లడ్ లైట్ పోస్టులోను పదిమంది పోలీసులున్నారు. ఫ్లడ్ లైట్ కాంతిలో పక్షి కనిపించగానే సైరన్ ప్రమోగించే ఏర్పాట్లు చేశారు.

రాత్రి ఏడుగంటలు కాగానే వీధులన్నీ నిర్మానుష్యమై పోయాయి. పోలీసులు—వారి వెహికల్స్ తప్ప రోడ్లన్నీ ఖాళీగా వున్నాయి.

చీకటిపడగానే డి.ఐ.జి. కారులో ఒకసారి పట్టణమంతా తిరిగి అన్ని ఏర్పాట్లు స్వయంగా గమనించాడు. స్టూడెంట్స్‌కు క్యూరియాసిటి ఎక్కువ కాబట్టి—వారు బయటకు రాకుండా సాయంకాలం కాగానే ప్రతి స్టూడెంట్ హాస్టల్‌ను బయటినుంచి లాక్ చేయించి ఇద్దరు పోలీసులను కాపలా పెట్టాడు. ఊర్లో వున్న గుళ్ళు, పార్కులు, సత్రాలు తిరిగి బిక్షగాళ్ళు, సన్యాసులూ యెవరైనా యింకా బయటున్నారేమోనని చూసాడు. అన్ని ఏర్పాట్లు సంతృప్తికరంగా కనిపించాయి—

"ఓ. కే. ఇక మేము కంట్రోల్ రూమ్‌కు వెళ్ళిపోతాము. మీరు ఇక ఈ ఏర్పట్లన్నీ పర్యవేక్షించండి. ఉదయాం రెండు గంటలకు సర్కిల్ యిన్‌స్పెక్టర్ డ్యూటీకి వస్తాడు. అతనికి ఈ బాధ్యత అప్పజెప్పి మీరు ఇంటికి వెళ్ళిపోండి." తన కారులో వున్న డి.ఎస్.పి.కి చెప్పాడు.

"ఎస్ సార్" అని డి.ఎస్.పి. కారు దిగి వెనుక వస్తున్న తన జీప్ ఎక్కాడు. ఎస్.పి.తో పాటు డి.ఐ.జి. పోలీస్ కంట్రోల్ రూమ్‌కు వెళ్ళిపోయాడు.

ఫ్లడ్ లైట్ల కాంతిలో పట్టణముపైన ఆకాశమంతా—పట్టపగుల్లా వుంది. డి. ఎస్. పి. నిర్విరామంగా పట్టణ

మంతా తిరుగుతూ పోలీసులను హెచ్చరిస్తున్నాడు. అతను అన్నట్లు పట్టణమంతా కోటలా తయారయింది.

# 11

అలవాటు ప్రకారం చీకటి పడగానే రాక్షసి పక్షి పట్టణంవైపు బయలుదేరింది.

పట్టణంపైనా—చాలా ఎత్తువరకూ ఆవరించి వున్న కాంతిని చూడగానే అది అనుమానంతో ఇంకా ఎత్తుకు ఎగిరింది. ఫ్లడ్ లైట్ల కాంతికి అందనంత ఎత్తులో ఎగురుతూ అది పట్టణంపైకి వచ్చింది.

పట్టపగల్లా కనిపిస్తున్న పట్టణాన్ని చూసేసరికి దానికంతా అయోమయంగా వుంది. రాత్రిపూట ఎక్కువ కాంతిని చూస్తే భయపడే ఆ పక్షి—ఫ్లడ్ లైట్ల కాంతిలో ప్రయాణించడానికి జంకింది. ఆ వెలుగులో దానికి గుంపులు గుంపులుగా వున్న పోలీసులు కనిపిస్తున్నారు. కాని అది వారి జోలికి పోక చీకటి ప్రదేశాల్లో ఆహారం కోసం వెదికింది. ఫ్లడ్ లైట్ల కాంతిలో లేని ఇళ్ళు కొన్నున్నా-అటువంటి చోట జనసంచారం కనిపించలేదు.

అది పట్టణంచి బీచ్ కి బయలుదేరింది. అక్కడ కూడా దానికి ఆహారం కనిపించలేదు. తిరిగి పట్టణంపైన ఓపిగ్గా తిరగసాగింది. చాలా ఎత్తులో తిరుగుతున్న రాక్షసి పక్షి ఎవరికీ కనిపించలేదు.

ఎన్నో గంటలు గడిచాయి. కాని దానికి ఆహారం దొరికే అవకాశం కనిపించలేదు. అయినా ఓపిగ్గా ఆకాశంలో తిరుగుతోంది.

ఇంతలో కరెంట్ సప్లై ఆగిపోయింది. పట్టణమంతా చీకటిమయమైంది. పక్షికి ముందు ఏమీ కనిపించలేదు. అరనిమిషం గడిచేసరికి దాని కళ్ళు చీకటికి అలవాటు

పడ్డాయి. చీకటిలో అయోమయంగా అటూ ఇటూ తిరుగుతున్న పోలీసులు దానికి కనిపించారు. దానికి ఎదురుచూసిన అవకాశం వచ్చింది.

పట్టణానికి ఒక చివరనున్న ఫ్లడ్ లైట్ పోస్టువైపు డైవ్ చేసింది. వాన్ వైపు వెళుతున్న ఒక కానిస్టేబుల్ దాని కళ్ళలోపడ్డాడు.

అంతే—రివ్వున వచ్చి కానిస్టేబుల్‌ను కాళ్ళతో పట్టుకొని అదే వేగంతో గాలిలోకి లేచింది.

తుఫాను హోరులా వినిపించిన దాని రెక్కల చప్పుడుకు—ఫ్లడ్ లైట్ పోస్టులోని పోలీసులంతా ఆ వైపు చూసారు. కానిస్టేబుల్ అరుపు వినిపించగానే వాన్ పైనున్న సెర్చ్‌లైట్ వెలిగింది. ఆ కాంతిలో పక్షి దాంతోపాటు గింజుకుంటూ పైకిలేస్తున్న కానిస్టేబుల్ కనిపించారు.

సబ్ ఇన్‌స్పెక్టర్ రైఫిల్ గురిపెడుతూ "ఫైర్" అని అరిచాడు. ఆ అరుపుకు తేరుకున్న కానిస్టేబుల్స్ వాన్‌కి పైనుండి ఎగిరిపోతున్న రాక్షసి పక్షిని కాల్చారు.

ఐదు గుండ్లు రాక్షసి పక్షి కడుపుకు తగిలాయి. మిగిలిన గుండ్లు దానిరెక్కలకు తలకు తగిలి క్రిందపడ్డాయి. ఒక గుండు—పక్షి కాళ్ళ మధ్య ఇరుక్కున్న కానిస్టేబుల్ భుజంలో దిగింది. అతడు బాధతో అరిచాడు.

సెర్చ్‌లైట్ కాంతిలో — పక్షి ఏమాత్రం వేగం తగ్గించకుండా—అలాగే ఎగిరిపోయింది. రెండవసారి దాన్ని కాల్చేంతలోగానే అది చీకట్లో కలిసిపోయింది.

వెంటనే ఎస్.ఐ — వాన్‌లో వున్న వైర్‌లెస్ సెట్‌తో కంట్రోల్ రూమ్‌ను కాంటాక్టు చేసి—డి.ఐ.జి.కి జరిగింది చెప్పాడు,

ఇది జరిగిన రెండు నిమిషాల్లో కరెంట్ సప్లై వచ్చింది.

## 12

ఉదయం పదిగంటలు.

రెండు చేతులమధ్య తల పెట్టుకొని కంట్రోల్ రూమ్‌లో కూర్చున్నాడు డి.ఐ.జి. కళ్ళుమూసుకొని ఆలోచిస్తున్నాడు.

ఇన్ని కట్టుదిట్టమయిన ఏర్పాట్లుచేసినా—పక్షి తిరిగి దాడిచేసింది. పోలీస్ కానిస్టేబుల్ మరణానికి తనదే బాధ్యత. తను ఇన్ని ఆలోచించి ఎలక్ట్రిసిటీ ఫెయిల్యూర్ పాజిబిలిటీ గురించి ఆలోచించలేదు.

పక్షి చాలా జాగ్రత్తకలదిగా కనిపిస్తుంది. ఎలక్ట్రిసిటీ వున్నంతసేపు—దాని జాడ కనిపించలేదు. పవర్ కట్ అయిన ఐదు నిమిషాల్లో అది అవకాశం ఉపయోగించుకుంది. దాని కాళ్ళపులో అన్ని రైఫిల్ గుళ్ళు తగిలినా అది చలించలేదంటే—ఇక రైఫిల్స్ వాడి ప్రయోజనం లేదు. దానిని తుపాకి గుళ్ళు ఏమీ చేయలేవని తెలిసింది.

దాని కళ్ళను కాల్చవచ్చుకాని, అదిచేసే ఆకస్మిక దాడుల్లో దాని కళ్ళను గురిపెట్టే వ్యవధివుండదు. ఏదైనా కొత్త పథకం ఆలోచించాలి. రెండు హెలికాప్టర్లు ఈ రోజు సాయంకాలం వస్తాయని మెసేజ్ వచ్చింది.

ఐ.జి. నుండి ఫోన్ కాల్ వచ్చింది—హోమ్ మినిష్టర్ తనను పిలిపించి ఈ పక్షిని చంపడంలో విఫలమయినందుకు సంజాయిషీ అడిగారని, ఇంకోసారి అది దాడి చేస్తే అసెంబ్లీలో ప్రతి పక్షాలు గొడవ చెయ్యొచ్చని హోమ్ మినిష్టరు ఆందోళన పడ్డాడని—ఐ.జి. చెప్పాడు. అప్పుడిక ప్రజల భద్రతా ఏర్పాట్లు ఆర్మీకి అప్పచెప్ప

వలసి వస్తుందని—ఐ.జి. ఆందోళన వ్యక్తం చేసాడు.

ఈ పరిస్థితుల్లో — ఆర్మీకి ఈ మిషన్ అప్పగిస్తే పోలీసుల అసమర్థత వెల్లడవుతుంది. డి.ఐ.జి. రాక్షసి పక్షిని చంపేందుకు కొత్త పథకం గురించి ఆలోచించసాగాడు.

అతనిముందు కూర్చునున్న డి.ఎస్.పి. అతనిని పలకరించే సాహసం చేయలేకపోయాడు. డి.ఐ.జి. ముందు రోజు రాత్రినుంచీ కంట్రోల్ రూమ్‌లోనే వున్నాడు. అతనితోపాటు డి.ఎస్.పి.కి కూడా నిద్రలేదు.

డి.ఐ.జి. తల ఎత్తాడు. అతని కళ్ళు నిద్రలేమితో ఎర్రగా మండుతున్నాయి. ఫోన్ తీసి ఐ.జి.పి.కి అర్జంట్ కాల్ బుక్ చేశాడు.

ఐదు నిమిషాల్లో లైన్ కనెక్ట్ అయింది. ఆ రోజు సాయంకాలం—ఇక్కడకు రాబోయే హెలికాప్టర్స్‌లో ఏమేమి సరంజామా పంపవలసింది ఐ.జి.పి.కి చెప్పాడు. ఈ రోజు ఎలాగయినా రాక్షసి పక్షిని అంతం చేస్తానని అతనికి హామీ ఇచ్చాడు. ఫోన్ డిస్‌కనెక్ట్ చేసి డి.ఎస్.పి. వైపు తిరిగాడు.

"నేను చెప్పేది జాగ్రత్తగా వినండి—నిన్నటిలాగే ఈ రోజు కూడా ప్రజలు రాత్రి బయట తిరగకుండా ఏర్పాట్లు చేయండి. కానీ పోలీసులెవ్వరూ వీధిలో పారా తిరగకూడదు. ప్రతి వీధిలో వున్న వాన్‌లో నలుగురు పోలీసులు మాత్రం వుండాలి. వారు ఎట్టి పరిస్థితుల్లో కూడా వాన్ నుండి బయటకు రాకూడదు."

"ఈ రాత్రి ఫ్లడ్ లైట్లు వెలిగించకండి — పట్టణం మామూలుగా వున్నట్లు పక్షికి కనపడాలి. ప్రతి వీధిలో గుంజలు పాతి రెండు గొర్రెలను కట్టే ఏర్పాట్లు చేయండి.

అది ఆకాశంనుంచి పక్షికి స్పష్టంగా కనిపించాలి. ఈ రాత్రి వైర్ లెస్ లైన్ క్లియర్ గా వుండాలి. అవసరమైతే తప్ప ఎవరూ కంట్రోల్ రూమ్‌ను కాంటాక్టు చేయరాదు.

"పక్షి ఏ వీధిలో అయితే గొర్రెలమీద దాడిచేస్తుందో ఆ వీధిలో వాన్ లో వున్న పోలీసులు తక్షణం కంట్రోల్ రూమ్‌ను కాంటాక్టు చేయాలి. ఇవన్నీ జరిపించటం మీ బాధ్యత. మిగిలిన విషయాలు నేను చూసుకుంటాను. సరిగ్గా సాయంకాలం ఆరుగంటలకు ఫ్లడ్ లైట్ పోస్టు ఇంచార్జులుగా వున్న నలుగురు ఎస్.ఐ.లకు—నన్ను కలవమని చెప్పండి. ఈ ఏర్పాట్లన్నీ చూసి మీరు సాయంకాలంవరకూ విశ్రాంతి తీసుకోండి" డి.ఐ.జి. లేచి నిలుచున్నాడు.

"ఎస్ సర్" అంటూ సెల్యూట్ చేసి, హడావుడిగా తన ఆఫీసుకు బయలుదేరాడు. డి.ఎస్.పి. ఈ ఏర్పాట్లన్నీ పూర్తయ్యేసరికి ఎలాగూ సాయంకాలం అవుతుంది, ఇంకెక్కడి విశ్రాంతి అనుకున్నాడు.

# 13

సాయంకాలం అయిదుగంటలకల్లా రెండు—స్పెషల్ ఎయిర్ ఫోర్స్ హెలికాప్టర్లు పట్టణంలోని పోలీస్ పెరేడ్ గ్రౌండ్ లో దిగాయి.

సరిగ్గా ఆరుగంటలకు కంట్రోల్ రూంలో సమావేశం ఏర్పరిచాడు డి.ఐ.జి. ఆ గదిలో నలుగురు హెలికాప్టర్ పైలట్ లు, ఫ్లడ్ లైట్ పోస్టు ఇంచార్జులుగా వున్న నలుగురు ఎస్.ఐ.లు, డి.ఎస్.పి, డి.ఐ.జి— మొత్తం పదిమంది వున్నారు.

"రాక్షసి పక్షి ఈ రోజు కూడా తప్పక వస్తుంది, అది ఆకాశంలో చాలా ఎత్తులో ఎగురుతుంది కాబట్టి.

అది ఆహారంకోసం క్రిందకు వచ్చినప్పుడు తప్ప—దాని జాడ మనకు తెలియదు. ఫ్లడ్ లైట్లకాంతి వున్నంతవరకూ పక్షి క్రిందకు రాదు. కనుక సైరన్ మ్రోగేవరకూ ఫ్లడ్ లైట్స్ వెలిగించవద్దు.

పక్షికి మనుష్యులెవ్వరూ కనిపించరు కనుక అది వీధుల్లో కట్టబడిన గొర్రెలకోసం తప్పక క్రిందకువస్తుంది. అది ఏ వీధిలో అయితే గొర్రెలపైన దాడిచేస్తుందో ఆ వీధిలోని వాన్ నుండి నాకు వెంటనే మెసేజ్ వస్తుంది. వెంటనే కంట్రోల్ రూంపైనున్న సైరన్ మ్రోగుతుంది.

సైరన్ వినిపించగానే పట్టణంలో నాలుగుమూలల్లో వున్న ఫ్లడ్ లైట్లు వెలగాలి. ఫ్లడ్ లైట్లకున్న ఆటోమాటిక్ రొటేటింగ్ సిస్టమ్ ఆఫ్ చెయ్యండి. పక్షి ఏదైన ఫ్లడ్ లైట్ కాంతిలో చిక్కుకుంటుంది. వెంటనే మిగిలిన ఫ్లడ్ లైట్ల కాంతి కూడా దానిపైన పడాలి. పక్షి కదలికను బట్టి లైట్లు కూడా మూవ్ చెయ్యండి. పక్షి ఆకాశంలో ఫర్లాంగ్ ఎత్తు వెళ్ళేవరకూ — ఈ లైట్ల వెలుగులో స్పష్టంగా కనిపిస్తుంది."

హెలికాప్టర్ పైలట్టువైపు తిరిగి అడిగాడు డి.ఐ.జి. "నేను చెప్పినట్లుగా హెలికాప్టర్స్‌కు గన్స్ అరేంజ్ చేశారా?"

"ఎస్ సర్. ఒక హెలికాప్టర్ ముందు భాగంలో యాభై రౌండ్లు కాల్చగల ఐదు పవర్‌ఫుల్ యాంటీ ఎయిర్‌క్రాఫ్ట్ గన్స్ ఫిక్స్ చేశాము. కో-పైలట్ దగ్గరున్న బటన్ నొక్కగానే ఐదు గన్స్ ఒకేసారి పేలుతాయి. ఈ గన్స్ రేంజ్ ఫర్లాంగ్ దూరం వరకు వుంటుంది. విమానాల విధ్వంసానికి ఉపయోగించే ఈ గన్స్‌ముందు

ఆ పక్షి నిలువలేదు.

రెండవ హెలికాప్టర్‌లో 'స్కై ఇల్యుమినేషన్ ఎక్విప్‌మెంట్' ఫిక్స్ చేశాము. బటన్ నొక్కగానే హెలికాప్టర్ నాలుగు వైపులా వున్న ఫ్లేర్ గన్స్ ఒకేసారి ఫైర్ అవుతాయి. మైలు వ్యాసంలో ఆకాశమంతా కాంతితో నిండుతుంది. ఈ కాంతి మూడు నిమిషాలవరకూ వుంటుంది. ఈ కాంతిలో ఆకాశంలో ప్రతి పక్షీ స్పష్టంగా కనిపిస్తుంది" ఒక పైలట్ వివరించాడు.

"దట్స్ గుడ్" అని డి.ఐ.జి. తిరిగి చెప్పసాగాడు. "సైరన్ మ్రోగిన వెంటనే — రెండు హెలికాప్టర్లు పైకి లేవాలి. ఫ్లడ్‌లైట్ల కాంతిలో పక్షి మీకు కనిపిస్తుంది. ఆ కాంతి నుంచి ఆ పక్షి తప్పించుకునేలోగా దాన్ని మీరు అటాక్ చేయగలిగితే మంచిది. ఒకవేళ పక్షి ఆ వెలుగును దాటితే—రెండవ హెలికాప్టర్‌లో వున్న ఫ్లేర్ గన్స్‌తో ఆకాశాన్ని కాంతివంతం చేయండి. ఆ కాంతిలో మొదటి హెలికాప్టర్ పక్షిపైన దాడి చేయాలి. పక్షి చనిపోయేవరకూ ఆకాశంలో వెలుగు తగ్గకుండా ఫ్లేర్ గన్స్ ఉపయోగించండి.

ఏమాత్రం దానికి చీకటి కనిపించినా పక్షి ఆ వైపుకు పారిపోయేందుకు ప్రయత్నిస్తుంది. ఒకసారి అది చీకట్లో కలిసిపోయిందంటే—ఇక దాని జాడ తెలుసుకోవడం కష్టం. ఈసారి అది తప్పించుకుంటే, తిరిగి ఈ పట్టణానికి రాకపోవచ్చు. అది దేశంలో విచ్చలవిడిగా తిరిగే ప్రమాదముంది. అప్పుడు దాన్ని చంపడం చాలా కష్టం. సో బీ అలర్టు యంగ్ మెన్. ఐ వాంట్ దట్ బర్డ్ డెడ్ బై టుమారో మార్నింగ్. ఐ విష్ యూ ఆల్

సక్సెస్" లేచి నిలుచున్నాడు డి.ఐ.జి.

డి.ఎస్.పి. తప్ప మిగిలిన వారంతా అతని దగ్గర సెలవు తీసుకుని హడావుడిగా వెళ్ళిపోయారు.

"ఈ ఆపరేషన్‌లో మొదటి స్టెప్ మీమీద ఆధార పడివుంది. నేను చెప్పిన ఏర్పాట్లన్నీ తూచా తప్పకుండా పాటించండి—" డి.యస్.పి.తో అన్నాడు.

"నేను స్వయంగా ఈ ఏర్పాట్లన్నీ చూస్తాను" అని డి.యస్.పి. కూడా వెళ్ళిపోయాడు.

## 14

రాత్రి తొమ్మిది గంటలయినా పక్షి కొండపైనుంచి లేవలేదు. చీకటిపడినప్పటినుండి అది ఎత్తయిన కొండ రాయి పైన కూర్చుని పట్టణంవైపు తదేకంగా చూస్తుంది.

దాని కడుపులో తగిలిన రైఫిల్ గుండ్లు చర్మంలోనే ఇరుక్కుపోయాయి. రక్తం కూడా యెక్కువ పోలేదు. ఆ చిన్న గాయాలను అది అసలు లెక్కపెట్టదు. కాని రైఫిల్ శబ్దానికి అది కాస్త జంకింది.

పట్టణంలో వీధి దీపాలు తప్ప — ఇక యెలాంటి వెలుగూ లేదు. పట్టణం దానికి మామూలుగా కనిపించింది.

దాదాపు పదిగంటల ప్రాంతంలో రాక్షసి పక్షి కొండపైనుంచి లేచింది. చాలా ఎత్తులో యెగురుతూ పట్టణంపైకి వచ్చింది. పట్టణంపైన నిన్నటిలా వెలుగులేక పోవటంతో—కొద్దిగా క్రిందికి వచ్చి పట్టణంచుట్టూ తిరగ సాగింది.

దాని దృష్టిలో వీధుల్లో వున్న గొర్రెలుపడ్డాయి. కాని అవి దాన్ని ఆకర్షించలేదు. మనుషులకోసం దాని కళ్ళు వెతకసాగాయి. దాదాపు రెండు గంటలపాటు ఓపిగ్గా వెతికినా దానికి నరసంచారం కనిపించలేదు. ఇక

ఆకలికి ఆగలేక ఒక వీధిలో వున్న గొర్రెలవైపు డైవ్ చేసింది.

జార్జ్ రోడ్ లో వాన్ లో కూర్చునివున్న నలుగురు పోలీసులు ఉలిక్కిపడ్డారు. వేగంగా గొర్రెలవైపు దూసుకు వస్తున్న రాక్షసి పక్షి రెక్కల చప్పుడు రాత్రి కావటంతో చాలా పెద్దగా వినిపించింది.

నర్వస్ గా—సాయంకాలంనుండి వాన్ లో కూర్చునున్న పోలీసులు ఉత్సాహంగా ఆకాశంవైపు చూడసాగారు. పదిగజాల దూరంలోకి వచ్చిన తరువాత—వారికి పక్షి కనిపించింది. గొర్రెలు గట్టిగా అరవసాగాయి.

వైర్ లెస్ సెట్ ఆన్ చేశాడు ఒక కానిస్టేబుల్. అదే సమయంలో పక్షి గాలిలోనుంచే ఒక గొర్రెను కాళ్ళతో పట్టుకుని అదే వేగంతో పైకి లేచింది. ఆ వేగానికి గుంజకి కట్టిన తాడు తెగిపోయింది.

"కంట్రోల్ రూమ్—కంట్రోల్ రూమ్ కమ్ ఆన్ ది లైన్, జార్జ్ రోడ్డు స్పీకింగ్" గట్టిగా వైర్ లెస్ సెట్ లో అరవసాగాడు కానిస్టేబుల్.

"యస్ కంట్రోల్ రూమ్ హియర్" ఆత్రంగా డి.ఐ.జి. గొంతు వినిపించింది.

"పక్షి ఇప్పుడే ఈ వీధిలో గొర్రెను తన్నుకుపోతుంది. మా వాన్ మీదుగా వస్తుంది, మా వాన్ ను దాటి తూర్పువైపుగా పోతుంది" కానిస్టేబుల్ పక్షిని గమనిస్తూ చెప్పుకుపోతున్నాడు—అతని మాటలు పూర్తికాకముందే సైరన్ మ్రోగింది. అయిదు సెకండ్లలో—నాలుగు పవర్ ఫుల్ ఫ్లడ్ లైట్ల కాంతితో పట్టణంపైన ఆకాశమంతా వెలుతురుతో నిండిపోయింది.

ఆ దే సమయంలో గ్రౌండ్ పైనున్న హెలికాప్టర్లు రెండు గాలిలోకి లేచాయి. ఒక ఫ్లడ్ లైట్ కాంతిలో గొర్రెతోపాటు పోతున్న రాక్షసి పక్షి కనిపించింది. క్షణాల్లో నాలుగు ఫ్లడ్ లైట్ల కాంతి రాక్షసి పక్షి పైన కేంద్రీకృతమయింది.

అకస్మాత్తుగా కనిపించిన ఈ కాంతికి పక్షి భయపడింది. దాని వేగం తగ్గిపోయింది. అది వంకర టింకరగా ఇష్టం వచ్చిన దిక్కుకు పోసాగింది. అది ఏ వైపు వెళ్ళినా ఫ్లడ్ లైట్ల కాంతి దాన్ని వెంటాడుతూనే వుంది.

హెలికాప్టర్లు రెండు—రాక్షసి పక్షి వైపు వేగంగా బయలుదేరాయి. పక్షి అర ఫర్లాంగ్ దూరంలోకి వచ్చాక కో పైలట్ గన్ బటన్ నొక్కాడు. హెలికాప్టర్ ముందున్న ఐదు గన్స్ పెద్ద శబ్దంతో పేలాయి. కాని అప్పటికే పక్షి పైకి లేవటంతో దానికి గుళ్ళు తగలలేదు.

తుపాకుల శబ్దం వినిపించగానే పక్షి గొర్రెను వది లేసింది. వేగం పెంచి ఉత్తరం వైపు వేగంగా దూసుకు పోసాగింది. ఇంకోసారి గన్స్ పేల్చాడు కో—పైలట్. అవి కూడా దానికి అరగజంలో తప్పిపోయాయి.

ఇక అరనిమిషంలో రాక్షసి పక్షి ఫ్లడ్ లైట్ల కాంతిని దాటుతుందనగా మొదటి హెలికాప్టరులోని పైలట్ వైర్ లెస్ ఆన్ చేశాడు. రెండవ హెలికాప్టర్ పైలట్ లైన్ లోకొచ్చాడు.

"ఇల్యుమినేట్ ద స్కై ఇమ్మీడియట్లీ" మెసేజ్ పంపాడు.

రెండవ హెలికాప్టరుకు నలువైపులా వున్న ఫ్లేర్ గన్స్ నాలుగూ పెద్ద శబ్దంతో పేలాయి. అంతే—

ఆకాశమంతా మెగ్నీషియం కాంతితో నిండిపోయింది. పైలట్లు హెల్మెట్లుతీసి డార్క్ గ్లాసెస్ పెట్టుకున్నారు.

ఫ్లడ్ లైట్ల కాంతిని తప్పించుకున్న రాక్షసి పక్షి, ఫ్లేర్ గన్స్ కాంతిలో ఇరుక్కుపోయింది. మెగ్నీషియం కాంతిలో దాని కాళ్ళకు ఏమీ కన్పించలేదు. ఎటు పోవాలో తెలియక అది అక్కడక్కడే తిరుగసాగింది.

వేగంగా పక్షిని సమీపిస్తున్న హెలికాప్టర్ నుంచి—పక్షి యాభై గజాల దూరానికి రాగానే—మళ్ళీ విదు గుళ్ళు దూసుకొచ్చాయ్. ఈసారి రెండుగుళ్ళు పక్షికి తగిలాయి. ఒకటి ముడుచుకున్న ఎడమకాలికి తగిలింది, ఇంకొకటి దాని కడుపు భాగంలో చర్మాన్ని చీల్చుకుని లోపలికి వెళ్ళింది.

భయంకరంగా అరిచింది రాక్షసి పక్షి. దాని కడుపు నుండి రక్తం ధారలా కారడం—ఆ కాంతిలో పైలట్లకు స్పష్టంగా కనిపించింది. పక్షి వున్నట్టుండి రెక్కలు ఆడించడం మానేసింది. చాలా వేగంగా భూమివైపు జారిపోసాగింది.

అనుకోని ఈ పరిణామానికి—ముందు పైలట్లు కలవర పడ్డారు. కొద్ది సేపటికి హెలికాప్టరు కూడా పక్షి వెంట డైవ్ చేశాయి. అప్పటికే పక్షి చాలా దూరం పోయాయి. హెలికాప్టరు దూరం రాగానే—అది తిరిగి పైకిలేచి వేగంగా కొండవైపు పోసాగింది.

మెగ్నీషియం కాంతి డిమ్‌గా అయిపోయింది. ఇంకోసారి ఫ్లేర్ గన్స్ పేల్చాడు పైలట్. తిరిగి ఆకాశం ప్రకాశవంతమయింది.

కొండవైపు పోతున్న పక్షిని వేగంగా వెంబడించింది గన్స్ వున్న హెలికాప్టర్. దానికి కొద్దిగా పైన ముఫై

గజాల దూరంలో రెండవ హెలికాప్టర్ వస్తుంది. రాక్షసి పక్షి దెబ్బతినటంతో—హెలికాప్టరంత వేగంగా ప్రయాణించలేకపోతుంది. పక్షి ఫైరింగ్ రేంజిలోకి వచ్చినా పైలట్ గన్స్ పేల్చలేదు. వేగం పెంచి ఇంకా దగ్గరకాపోగాడు.

పక్షి యాభై గజాల దూరంలోకి వచ్చాక, కో— పైలట్-మూడు సెకండ్ల వ్యవధిలో మూడుసార్లు బటన్ నొక్కాడు. పదిహేను ఆంటీ ఎయిర్ క్రాఫ్ట్ బుల్లెట్లు రాక్షసి పక్షివైపు దూసుకుపోయాయి. వాటిలో ఏ రెండు గుళ్ళు తగిలినా ఒక పెద్ద విమానం కూలిపోతుంది.

పది బుల్లెట్లు పక్షికి తగిలాయి. కీచుమంటూ బాధతో భయంతో గట్టిగా అరిచింది రాక్షసి పక్షి. దాని ఎడమ కాలు తొడవరకూ తెగి చర్మంతో వ్రేలాడుతుంది. కుడి రెక్క చివరిభాగం విరిగి వంగిపోయింది. నాలుగు గుండ్లు దాని కడుపులో దిగబడ్డాయి. రక్తం షాంపెన్‌లా చిమ్మింది.

అంత బాధలోనూ అది కోపంతో—భయంకరంగా అరిచింది. చివరిసారిగా వెనక్కు తిరిగి, ధైర్యంగా హెలికాప్టర్ వైపు—డైరెక్టుగా వచ్చింది.

అది అలాగే ముందుకువస్తే హెలికాప్టర్ ప్రొపెల్లర్ మధ్య ఇరుక్కుంటుంది. ప్రొపెల్లర్ బ్లేడ్‌లు వంగిపోతాయి-హెలికాప్టర్ కంట్రోల్ తప్పి కూలిపోతుంది.

హెలికాప్టర్ డైరెక్షన్ మార్చే సమయంలేదు. పైలట్ భయపడకుండా హెలికాప్టర్ వేగం తగ్గించి, పక్షిని పది గజాల దూరంవరకూ రానిచ్చి గన్ బటన్ నొక్కాడు. ఐదు బుల్లెట్లు యెదురుగా వస్తున్న పక్షి కడుపులో దూసుకుపోయాయి. ఆ షాక్‌కు దాని వేగం

తగ్గింది. వరుసగా ఐదుసార్లు బటన్ నొక్కాడు పైలట్.

ఇరవై ఐదు బుల్లెట్లు అంత దగ్గరనుండి తగిలేసరికి పక్షి శరీరం చిన్నాభిన్నమై పోయింది. దాని కడుపు, తల పూర్తిగా పగిలిపోయి పేగులు, తలదారాల్లా వ్రేలాడ బడ్డాయి.

గాలిలోనే ప్రాణం విడిచింది రాక్షసి పక్షి. ఆకాశంలో గుండ్రంగా బంతిలా తిరుగుతూ వచ్చి, దాని శరీరం కొండకూ బీచ్ కి మధ్య పడింది.

హెలికాప్టర్లు రెండు పట్టణంవైపు తిరిగాయి.

ఆకాశంలో జరిగిందంతా—కంట్రోల్ రూమ్ పైనుండి బైనాక్యులర్స్‌తో చూస్తున్న డి.ఐ.జి.కి స్పష్టంగా కనిపించింది. భారంగా నిట్టూర్పువిడిచి క్రిందకు దిగి వచ్చాడు. కలెక్టరుకు, ఐ.జి.పి.కి కాల్స్ బుక్ చేశాడు ఈ వార్త చెప్పడానికి. అతని మనసిప్పుడు ప్రశాంతంగా వుంది.

• • •

వేల సంవత్సరాల క్రితమే అంతరించి పోయాయనుకున్న ఈ రాక్షసి పక్షుల సంతతిలో చివరగా మిగిలిన ఈ రెండు పక్షులు-మానవుడు వాటి జోలికి వెళ్ళకుంటే భయంకరమైన కాంగో అడవుల్లో ప్రశాంతంగా జీవిస్తుండేవి. మనుషుల రాక్షసత్వానికి బలై ఒక పక్షి చనిపోయింది. రెండో పక్షి, దానిరాక్షసత్వాన్నుండి మనుష్యులను రక్షించేందుకు—చంపబడింది.

వీటి సంతతి నిజంగా అంతరించి పోయిందోలేదో కచ్చితంగా తెలియదు. ఎందుకంటే ఈ రెండు రాక్షసి పక్షుల పిల్లలు—బహుశా కాంగో అడవుల్లో ఎక్కడైనా పెరుగుతుండవచ్చు.

—:ఐ పో యిం ది:—

# సంఘటనలు కదిపే పాత్రలు

## ఎమ్.వి.వి. సత్యనారాయణ

ఈమధ్య మా గురువుగారికి కేసులు లేవు. అందువలన ఆయన మాట ఎలా వున్నా నాకు బద్ధకంగా వుంది. ఎప్పుడూ పరిశోధనలతో చురుకుగా వుండే నా మస్తిష్కం ప్రస్తుతం మంచంపట్టి వుంది.

ఆవులించి చిటికె వేశాను. మంచం దిగి ముందు గదిలోకి నడిచాను. స్ప్రింగ్ కాట్ మీద డిటెక్టివ్ శిరీష్ ఆదమరచి నిద్రపోతున్నాడు. రాజ నిద్ర! అదృష్టవంతుడు. వేకువరేకలు విచ్చుకుంటే నాకు కళ్ళు తెరచుకుంటాయి.

ఆయన మంచం ప్రక్కనుండి నడిచి వెళ్ళాను. కిటికీ వద్ద నిలబడ్డాను. ఉదయం గాలి ఆహ్లాదంగా శరీరాన్ని తాకుతోంది. నా చూపు క్రిందికి పాకింది. రోడ్డుమీద జనసంచారం ప్రారంభమయింది.

ఎక్కడో కలకలం రేగుతోంది. రోడ్డుకి అటూ ఇటూ చూశాను. రోడ్డుకి తూర్పువైపున నా చూపు నిలబడిపోయింది.

ఎర్రగా బుర్రగా వున్న అమ్మాడు హంసలాగా నడు స్తోంది. ఆమె వెనుక మరో పదుచు స్త్రీ వాళ్ళ వెనుక ఇద్దరు మగవాళ్ళూ, వాళ్ళను అనుసరిస్తూ పర్రకారూ వస్తున్నారు.

హంసలాంటి అమ్మాడు యెవరు? ఆమెను వెంటాడే స్త్రీ ఎవరు? అమ్మాడు కొంపతీసి వ్యభిచారిణా? వ్యభిచార గృహంలోంచి పారిపోయి వస్తోందా?

హంసలాంటి అమ్మాడు రోడ్డుకి అటూ ఇటూ ఇళ్ళ నెంబర్లు చూస్తూ వస్తోంది. ఆమె వెనుక అంతమంది జనం ఏమిటి? ఆమెను వెంబడించే వాళ్ళు క్షణక్షణం పెరుగు తున్నారు.

ఆమెకు యెదురుగా రోడ్డుమీద వచ్చేవాళ్ళు ఆగి ఆమెను తేరిపార చూస్తూన్నారు. ఆమె విరాగిలాగా యెవరినీ చూడటంలేదు. మరో పది గజాల్లో ఆమె నా కిటికీని దాటుతుంది.

ఆమె ముఖాన్ని యెక్కడో చూశాను. యెక్కడ? యెక్కడ? మంచంవైపు తల త్రిపాను. గురువుగారు ఇటు ఒత్తిగిల్లారు. మంచం సమీపించి ఆయనను సున్నితంగా కదిపాను. డిటెక్టివ్ కళ్ళు విప్పి లేచి కూర్చున్నాడు.

"సార్! క్రింద ఎవరో అమ్మాయి వెళ్తోంది. ఆమెను చాలామంది వెంబడిస్తున్నారు. నా అనుమానం...."

నా మాట పూర్తిగాక ముందే డిటెక్టివ్ శరీష్ కిటికీ దగ్గరకు చేరుకున్నాడు. క్రిందకు వంగి చూశాడు. నా వైపు తలత్రిప్పాడు.

"ఆమెను నువ్వు గుర్తుపట్టలేదా?" అనడిగాడు నన్ను.

నేను మరల ఆమెను చూశాను కాని నా మస్తి

మ్రానులో బల్బు వెలగలేదు.

డిటెక్టివ్ శిరీష్ మెల్లగా నవ్వి, "నువు తెలుగు సినిమాలు విపరీతంగా చూస్తావు. కానీ నీ అభిమాన నటిని గుర్తించలేవు" అన్నాడు.

నా కిటికీకి తిన్నగా ఆమె ఆగింది. ఒయ్యారి హంస!

"ఆమె జయశీల" పకపక నవ్వాడు శిరీష్.

నాకు గొప్ప అవమానమయింది. జయశీల ప్రముఖ చలనచిత్ర నటి! ఆమె కంటి విరుపుకి యెందరో ప్రేక్షక వీరులు పిచ్చివాళ్లయారు. జయశీల చిత్ర పరిశ్రమకు పరిచయమై పదేళ్లవుతోంది. ఇప్పటికే ఆమె నూరు చలనచిత్రాలకు పైగా నటించించింది. నా అభిమాన నటి! ఆమెనే నేను గుర్తించలేకపోయాను.

"ఆమె చిత్రం నేను నాలుగేళ్ల క్రిందట చూశాను. అవునా?" అడిగాడు శిరీష్.

"అవును. 'కాకిగోల' చిత్రం మీకు బాగా నచ్చింది కదా!"

"ఆ చిత్రంలో తప్పించి నేను ఆమెను తెరమీద చూడలేను. అయినా జయశీలను మేకప్ లేకుండా గుర్తించగలిగాను."

నిజమే! నాకు తెలుగు సినిమాల పిచ్చి యెక్కువే! శిరీష్ యెప్పుడో ఒకటో అరో చూస్తుంటాడు.

శిరీష్ తీరికగా మంచంమీద కూర్చున్నాడు. పైపుతీసి వూది శుభ్రంచేశాడు. నెప్ట్యూన్ టుబాకో నింపాడు. అగ్గిపుల్ల గీచి పొగాకును అంటించాడు.

గదిలో నెప్ట్యూన్ పొగాకు సువాసనలు విరజిమ్ముతోంది. డిటెక్టివ్ శిరీష్ గుండెలనిండా పొగాకు పీల్చుకున్నాడు.

"ఈ వీధిలో జయశీలకు ఏం పని?" అడిగాడు శిరీష్.

"అవును ఏం పని? నాకేం తెలుసు? పైగా ఆమె శిరాణా లేనిదానిలాగా కాలినడకన నడచి రావడం ఏమిటి?"

"ఆమెకు కారు డ్రయివింగ్ రాదు. డ్రయివర్ అందుబాటులో లేడు. అందుకే ఆమె నడిచి వచ్చింది!" అన్నాడు శిరీష్.

మై గాడ్ నెస్! నా అభిమాన నటికి కారు డ్రయివింగ్ రాదా? అయినా ఆ విషయం శిరీష్కు యెలా తెలుసు?

"జయశీల మనశ్శాంతి లేక ఇంట్లోంచి బయలుదేరింది."

"ఏం? యెందుకు? నెలకు లక్షరూపాయలు సంపాదించే జయశీలకు మనశ్శాంతి లేకపోవడం ఏమిటి?"

"ఆమె మన ఇంటికే బయలుదేరింది!"

శిరీష్ మాట నామీద బాంబులాగా పనిచేసింది. ఆమె మా వద్దకే వస్తోంగా? ఆమెకు అపరాధ పరిశోధకులతో అవసరం ఏమిటి? నేను చటుక్కున రోడ్డుమీదకు దృష్టిమరల్చాను.

జయశీల అండ్కో మా మేడ క్రింద వాటావద్ద నిలబడివుంది.

"నీ అభిమాన నటికి స్వాగతం చెప్పు మైడియర్!" నా వీపు తట్టాడు శిరీష్.

నేను క్రాఫు సరుకున్నాను. మెట్లవైపు పరుగెత్తాను. అప్పటికే కాలింగ్ బెల్ గణగణలాడింది. నేను మెట్లు దిగి తలుపు తీశాను.

నేలకు దిగివచ్చిన అప్సరసలాగా జయశీల గుమ్మంలో

నిలబడివుంది.

"డిటెక్టివ్ శరీష్‌గారు .... ఉన్నారా?" అడిగింది జయశీల.

మాట్లాడబోయి తలూపగలిగాను. ప్రక్కకు తప్పుకుని మెట్లమీదకు దారి ఇచ్చాను.

జయశీల మెట్లు సమీపించబోయింది.

రోడ్డుమీద కారు ఆగింది. కారు డోర్ మీద 'ప్రకాష్ పిక్చర్స్—అవుట్ డోర్ యూనిట్' అని వుంది.

జయశీల వెనుక వున్న యువతి చప్పున జయశీలను సమీపించింది.

"జయా! ప్రకాష్ పిక్చర్స్ వాళ్ల కారు వచ్చింది" అంది.

"మాలతీ!" జయశీల తన గొంతును తన అదుపులోకి తెచ్చుకోడానికి ప్రయత్నించింది. "ఒక గంటలో నేను అవుట్ డోర్ లొకేషన్‌కి వస్తానని చెప్పు" అంది. అంటూనే మెట్లమీద కాలు పెట్టింది.

జయశీల అభిమాన సంఘం రోడ్డుమీదనే నిలబడిపోయింది.

అవుట్ డోర్ యూనిట్ కారులోంచి ఒక యువకుడు దిగివచ్చాడు. జయశీలను సమీపించాడు.

"అమ్మగారూ! తమకోసం స్టార్స్ వెయిట్ చేస్తున్నారు. భీమారావుగారు కూడా వచ్చేశారు!" అన్నాడు ఆ యువకుడు.

"భీమారావుగారా?" జయశీల పెదిమలు అదిరాయి.

భీమారావు ముప్ఫయ్యేళ్ళుగా చలనచిత్ర రంగంలో మహా నటుడిగా పాతుకుపోయాడు. ఆయన మాట పరిశ్రమకు వేదవాక్కు. ఆయన కోసం మిగిలిన తారలు

వెయిట్ చేయాలి కాని, మిగతా వారి కోసం ఆయన వెయిట్ చేయలేదు. బిజీ ఆరిస్టు.

జయశీల నా వైపు చూసింది. నా చేతిలో విజిటింగ్ కార్డు పెట్టింది.

"ప్లీజ్ ....నాకోసం మీరూ, డిటెక్టివ్ శిరీష్ మా ఇంటికి రండి!" అని బయటకు పరుగెత్తింది.

నా నెత్తిమీద కుండెడు చన్నీళ్ళు క్రుమ్మరించినట్టయింది.

జయశీల కారు యెక్కి కూర్చుంది. మాలతి ఆమె ప్రక్కన చతికిలపడింది.

అభిమాన బృందాన్ని చీల్చుకుంటూ కారు నిర్దయగా పరుగెత్తింది. నేను తలుపు మూసి నిరాశగా మెట్లు యెక్కాను.

డిటెక్టివ్ శిరీష్ కిటికీ దగ్గర నిలబడి పైపు పీల్చుతున్నాడు. ఆయన తలచుట్టూ పొగ మేఘాలు అలముకున్నాయి.

"జయశీల మన ఇంటికి యెందుకు వచ్చిందంటారు?" అడిగాను.

"జయశీలకు కొన్ని వ్యక్తిగత సమస్యలున్నాయి. నువ్వు యీ మధ్య గాసిప్ సినిమా పత్రికలు చూడలేదా?"

"ఆశ్చర్యం! అవంటే మీకు అసహ్యం!"

"చూడలేదు. విన్నాను. పెట్రోలు బంకులో కుర్రాళ్లు చెప్పుకుంటున్నారు. జయశీలకు కారు డ్రయివింగ్ అంటే భయమట! ఆమెకు గౌస్ అనే వాడితో రహస్య వివాహం జరిగిందట. వాళ్ళిద్దరికీ ఒక కొడుకు కూడా పుట్టాడట! కొడుకు ఊటీలో పెరుగుతున్నాడట.

ప్రస్తుతం జయశీల సదరు మొగుడిని వదిలించుకోవాలను కుంటోందట!"

మై గుడ్ నెస్! నా అభిమాన నటి వెనుక ఇంత చరిత్ర వుందా?

"ఆమె మన ఇంటికే వస్తుందని మీకు ఎలా తెలుసు?" అడిగాను.

పైపు తీసి చేతిలో పట్టుకున్నాడు. "మన వీథిలో ఒక్క డాక్టర్ లేదు. ఒక్క సినిమా యాక్టర్ గానీ, డిస్ట్రిబ్యూటర్ గానీ, కనీసం అభిమాన సంఘంకానీ లేదు. జయశీలకు వ్యక్తిగత సమస్యలున్నాయి. వాటిని మన లాంటి పత్తేదారులతో చెప్పుకుంటుంది. జయశీల ప్రవాహ జలంలాంటిది. ఎవరో ఎక్కడో ఆ జలాన్ని తాగుతోనే వుంటారు. గాస్ గానీ, కొత్త ప్రియుడుగానీ ఆమెను ఇబ్బందుల పాలుచేసి ఆనందించాలనుకుంటారు. పోలీసులతో ఇవన్నీ చెప్పుకుని అభాసుపాలు కావాలని ఎవరు అనుకుంటారు? అందుకే జయశీల మన రోడ్లో కనిపించే సరికి ఆమె మన ఇంటికే అని వూహించాను."

ఈ మాత్రం తర్కం గూడా నాకు ఇంకా అలవడ లేదు.

"పుస్తకాల షాపులో నాలుగయిదు రకాల గాసిప్ పత్రికలు—జయశీల గురించి వార్తలున్నవాటిని ఎంచి తీసుకురా!" శరీష్ పదిరూపాయల కాగితం అందించాడు.

## 2

"శీతాకాలం కూడా ఇంత ఎండగా వుంది!" దర్శక నిర్మాత శంకరరాజన్ కెమెరాను సమీపించాడు. వ్యూఫైండర్ లోంచి చూశాడు.

ఎండ మిలమిలలాడుతోంది. భీమారావు ఒక ప్రక్కగా

నిలబడి సిగరెట్ కాల్చుకుంటున్నాడు. జయశీలకు మేకప్ మాన్ టచెస్ ఇస్తోన్నాడు.

శంకరరాజన్ కెమెరాలోంచి తలెత్తి బయటకు చూశాడు.

"షాట్‌కి రెడీ!" అరిచాడు శంకరరాజన్.

అసోసియేట్ డైరెక్టర్ రామారావు హీరో హీరోయిన్‌లవైపు పరుగెత్తాడు.

"సార్!" అన్నాడు రామారావు హీరోను సమీపించి.

"ఏం!" హుందాగా చూశాడు భీమారావు.

"ఇపుడు మీరు హీరోయిన్‌ని పాదివి పట్టుకుంటూరు సార్! నన్ను యుద్ధరంగానికి పంపు. నాకు పతి భిక్ష పెట్టమని నీ ఇష్టదేవతను ప్రార్థించు! అంటూరు" అన్నాడు రామారావు.

హీరో భీమారావు కదలి కెమెరా ముందుకు వచ్చాడు.

హీరోయిన్‌ని డైలాగ్‌తో సిద్ధం చేశాడు. ఎ. డి. రామారావు. షాట్ పూర్తయ్యేసరికి మధ్యాహ్నం మూడయింది.

జయశీల అలసటగా మాలతిని సమీపించింది.

"డ్రయివర్ కారు తీసుకు వచ్చాడా?" అడిగింది జయశీల.

మాలతి తలూపి ఆమెకు గొడుగు పట్టింది. వాళ్ళిద్దరినీ పత్రికా విలేఖరులు చుట్టుముట్టారు.

"మీరు గాసిప్ వివాదాలు ఇస్తారా?" అడిగాడు ఒక విలేఖరి.

జయశీల కోపాన్ని మునిపంట నొక్కిపట్టి, "ఇంకా

ఆలోచించుకోలేదు" అంది.

"మీకు ఊటీలో ఒక అబ్బాయి పుట్టాడని వదంతి. యెంతవరకూ నిజం?" మరో గాసిప్ విలేఖరి ప్రశ్న విసిరాడు.

"వదంతి అని మీరే అన్నారు కదా."

కెమెరాలు తళుక్కుమంటున్నాయి. వాళ్ళను వదిలించుకువచ్చేసరికి మరో అరగంట అయింది.

మాలతి, జయశీలా కారును సమీపించారు.

మాలతి డోర్ తెరవబోయి ఆగింది. వెనక సీటులో ఎవరో పడుకున్నారు.

"ఎవరు వాళ్ళు?" జయశీల కిటికీలో తల పెట్టింది.

"నేనే! నీ గాస్ను!" అతడు పకపక నవ్వాడు.

భయంకర రాక్షసుడిని చూసినట్టు జయశీల గడగడలాడింది.

"నా కారులో పడుకున్నావేం?" అడిగింది జయశీల.

"బయట కనిపిస్తే విలేఖర్లు ప్రశ్నలు వేస్తారు. నేను జవాబులు చెప్పవలసి వస్తుంది."

"నీకు బుద్ధి లేదు."

"నిజమే! నీలాంటి వెలయాలి మొహంలో ఒక మహానటిని చూశాను."

"నిన్ను నమ్మినందుకు నాకు బాగా గొంతుకోశావు."

"పెళ్ళిచేసుకొని నాతో సుఖ సంసారం చేస్తావనుకున్నాను. కాని నీకు పూర్వపు సంబంధాలు వదలలేదు."

"ఎలా వదులుతాయి? నాకు పదిమందితో పదిరకాల పరిచయాలుంటాయి. ఆ విషయం నీకు ఇంతకు ముందు తెలియదా?"

"తెలుసు. కాని మనకు బాబు పుట్టాడు. నీ జీవితం మారుతుందని ఆశించాను."

గౌస్ తలుపు తెరిచాడు.

"వద్దు. నేను ముందు సీట్లో కూర్చుంటాను." జయశీల హారన్ నొక్కింది. కారు డ్రయివర్ పరుగెత్తుకొచ్చాడు. జయశీలా, మాలతీ కూర్చున్నాక కారు స్టార్టుచేశాడు.

## 3

"ఎవరు కావాలి?"

తలెత్తి చూశాను. ముసలావిడ. ఆ ఇంట్లో పనిమనిషి అయివుండాలి.

"జయశీల."

"ఎవరు వచ్చినట్టు చెప్పమన్నారు?" అడిగిందామె.

నేను విజిటింగ్ కార్డు అందించాను. ఆమె లోపలకు వెళ్ళింది. అయిదునిమిషాల్లో తిరిగొచ్చింది.

ఇద్దరమూ లోపలకు నడిచాం.

జయశీల డ్రాయింగ్ రూంలో కూర్చుంది. పూర్తి మేకప్‌లో వుంది. మెరుస్తోన్న దుస్తులలో హుందాగా సోఫాలో వెనక్కి వాలివుంది.

నన్ను చూడగానే ముందుకు వంగి, "రండి మిస్టర్ సారధీ!" అంటూ కుర్చీ చూపించింది.

నేను కూర్చోగానే పనిమనిషి మా ఇద్దరికీ లిమ్కా సర్వ్ చేసింది.

"డిటెక్టివ్ శరీఫ్‌గారు రాలేదా?" అడిగింది జయశీల.

"పనిమీద బయటకు వెళ్ళారు" అన్నాను.

"నిన్న మీ ఇంటికి వచ్చాను. డిటెక్టివ్ శరీఫ్‌ను కలుసుకోవాలనుకున్నాను. షూటింగ్ వాళ్ళ వాహనం రావడంవలన నా ప్రయత్నం ఫలించలేదు."

"ఆ సమయంలో కాల్ షీటు వున్నట్టు మీకు తెలియదా?"

"తెలుసు. భీమారావుగారు అంత త్వరగా షూటింగుకు హాజరవుతారనుకోలేదు."

"శిరీష్‌గారిని ఎందుకు కలుసుకోవాలనుకున్నారు?"

"నాకు గాస్‌తో రహస్య వివాహం జరిగింది. గాస్ నన్ను సినిమాలనుండి తప్పుకోమంటున్నాడు."

తల పంకించాను. గాస్‌తో ఆమెకు రహస్య వివాహం జరిగివుంటే దానివలన వచ్చే సాధకబాధకాలు పూర్తిగా ఆమె వ్యక్తిగతం. డిటెక్టివ్ శిరీష్ ఈ విషయంలో ఆమెకు ఏం సహకరించగలడు?

అదేమాటే ఆమెతో అన్నాను.

"గాస్‌కి కొంతమంది అమ్మాయిలతో అక్రమ సంబంధాలున్నాయి. వాటిని డిటెక్టివ్ శిరీష్ పరిశోధించి ఆధారాలు సేకరించాలి. అప్పుడు విడాకుల వ్యవహారం లోంచి సులువుగా గట్టెక్కుతాను."

"గాస్‌కి విడాకులు యిస్తారా?"

"అవును. కాని ప్రస్తుత పరిస్థితులలో ఇది కష్టం."

"డిటెక్టివ్ శిరీష్ మీ కేసు టేకప్ చేయరు?"

"ఏం?"

"భార్యాభర్తల మధ్య పొరపచ్చాలుంటాయి. కాల క్రమేణా అవి సర్దుబాటు అవుతాయి. వాటిలో తల దూర్చడం శిరీష్‌కి ఇష్టంవుండదు."

"ప్లీజ్! మీరు చెప్పి ఒప్పించండి!"

"ప్రయత్నిస్తాను" నాకు నమ్మకంలేదు.

"నిన్న షూటింగ్ వద్దకు గాస్ వచ్చాడు."

"ఇంతకాలంగా ఆయన ఎక్కడ వున్నారు?"

"ఊటీలో."

"ఊటీలో మీకు అబ్బాయి పుట్టాడట. నిజమేనా?"

"గాసిప్ రాసే పత్రికలను నమ్మకండి."

జయశీల అబద్ధం చెబుతోంది. నాలుగు పత్రికలలో ఒకేరకంగా వచ్చిన వార్తను ఆమె ఖండిస్తోంది.

"గాస్ ఏమన్నారు?"

"సినిమా రంగాన్ని వదులుకోమంటారు. తనకు ఒక్కడికే పూర్తిగా అంకితమై పొమ్మంటారు."

"మీరు మీ పెళ్ళికి ముందు ఆ విషయాలు చర్చించుకోలేదా?"

"అప్పట్లో ఆ ప్రసక్తి రాలేదు."

"గాస్‌గారికి ఆస్తిపాస్తులున్నాయా?"

"ఊటీలో కొండ ప్రాంతంలో కొంత కొండ వ్యవసాయం వుంది."

"ఆదాయం బాగా వస్తుందనుకుంటాను."

"ఫరవాలేదు."

"విడాకుల కోసం గాస్‌ను ఒప్పించలేకపోయారా?"

"పాతిక లక్షల రూపాయలు కావాలట!"

"మీరు ఇవ్వనన్నారా?"

"పాతిక లక్షలంటే నేను ఇంతవరకూ పొదుపుచేసి ఎరగనంత మొత్తం!"

"నటిగా మీకు మంచి డిమాండ్ వుంది."

"ఇంటి అద్దెలూ, నౌకర్లూ, టాక్సులూ, హోదా వెలగబెట్టడమూ మమ్మల్ని తినేస్తాయి."

"గాస్‌గారి ఇతర లవర్స్ ఎక్కడ వున్నారు?"

"ఊటీలో, బెంగుళూర్‌లో."

"అడ్రసులు తెలుసా?"

"తెలియదు. లక్షరూపాయలవరకూ ఫీజు ఇవ్వగలను. ఎలాగైనా నాకు గౌస్ పీడ వదిలించండి."

నేను భుజాలు ఎగరేశాను. ఆమె నా అభిమాన నటి అవుతే అవుగాక! గౌస్‌ను ఆమె నెత్తికెక్కించుకుంది. శరీష్ చేత బరువు దించుకుంటుందట. మూల్యం లక్ష రూపాయలు!

నేను చిరాకును అణచుకుంటూ లేవబోయాను.

మెట్లమీద యెవరో దిగి వస్తున్నారు. డ్రాయింగ్ రూంలోంచి మెట్లు కనిపిస్తోన్నాయి. మెట్లమీద యువకుడొకడు దిగుతున్నాడు.

హిప్పీ క్రాఫు, భారీ విగ్రహం. అతడికి ముప్ఫయ్యేళ్ళుంటాయి. గోధుమరంగు ఉలెన్ పాంటుమీద ఎర్రటి పాలిస్టర్ షర్టు టక్ చేశాడు. కాళ్ళకు అరిస్టోక్రాట్ షూ ధరించాడు.

అతడి చేతిలో త్రిబుల్ ఫైవ్ సిగరెట్ వెలుగుతోంది. అతడు సరాసరి డ్రాయింగ్ రూంలోకి వచ్చాడు.

"నా పేరు గౌస్. ఇంతసేపూ జయశీల నా గురించే మాట్లాడుతూ వుండి వుండవచ్చు" అతడు నా విజిటింగ్ కార్డు నాకు అందించాడు.

పనిమనిషి ద్వారా జయశీలకు పంపించిన కార్డు అది.

గౌస్‌ను పరిశీలనగా చూస్తూండిపోయాను. సినీతార మీది వ్యామోహంతో ఆమెను రహస్య వివాహం చేసుకున్నాడు. ఇపుడు ఆ వివాహాన్ని రద్దు చేసుకోవడానికి పాతిక లక్షలు అడుగుతున్నాడు.

ఇలాంటి వాళ్ళకు మానసిక చికిత్స అవసరం.

గౌస్ నా ప్రక్క కుర్చీలో కూర్చున్నాడు. ఇంటి

మేట్ సెంటు వాసన గుప్పుమంది.

జయశీల కసాయివాడిని చూసినట్టు గడగడలాడు తోంది.

నేను లేచాను. ఇంకా అక్కడే కూర్చుంటే గౌస్ మరికొన్ని పిచ్చి ప్రశ్నలు వేయవచ్చును. జయశీల వద్ద సెలవు పుచ్చుకొని బయటకు నడిచాను.

ఆశ్చర్యం!

గౌస్ నన్ను వెంబడిస్తోన్నాడు.

నా కారు డోర్ తెరిచాను. డ్రయివర్ సీట్లో కూల బడ్డాను.

"బ్రదర్! లిఫ్ట్ ఇస్తారా?" అడిగాడు గౌస్.

నాకు జవాబు దొరకలేదు. అతడు నా మౌనాన్ని అంగీకారంగా తీసుకున్నాడు. డోర్ తెరుచుకొని నా ప్రక్క చతికిలబడ్డాడు.

కారును పోనిచ్చాను.

"రోడ్డు ప్రక్కకు చూడు బ్రదర్!"

స్టీరింగ్ వీల్ జాగ్రత్తగా కంట్రోల్‌లో వుంచుకుని ప్రక్కకు చూశాను. రోడ్డు ప్రక్క ప్లిమత్ కారు ఆగి వుంది. దాని ప్రక్కగా చెట్టియార్ నిలబడి ఎవరితోనో మాట్లాడుతున్నాడు.

"చెట్టియార్. ప్రముఖ చలనచిత్రాల డిస్ట్రిబ్యూటర్!" అన్నాను.

నా కారు ప్లిమత్‌ను దాటింది.

"నా భార్యకు తాజా ప్రియుడు!" నవ్వాడు గౌస్.

నాకు అతడి నవ్వుతో వెన్ను జలదరించింది. ఇది సినిమా లోకమా? మాయా లోకమా?

"మీది కేవలం అనుమానం ఏమో!"

"కాదు, ప్లిమత్ కారులో మాలతి వుంది. చూడ లేదా?"

మాలతి! జయశీల ఆత్మీయురాలు. సెక్రటరీ. నిన్న ఆమెతో తమ ఇంటికి వచ్చింది.

"సినిమా ఒప్పందంలో ఆమె యిటు వచ్చి వుండ వచ్చు."

"కావచ్చు. రాత్రి నేను ఇంట్లో వున్నాను. జయశీల ఆ ముసలాడి ఇంట్లో గడిపింది. ఏమైనా అంటే అవుట్ డోర్ షూటింగూ, పరిశ్రమలో తన 'బిజీ' కళా సై పుణ్యమూ అంటుంది!"

"నాకు మీ మాటలు ఆశ్చర్యం కలిగిస్తున్నాయి!" అన్నాను.

"సహజం! అందుకే ఆమెను పాతికలక్షలు అడిగాను. నాతో గడిపిన మధుర రాత్రులనూ, చివరికి మా వివాహాన్నీ మరచిపోతానని చెప్పాను."

నాకు గౌస్ కోరుకుడు పడటంలేదు. అసలు ఈ విషయాలన్నీ నాకు ఎందుకు చెబుతోన్నట్టు?

గౌస్ నవ్వసాగాడు.

కారు మలుపు తిరిగింది.

"కారు ఆపు బ్రదర్!" అన్నాడు గౌస్. అతడి చెయ్యి నా భుజాన పడింది.

కారు ఆపాను. గౌస్ కారు దిగాడు.

## 4

కారును గారేజిలో వుంచి మేడ మెట్లు ఎక్కాను.

డిటెక్టివ్ శరీష్ కన్సల్టింగ్ రూంలో కూర్చుండి వున్నాడు.

నేను ఆయనతో జయశీల మాటలూ, గౌస్ మాటలూ

మొత్తం చెప్పాను.

"జయశీల చుట్టూ ఏదో కథ నడుస్తోంది" అన్నాడు శరీఫ్ తన చేతిలోని ఫోటోను బల్లమీద పెట్టుతూ.

ఫోటో చూశాను. జయశీల యెవరో ముసలాడి కౌగిట్లో పరవశిస్తోంది. ఆ ముసలాడు యెవరో కాదు— చెట్టియార్.

ఈ ఫోటో శరీఫ్‌కి ఎలా వచ్చింది?

శరీఫ్ నా ఆలోచనను గమనించినట్టు, టేబుల్ సొరుగులోంచి కవర్ తీసి అందించాడు.

కవర్ మీద డిటెక్టివ్ శరీఫ్ ఇంటి చిరునామా వుంది.

"జయశీలను ఎవరో బ్లాక్ మెయిల్ చేస్తోన్నారు!" అన్నాడు శరీఫ్.

"ఎవరు? గౌస్ కాదు కదా?"

"చెప్పలేం!"

నాకు ఆలోచనలతో తల తిరుగుతోంది. జయశీల జీవితంలో ప్రస్తుత సంఘటనలు కదిపే పాత్రలు మూడు. మొదటిది గౌస్. రెండోవాడు చెట్టియార్. మూడోది బ్లాక్ మెయిలర్.

"బ్లాక్ మెయిలర్ చెట్టియార్ కావచ్చునేమో!" అన్నాను.

"అయినా ఆశ్చర్యంలేదు."

"ఈ ఫోటో మనకు పంపి లాభం ఏమిటి?" అడిగాను.

"జయశీల బ్లాక్ మెయిలింగ్‌కి గురవుతోన్నట్టు మనకు తెలియాలి .... జయశీల తెర మరగు జీవితంతో బ్లాక్ మెయిలర్‌కి పరిచయం వుంది. జయశీలతో సన్నిహితంగా తిరిగే వ్యక్తి ఎవరో అయివుండాలి."

"మాలతీ!"

శిరీష్ తలూపాడు. "ప్రస్తుతానికి నువ్వు మాలతిని వెంబడించు. ఆమె చెట్టియార్‌ని కలుసుకున్నట్టు గౌస్ ఇందాకనే చెప్పాడు కదా!"

నాలో ఆలోచనలు పరిపరివిధాలా పోతున్నాయి.

## 5

మాలతి కుర్చీలోంచి ముందుకు వాలింది. ఆమె చేతులు వణుకుతోన్నాయి. అల్లల్లాడే వ్రేళ్ళతో బల్లమీది ఫోటోను అందుకుంది.

ఫోటోలో చెట్టియార్, జయశీల వున్నారు. చెట్టియార్ కౌగిట్లో వుంది జయశీల.

"మాలతీ!" పిలిచాడు చెట్టియార్.

ఫోటోమీదనుండి దృష్టి మరల్చింది మాలతి.

"ఈ ఫోటో తీసే అవకాశం నీకే వుంది!" అన్నాడు చెట్టియార్.

"నాకా? ఏమిటి మీరు అంటున్నది?"

"జయశీలను నువ్వు ఇక్కడ దించి వెళ్తున్నావు. నా వద్ద జయశీల వున్న సమయం నీకే బాగా తెలుసు. నా ఇంట్లో స్వేచ్ఛగా సంచరించే అవకాశమూ నీకే వుంది."

మాలతి అరచేతులలో మొహం దాచుకున్నది.

"ఇది ఎవడో తుంటరిచేసే పని. ఈ పనికి మీరు నన్ను అనుమానిస్తారనుకోలేదు."

"మాలతీ! నువ్వు ఈ ఫోటో తీసినా తీయకపోయినా నాకు ఒరిగేదీ, నష్టమయేదీ ఏం లేదు. నీ యజమానురాలికి ఎక్కువ క్షోభ కలిగించినట్టవుతుంది. అంతే!"

"ఫోటోను నేను ఎందుకు తీస్తాను?"

"మమ్మల్ని యిద్దరినీ బ్లాక్ మెయిల్ చేయడానికి!"

"ప్లీజ్ ....నన్ను నమ్మండి. నాకు ఈ విషయంలో ఏమీ తెలియదు."

చెట్టియార్ తటపటాయించాడు. బల్లమీది టెలిఫోన్ సెట్టును తనవైపు త్రిప్పుకున్నాడు. రిసీవర్ ఎత్తి డయల్ చేశాడు.

అవతల ప్రక్క జయశీల పలికింది.

"మనం ఇద్దరమూ కలిసివున్న అసభ్య చిత్రం ఒకటి నాకు పోస్టులో వచ్చింది."

"అలాగా నాకూ అదే ఫోటో ఒకటి వచ్చింది."

చెట్టియార్ నిర్విణ్ణుడయాడు.

అవతల ఫోన్‌లో జయశీలను "ఎవరు?" అని అడిగారు.

చెట్టియార్ నుదురు చిట్లించాడు. అవతల జయశీల ప్రక్కగా వున్నది ఎవరు?

"జయా! నీతో మాట్లాడేది ఎవరు?"

"అబ్బే! ఎవరూ లేరు."

"అబద్ధం!" అరవాలనుకున్నాడు చెట్టియార్. కాని తమాయించుకున్నాడు. మాలతికి సైగ చేశాడు.

మాలతి సైగను అర్థంచేసుకున్నది. బయటకు పరుగెత్తింది.

"ఫోటో ఎవరు తీశారంటావు?" అడిగాడు చెట్టియార్.

"ఏం చెప్పగలం?"

"మాలతి అని నా అనుమానం!"

"అంత నిశ్చయంగా ఎలా చెప్పగలవు?"

"మనలను చిత్రీకరించి మాలతి ఏం బావుకుంటుంది?" జయశీల తన అంతరంగికురాలిని నిర్దోషిగా సమర్థిస్తోంది.

"జయా! నా అంచనా పొరపాటు కావచ్చును" ఫోన్ పెట్టేశాడు చెట్టియార్.

6

టి. నగర్‌లో మాలతి టాక్సీ దిగింది.

రోడ్డుకి అవతల ప్రక్క జయశీల కనిపిస్తోంది. మాలతి చకచక కిళ్ళీకొట్టు వద్దకు నడిచింది. ఆంగ్ల దినపత్రిక కొన్నది. చదువుతోన్నట్టుగా పేజీలు విప్పి జయశీల యింటిని పరీక్షగా చూస్తోంది మాలతి. ఆ ఇంటి గేటు లోంచి కారు దూసుకువస్తోంది.

పాత మోడల్ అంబాసిడర్ కారు.

మాలతి చటుక్కున ముందుకు కదలబోయింది.

ఆమె ప్రయాణం చేసివచ్చిన టాక్సీ డ్రయివర్ ఆమె వైపు వచ్చాడు.

"నువ్వే జయశీలనూ, చెట్టియార్‌నూ బ్లాక్ మెయిల్ చేస్తున్నావు." అన్నాను టాక్సీ డ్రయివర్‌గా నటించిన నేను.

"డిటెక్టివ్ అసిస్టెంట్ సారథీ!" ఆమె కళ్ళు తెరచుకున్నాయి.

"అవును."

"ప్లీజ్ నన్ను ఆ కారు వెంబడి తీసుకు వెళ్ళండి."

"మాలతీ! నువు ఎందుకు నాటకమాడుతున్నావు?"

"కాదు. అంబాసిడర్‌లో వెళ్ళేది ఎవరో తెలుసుకోవాలి. చెట్టియార్ కూడ మీకు లాగానే నన్ను అనుమానించారు. ఇప్పుడే జయశీల అతడితో రహస్య మంతనాలు చేసింది."

నేను అంబాసిడర్ కారువైపు చూశాను. అది రోడ్డు దాటి ప్రక్క రోడ్లోకి దాటుతోంది.

నేను చటుక్కున టాక్సీలోకి మారాను. మాలతీ నా ప్రక్క కూర్చుంది.

టాక్సీని ఉరికించాను.

అంబాసిడర్ దూరంగా మలుపు తిరుగుతోంది. నా టాక్సీ మలుపు వద్దకు వెళ్ళింది. అక్కడ రోడ్డు మూడు శాఖలుగా చీలింది. అంబాసిడర్ కారు ఏ శాఖలోకి మళ్ళిందో....

నేను నిరాశగా టాక్సీ ఆపాను. స్టీరింగ్ వీల్ మీద అరచేత్తో కొట్టాను. మాలతి అబద్ధం చెబుతోందా?

## 7

డాట్సన్ కారు మద్రాసు వీధుల్లో పరుగులు తీస్తోంది. రోడ్లూ, వీధులు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. ఇళ్ళముందున్న అరుగులమీద ప్రమిదలతో దీపాలు వెలుగుతోన్నాయి. పిల్లలూ, పెద్దలూ బాణా సంచా కాల్చుతున్నారు. ఒళ్ళు మరచిన ఆనందంతో దీపావళి పండుగ భారతదేశంలో చిందులు త్రొక్కుతోంది.

డాట్సన్ జయశీల ఇంటిముందు ఆగింది. జయశీల ఇంటిముందు పోర్టికోలో దీపం వెలుగుతోంది. ఇంట్లో దీపాలు వెలుగుతోన్నట్టు లేదు. కిటికీలు మూసివున్నాయి. జయశీల ఇంట్లో వుందో లేదో?

కారును మెల్లగా పోర్టికోలోకి నడిపాడు శిరీష్.

"కాలింగ్ బెల్ నొక్కు" అన్నాడు నా వైపు చూసి.

పోర్టికో వెలుతురులో తలుపులు దగ్గరగా వేసివుండి కనిపిస్తున్నాయి. తలుపులకు తాళం పట్టేచోట స్టీలు పిడి నిగనిగలాడుతోంది. తలుపులకు తాళం పెట్టినట్టూ, ఇంట్లో ఎవరూ లేనట్టూ స్పష్టంగా తెలుస్తోంది.

అయినప్పటికీ కాలింగ్ బెల్ నొక్కాను. రింగ్ వెళ్తోంది.

శిరీష్ నిట్టూర్చి కారు స్టార్టు చేశాడు. కాలింగ్ బెల్ మీది నా చెయ్యి తీసేశాను. కారులో కూర్చున్నాను.

"జయశీల ఈ రోజు ఉదయం వాహిరా స్టూడియో నుండి బయలుదేరింది. మనం ఆమె కోసం స్టూడియోకి వెళ్ళాం. ఇంటికి వచ్చాం. నగరంలో ఆమె కోసం వెతికాం. ఈ రోజు ఆమెకు విశ్రాంతి దినం. ఎక్కడా కాల్ షీటు యివ్వలేదు" శిరీష్ మాట్లాడుతూనే కారును పోనిచ్చాడు.

జయశీల ఎక్కడకు వెళ్ళింది?

దారిలో శిరీష్ అన్నాడు. "నువ్వు చెట్టియార్ ఇంటి మీద ఈ రాత్రంతా కాపలా వుండు."

నేను తలూపాను. దీపావళి రాత్రి వీధివాడా బాణా సంచామోత! రాత్రి ఎలా గడపడం?

చెట్టియార్ ఇంటిదగ్గర నన్ను నిర్దాక్షిణ్యంగా వదిలి పెట్టి మైలాపూర్ వెళ్ళకోడ్డు పట్టుకున్నాడు శిరీష్.

చెట్టియార్ ఇల్లు దీపాల కళతో వెలుగుతోంది.

పోర్టికోలో పాత మోడల్ అంబాసిడర్ కారు వుంది.

నా మనసు పురకలు వేస్తోంది. చెట్టియార్ యింటి పిట్టగోడ దూకాను. తోటలో మొక్కల చాటున ఆగాను.

పై గదిలో దీపం వెలుగుతోంది. కిటికీమీద రెండు నీడలు కనిపిస్తున్నాయి. ఒక నీడ చెట్టియార్ ది. రెండవది పాత మోడల్ అంబాసిడర్ కారులో వచ్చిన వ్యక్తిది అయివుండాలి.

చెట్టియార్‌తో మాట్లాడే వ్యక్తి ఎవరో తెలుసు కోవడం ఎలా? నీటిగొట్టం పట్టుకొని పైకి ఎగబ్రాకాను..

# 8

ఉదయం పదిగంటలయింది.

మాలతి మైలాపూర్ రెండో క్రాస్ రోడ్లో నడుస్తోంది. రోడ్డుకి అటూ ఇటూ చూడసాగింది.

ఖాళీగా వున్న టాక్సీ రోడ్డుమీద కనిపించింది.

మాలతి టాక్సీ ఎక్కింది. టి. నగర్‌లో జయశీల ఇంటిముందు ఆగింది. ఇల్లు నిశ్శబ్దంగా వుంది.

జయశీల ఎక్కడకు వెళ్ళింది?

నిన్న ఆమెకు కాల్‌షీట్లు లేవు. విశ్రాంతి దినం. అందుకే తనను వరదాచారి ఇంటికి వెళ్ళనిచ్చింది. ఈ రోజు జయశీలకు పన్నెండు గంటల ప్రాంతంలో వాహినీ స్టూడియోలో కాల్‌షీటు వుంది.

హాండ్‌బాగ్‌లోంచి తాళం తీసింది. పోర్టికోలోంచి నడిచి తలుపు తాళం తెరచింది. తలుపు ప్రక్క లోపల తపాలా పెట్టె వుంది. పెట్టెలో చాలా కవర్లూ, కార్డులూ పడివున్నాయి.

మాలతి నిట్టూర్చింది.

జయశీల నిన్న కూడా ఫోన్ మెయిల్ చూసుకోలేదు. అందుకే యింత లాట్ మిగిలిపోయి వుంది.

మాలతి డ్రాయింగ్ రూంలోకి నడిచింది. ఇల్లు నిన్ననంతా తుడిచినట్టు లేదు. టీపాయ్‌మీద యాష్‌ట్రే వుంది. సిగరెట్టు పీకలూ, చాక్‌లెట్ కవర్లూ వున్నాయి.

మాలతి తిరిగి పోర్టికోలోకి వచ్చింది.

గేటు తెరచుకొని పనిమనిషి వస్తోంది. ముసలితనం వలన ఆమె ఆయాసపడుతోంది.

"నిన్న వచ్చావా?" అడిగింది మాలతి.

"రాలేదమ్మగారూ! మా మనవడికి ఒంట్లో బాగుండ లేదు."

మాలతి డ్రాయింగ్ రూం చూపించింది. "ఇల్లు చూడు. ఎంత ఛండాలంగా వుందో. ఏదో అరగంట వచ్చి శుభ్రం చేయవచ్చుగదా!" అంది.

"ఈ ఉదయాన్నే వచ్చాను. ఇంటికి తాళం పెట్టి వుంది!"

మాలతి మెట్లు ఎక్కుతోంది. మేడమీద గది మూసి వుంది. లోపల ఫాన్ తిరుగుతోన్న చప్పుడు వస్తోంది.

మాలతి నుదురు చిట్లించింది. జయశీల ఫాన్ ఆపడం మరచిపోయి బయటకు వెళ్ళిందా!

తలుపులు తోసింది. తెరచుకోలేదు. లోపల ప్రక్క తాళం పెట్టి వుంది.

మాలతి గుండె దడదడలాడింది. మనసు హెచ్చ రిస్తోంది. జయశీల ఏదో ప్రమాదంలో ఇరుక్కున్నది.

తాళంపట్టె రంధ్రంలోంచి లోపలకు చూసింది.

గదిలో కుర్చీ వుంది. రంధ్రంలోంచి కుర్చీ సీటు భాగం మాత్రం కనిపిస్తోంది. సీటుమీద జయశీల వుంది. ఆమె కూర్చున్న పొజిషన్ సహజంగా వున్నట్టులేదు. ఒకప్రక్కకు మూట ఒరిగినట్టు చేయిమీదకు ఒరిగివుంది జయశీల.

ఆమె చేయి ఒకటి లోటకూర కాడలాగా వ్రేలాడు తోంది.

మాలతి గజగజలాడి క్రింద కూలబడి పోయింది. పని మనిషి ఆమెను సమీపించిది.

"అమ్మగారూ!" అంది పనిమనిషి, ఆమెను పొదివి పట్టుకొని.

"జయశీల అమ్మగారికి ఏదో అయింది" అంది మాలతి గొంతు పెగల్చి.

"ఆఁ! అమ్మగారు లోపల వున్నారా?" పనిమనిషి బిత్తరపోయింది.

మాలతి నిస్త్రాణగా తలూపింది.

"తాళం తెరవండి అమ్మా! చూద్దాం!"

మాలతి తల అడ్డంగా త్రిప్పింది. "నా దగ్గర తాళం చెవిలేదు."

"అయితే ఇప్పుడు ఎలా అమ్మగారూ?"

"తాళంచెవి వున్నప్పటికీ తలుపు తెరకూడదు. పోలీసు వ్యవహారం!"

"అంటే నిన్నటినుండి జయశీల అమ్మగారు అదే పరిస్థితిలో వున్నారంటారా?"

"అవును."

"ఫోన్ తిరుగుతోన్నట్టుంది."

మాలతి ఆమెకు జవాబు చెప్పలేదు. కంగారుగా మెట్లు దిగింది. డ్రాయింగ్ రూంలోని ఫోన్‌ని సమీపించింది.

పోలీసులకు ఫోన్ చేసింది.

"పావుగంటలో వస్తున్నాయి. మీరెవరూ అక్కడి వస్తువులను తాకవద్దు" అన్నాడు క్రయింబ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ బాలు.

మాలతి రిసీవర్ క్రెడిల్ చేసి తిరిగి ఫోన్ ఎత్తింది.

డిటెక్టివ్ శిరీష్ అటు ప్రక్క దొరికాడు.

## 9

డాట్సన్ కారు జయశీల యింటివద్ద ఆపాను.

డిటెక్టివ్ శిరీష్ కారు దిగాడు. ఇంటివద్ద పోలీసు జీపులు ఆగివున్నాయి. ఇంటివద్ద జనం గుమిగూడారు.

శిరీష్టూ, నేనూ జనాన్ని ఒత్తిగించుకుని లోపలకు నడిచాం. డ్రాయింగ్ రూంలో ఇన్‌స్పెక్టర్ బాలు, ఫస్టుక్లాసు (జుడీషియల్) మెజిస్ట్రేటూ, సార్జంటూ, వ్రేలిముద్రల నిపుణుడూ, పాథాలజీ సర్జనూ, ఒక ప్రక్కగా మాలతీ, ముసలి పనిమనిషీ వున్నారు.

శిరీష్‌ని ఇనస్పెక్టర్ బాలు విష్ చేశాడు.

"గదిలో జయశీల వుంది. తలుపులు పగలగొట్టాలి!" అన్నాడు బాలు.

"తాళంచెవి దొరకలేదా?" అడిగాడు శిరీష్.

బాలు భుజాలు చరుచుకున్నాడు. "జయశీల లోపలివైపు తాళం పెట్టినట్టుంది. అందువలన తాళంచెవి గదిలో దొరకవచ్చు. తలుపులు పగలగొట్టాలి. అందుకే" బాలు మెజిస్ట్రేటువైపు సాభిప్రాయంగా చూశాడు.

మేజస్ట్రేటు మెట్లు ఎక్కసాగాడు. అందరమూ ఆయనను అనుసరించాం.

పోలీసుల సహకారంతో తలుపును తాళంవద్ద పగలగొట్టించాడు మేజిస్ట్రేటు.

గదిలో ఫాన్ తిరుగుతోంది. గది మధ్యగా కుర్చీలో జయశీల ఒరిగిపోయి వుంది. ఆమె కుడిచెయ్యి నేలమీదకి వ్రేలాడుతోంది. రెండో చెయ్యి కుర్చీలో వుంది. చేతిలో పిస్తోలు వుంది. తల విరిగినట్టుగా కుర్చీ వెనక భాగంమీద వ్రేలాడుతోంది. కుర్చీ వెనక భాగం రక్తంతో చింత

పిక్క రంగు పులుముకున్నది.

గదిలో మాంసం కుళ్ళుతోన్న వాసన!

గది కిటికీలు మూసి వున్నాయి. ఫాన్ గాలి అక్క డక్కడే రొటేట్ కావడంవల్ల చెడువాసనతో మాకు వికారం పుడుతోంది.

శరీఫ్ కుర్చీని సమీపించాడు. తల వున్న భాగంలో వంగాడు. కుడి చెవి వెనుక భాగంలో రంధ్రం పడింది. కుర్చీ తడిసిన రక్తం ఆ రంధ్రంలోంచే కారింది.

"ఇది ఆత్మహత్య అయివుండవచ్చు" అన్నాడు పాథాలజీ సర్జన్.

ఇన్స్పెక్టర్ బాలు గచ్చుమీద మోకాళ్ళు వేసి కూర్చున్నాడు.

"ఎడం చేతిలో పిస్తోలు వుంది. గాయం కుడి చెవి వెనుక భాగంలో వుంది. జయశీల ఎడంచేతివాటం మనిషా?" అడిగాను.

బాలు జవాబు కోసం మాలతి వైపు తిరిగాడు.

"జయశీలకు ఎడంచేతి వాటమా? అంటే తన పనులు చేసుకునేటప్పుడు ఎడం చేతినే హెచ్చుగా వుపయోగిస్తుందా?" అడిగాడు బాలు.

మాలతి ఒక క్షణంపాటు కళ్ళు మూసుకుంది. "కాదు" అంది.

"సో ఇది హత్య. ఆత్మహత్యగా చూపించాలని ప్రయత్నం చేశారు."

"గది తలుపు లోపలివైపు మూసివుంది. కిటికీలు మూసి వున్నాయి. హత్యచేసి ఇవన్నీ లోపలి వయిపు బిగించి వుంచడం ఎలా సాధ్యం?" అన్నాను నేను.

"గది తాళంచెవి గదిలోనే వుండి వుంటుంది"

సార్జంటుకు సైగ చేశాడు బాలు.

సార్జంటూ, ఇద్దరు కానిస్టేబుల్సూ గది వెతకసాగారు.

ఫోటోగ్రాఫర్ జయశీల శవానికి ఫోటోలు తీశాడు. వేలి ముద్రల నిపుణుడు గదిలో పౌడర్ స్ప్రే చేసి భూతద్దంతో తణిఖీ చేసుకుంటున్నాడు.

"పిస్తోలు మీద ఎలాంటి వేలిముద్రలు లేవు" అని అన్నాడు.

శిరీష్ అతడి చేతిలోంచి పిస్తోలు అందుకున్నాడు.

"పిస్తోలుమీద ఆమెకు గ్రిప్ వుందా?"

"లేదు. ఎవరో చనిపోయి వున్న ఆమె చేతిలో పిస్తోలు వుంచారు" నేను పాయింట్స్ నోట్ చేసుకుంటున్నాను.

సార్జంటు తలూపి, "సార్! ఈ గదిని మూసివుంచిన తాళంచెవి దొరకలేదు. కిటికీలమీదా, తలుపుమీదా, కుర్చీమీదా, చివరకు పిస్తోలుమీద కూడా వేలిముద్రలు లేవు" అన్నాడు.

"అంటే వేలిముద్రలను ఎవరో కావాలని చెరిపేశారన్నమాట!" శిరీష్ తలత్రిప్పి మాలతిని చూశాడు.

"జయశీల ఎటువంటిది?" అడిగాడు శిరీష్.

"ఆమె చాలా పట్టుదలగల మనిషి!"

"ఆత్మహత్య చేసుకునే మనిషా?"

"అంత బలహీనమైన మనసు వున్న స్త్రీ కాదు జయశీల."

"మాలతీ! నిన్న నువు మీ అమ్మగారితో కలిసి లేదా?" అడిగాడు బాలు.

"నిన్న జయశీలకు విశ్రాంతి దినం. నన్ను మా బంధువుల ఇంటికి వెళ్ళి రావడానికి అనుమతించారు."

"మీ బంధువుల ఇల్లు ఎక్కడ?"

"మైలాపూర్ లో."

"బంధువు అంటే ఏ విధంగా బంధువు?"

"వరదాచారి. ఆయన నాకు అంకుల్ అవుతారు. ఆయన భార్య నాకు అత్తయ్య అవుతుంది—ఆమె కొద్ది కాలంగా అస్వస్థతగా వుంది."

"కాని నిన్న నువు వరదాచారి ఇంట్లో లేవు" కలగ చేసుకున్నాడు శిరీష్.

"ఉదయాన్నే మా అత్తయ్యను పలకరించాను. తరువాత స్టూడియోలు తిరిగాను."

"ఎందుకు తిరిగావో చెబుతావా?"

"జయశీల అమ్మగారు పేరులో వుండగానే నేను కూడా నటిగా కాలు నిలద్రొక్కుకోవాలి. చెట్టియార్ తాను తీయబోయే తర్వాతి చిత్రంలో నాకు గుర్తింపు దొరికే పాత్ర యిస్తానన్నారు."

నేను మాలతినే చూస్తోన్నాను. మాలతి ఆరితేరిన జాణ! ఆమెను నిన్న రాత్రి చెట్టియార్ ఇంట్లో చూశాను. చెట్టియార్ తో పాత మోడల్ అంబాసిడర్ కారులో వచ్చిన వ్యక్తి మాట్లాడుతోన్నాడు. వాళ్ళిద్దరి నీడలూ కిటికీ అద్దంమీద పడుతున్నాయి. నేను నీటిగొట్టం పట్టుకొని పైకి ఎగబాకాను.

గదిలో చెట్టియార్, అతడూ మాట్లాడుతోన్నారు. వాళ్ళ మాటలు వింటూ ఒక ప్రక్కగా మాలతి కూర్చుంది.

పాత మోడల్ అంబాసిడర్ లో వచ్చిన వ్యక్తి ఏదో తెలుగు చిత్రం తీస్తాడట. చెట్టియార్ పెట్టుబడి పెట్టాలట. మాలతిని ఆ చిత్రంలో పాత్ర కోసం

చెట్టియార్ అతడికి శిఫారసు చేస్తున్నాడు.

అతిడు ఒప్పుకున్నాడు.

తర్వాత మాలతీ అతడూ అంబాసిడర్ కారులో వెళ్ళిపోయారు. తనకి వాళ్ళను వెంటాడటానికి టాక్సీ దొరకలేదు.

"రాత్రి మీతో కలిసి అంబాసిడర్ కారులో ప్రయాణం చేసిన వ్యక్తి ఎవరు?" అడిగాను.

మాలతి అంతసేపూ నిశ్చలంగా వున్నదనుకుంటాను. నా ప్రశ్నకు ఆమె మొహంలో రంగులు మారాయి.

"మీరు నన్ను వెంటాడారా?" అంది మాలతి.

"అవును."

"అతడి పేరేమిటి?" అడిగాను.

"పేరు నేను అడగలేదు."

విచిత్రంగా చూశాను. అతడు మాలతికి సినిమా ఆఫర్ ఇచ్చాడు. అయినా అతడి పేరు కూడా మాలతికి తెలియదు.

శిరీష్ నా వైపు ఓరకంట చూశాడు. కిటికీమీద టకటక చప్పుడు చేశాడు.

అతడికీ నాకూ మాత్రమే తెలిసిన కోడ్ భాష అది! నన్ను వీధిలోకి వెళ్ళి దర్యాప్తు చేయమంటున్నాడు శిరీష్. నేను యథాలాపంగా శవాన్ని చూసి తీరికగా బయటకు నడిచాను.

# 10

జయశీల ఇంటి గేటు దాటాను. ప్రక్క యింటికి వెళ్ళాను. ఇంటి గోడకు కన్నదాసన్, లెక్చరర్, గవర్న మెంట్ డిగ్రీ కాలేజ్, అడయార్ అని నేమ్ ప్లేటు

వుంది.

గేటు తెరచుకొని లోపలకు నడిచాను.

పడక కుర్చీలో కూర్చుండి ఒకాయన పేపర్ చదువు కుంటున్నాడు.

నన్ను చూడగానే "ఎవరు కావాలండి?" అని తమి ళంలో అడిగాడు.

"కన్నదాసన్ మీరేనా?" అడిగాను.

అతడు తలూపాడు.

నన్ను నేను పరిచయం చేసుకున్నాను. అతడు నాకు కుర్చీ చూపించాడు.

"నిన్న జయశీల మరణించింది. ఉదయం పదిగంటల ప్రాంతంలో మరణించినట్టు అంచనా వేశారు. ఆమె తలలోకి పిస్తోలుతో కాల్చుకొని మరణించింది. ఆ విష యంలో మాకు కొన్ని అనుమానాలున్నాయి. అను మానాలు తీర్చుకోవాలని యిటు వచ్చాను" అన్నాను.

కన్నదాసన్ ఆశ్చర్యపోయాడు.

"మీ సందేహాలు అడగండి" అన్నాడు కన్నదాసన్.

"నిన్న ఉదయం జయశీల ఇంటికి ఎవరు వచ్చారో మీరు కాని, మీ ఇంట్లోవారు కానీ చూశారా?"

"ఉదయం ఎనిమిది గంటలకు చెట్టియార్ కారు వచ్చింది. అప్పుడు నేను రోడ్డుమీద కిరసనాయిలు పోయించుకుంటున్నాను. చెట్టియార్ లోపలకు వెళ్ళి వెంటనే వచ్చేశాడు."

నేను నోట్ చేసుకున్నాను.

"అటు తర్వాత నేను ఎవరినీ గమనించలేదు."

"మీ పిల్లలు గానీ, మీ శ్రీమతిగారూ కానీ ఏమైనా చెప్పగలుగుతారేమో?"

కన్నదాసన్ తన భార్యను పిలిచాడు.

ఆమె వచ్చింది. "పదిగంటల ప్రాంతంలో డాట్సన్ కారులో ఎవరో ఇద్దరు వచ్చారు. వాళ్లే సాయంకాలం మళ్ళీ వచ్చారు" అంది.

లోపల నవ్వుకున్నాను. ఆమె నన్ను గుర్తుపట్టలేదు.

"మీ పిల్లలకు జయశీలలాంటి ప్రసిద్ధ నటిపట్ల మోజు వుంటుంది" అన్నాను.

"మా పెద్ద పాప వాణికి ఆమె పిక్చర్లంటే ప్రాణం" అంది కన్నదాసన్ భార్య.

"ఆమెను ఒక్కసారి పిలుస్తారా?"

వాణిని పంపించింది కన్నదాసన్ భార్య.

"నిన్న ఉదయం జయశీల ఇంటికి వెళ్ళావా వాణీ?" అడిగాను.

"అఁ! జయశీల ఆంటీ నన్ను రమ్మని పంపించింది కబురు. వెళ్ళాను."

"ఎన్ని గంటలకు?"

"ఉదయం ఎనిమిదిన్నరకు."

"ఎంతసేపటివరకూ వున్నావు?"

"పదికాకుండా వచ్చేశాను. నాకు మధ్యాహ్నం పిప్టు కాలేజి."

"ఏం చదువుతోన్నావు?"

"జూనియర్ యింటర్."

నా మనసు వురకలు వేస్తోంది. నిన్న ఉదయం పది గంటల ప్రాంతంలో మాకు జయశీల ఇంటికి తాళంపెట్టి కనిపించింది. జయశీల చివరి క్షణాల్లో ప్రాణాలతో వుండగా చూసినవారిలో వాణి ముఖ్యమయింది.

"నువు జయశీలతో మాట్లాడుతోండగా ఆమెకోసం

ఎవరయినా వచ్చారా?"

"తొమ్మిది దాటాక కాబోలు పాత మోడల్ అంబాసిడర్ కారులో ఒకతను వచ్చాడు."

తలూపాను.

"డ్రాయింగ్ రూంలో కూర్చున్నాడు. జయశీల ఆంటీ నేనూ అతడితో మాట్లాడుతూ కూర్చున్నాం."

"అతడు సిగరెట్లు కాల్చాడా?"

"ఆఁ!"

"మీ ఇద్దరూ చాక్లెట్లు తిన్నారా?"

వాణి సిగ్గుపడింది.

"అతడు ఎలా వున్నాడో చెప్పగలవా?"

"పొడవుగా వుంటాడు. సాదాగా వున్నాడు. లేత నీలిరంగు గడి వున్న లుంగీ పంచె కట్టుకున్నాడు. పూర్తి చేతుల తెల్ల చొక్కా వేసుకున్నాడు. కాళ్ళకు పల్చటి చెప్పులు."

అతడే! రాత్రి మాలతిని తన కారు ఎక్కించి తీసుకు వెళ్ళింది.

"అతడి పేరు తెలిసిందా?"

"ఆఁ! వరదాచారి."

నన్ను తలమీద ఎవరో మొత్తినట్టయింది. వరదాచారి ఎవరో కాదు. మాలతికి అంకుల్.

"వరదాచారి మీతో ఏ విషయాలు మాట్లాడాడు?"

"నాకు వాళ్ళిద్దరి సంభాషణలో ఏమీ అర్థంకాలేదు. స్టిల్స్ మొత్తం నెగటివ్స్‌తోబాటు యిస్తానన్నాడు వరదాచారి. జయశీల ఆంటీ అతడిని ఎంత సొమ్ము కావాలని అడిగింది. వరదాచారి అయిదు వేళ్ళు చూపించాడు. ఆంటీ నిట్టూర్చింది."

"జయశీల ఏమీ మాట్లాడలేదా?"

"ఎవరికో ఫోన్ చేసింది. అవతల చెప్పింది విని ఆమె చాలా అప్ సెట్ అయ్యారు."

"నువు అక్కడ వుండగానే వరదాచారి వెళ్ళిపోయాడా?"

"వెళ్ళిపోయాడు."

"వెళ్ళిపోతూ ఏమయినా చెప్పాడా?"

"సాయంకాలంవరకూ అతడు వాహిరా స్టూడియోలో ఆంటీ కోసం వెయిట్ చేస్తానని చెప్పాడు."

"నువు వచ్చేముందు జయశీల బాగా నిరుత్సాహంగా వుందా?"

"వరదాచారి వెళ్ళిపోగానే ఉత్సాహం తెచ్చుకుంది. నేను బయలుదేరాను. అప్పుడే పోర్టికోలో స్కూటర్ ఆగింది."

"స్కూటరా? ఎవరు వచ్చారు?"

"గౌస్."

"వూఁ!"

"గౌస్‌ను చూస్తూనే ఆంటీ తలుపు మూసింది. గౌస్ పళ్ళు కొరికాడు. నన్ను అడిగాడు. "మీ ఆంటీకి ఎవరి మీదో కోపంగా వుంది!" అని. నేను మెల్లగా నవ్వి మా ఇంట్లోకి వెళ్ళిపోయాను."

"తర్వాత పెద్ద చప్పుడు కానీ, కేకలు కానీ జయశీల ఇంట్లోంచి వినిపించాయా?"

"లేదు" అంది వాణి. వాణి నాకు మరో విశేషం కూడా చెప్పింది.

నేను లేచి కన్నదాసన్ కుటుంబానికి కృతజ్ఞతలు చెప్పుకున్నాను. తిరిగి జయశీల ఇంట్లోకి నడిచాను.

స్ట్రెచర్ మీద శవాన్ని పందుకో బెట్టారు.

డిటెక్టివ్ శిరీష్ కళ్ళు తళుక్కుమనడం కనిపెట్టాను. చటుక్కున గచ్చుమీదకు వంగి అందుకున్నాడు. పొడవు చేతులకు మణికట్టువద్ద పట్టే కఫ్‌లింకు. ఇత్తడి కఫ్‌లింక్. బ్రాసో అద్ది దాన్ని తళతళలు మెంచినట్టు వున్నారు.

"వి" అన్నాడు శిరీష్ కఫ్‌లింక్ మీది అక్షరం చదివి.

కఫ్‌లింకును బాలు అందుకున్నాడు.

సిబ్బంది జయశీల శవాన్ని బయటకు మోసుకు పోయారు. బాలు ఇంటికి తాళం పెట్టించాడు.

"సాయంకాలం మాలతీ, వరదాచారీ, గౌస్, చెట్టియార్‌తో ఇంటరాగేషన్ ఉంటుంది. నువ్వు తప్పక అయిదుగంటలకల్లా మా పోలీస్ స్టేషన్‌కి వచ్చెయ్యి" అన్నాడు బాలు.

శిరీష్ తలూపాడు.

పోలీసు జీపులూ, అంబులెన్సూ వెళ్ళిపోయాయి.

"పాత మోడల్ అంబాసిడర్ కారులో వచ్చింది వరదాచారి. మాలతికి అంకుల్" అని శిరీష్‌కు వాణి చెప్పిందంతా వివరించాను.

# 11

"మాలతీ!" పిలిచాడు డిటెక్టివ్ శిరీష్.

మాలతి న్యూస్ పేపర్ చదువుతుంటోంది. శిరీష్‌ను ఉలిక్కిపడి చూసింది.

"మీరా?" అంది.

"న్యూస్ పేపర్లో జయశీల మరణం గురించి ప్రముఖంగా వేశారు. చూశావా?" అడిగాడు శిరీష్.

"చూశాను,"

"జయశీల మరణం హత్యో ఆత్మహత్యో కూడా పోలీసులు నిర్ధారించలేకపోయారు."

మాలతి తలూపింది.

"మాలతీ! జయశీల హత్య అయిందో ఆత్మహత్య చేసుకుందో చెప్పగలదానివి నువ్వొక్కతివే!"

"ఆత్మహత్య చేసుకునేటంతటి పిరికిదికాదు జయశీల!"

"వరదాచారి ఎప్పుడయినా మేడమీది గదిలోకి వచ్చేవాడా?"

"వచ్చేవాడదనుకుంటాను."

"వరదాచారి విషయంలో నువు ఏదో రహస్యం దాచాలని ప్రయత్నించావు. ఏమిటది?"

"అతడు నాకు అంకుల్. నన్ను మాయమాటలతో దోచుకున్నాడు. చెట్టియార్ ఇంట్లో రహస్యంగా తిరగడానికి ఏర్పాటు చేయమని కోరాడు. కాని అతడు జయశీలనూ చెట్టియార్‌నూ వెంటాడతాడని వూహించలేకపోయాను. వాళ్ళ రహస్య జీవితాన్ని ఫోటోలుతీశాడు. అటు జయశీలనూ యిటు చెట్టియార్‌నూ బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు."

శరీఫ్ చురుకుగా చూశాడు. "నువు జయశీలకూ గౌస్‌కూ మధ్య విభేదాలు మరింత పెంచాలని ప్రయత్నించావు. ఎందుకు?"

"గౌస్‌తో జయశీల సుఖపడదు."

"ఆ విషయం తేల్చుకోవలసింది వాళ్ళిద్దరూనూ."

మాలతి తల దించుకుంది.

"రెండో ప్రక్క చెట్టియార్‌కీ జయశీలకు సంబంధాలు పెంచావు."

"జయశీలే మోజుపడింది."

డిటెక్టివ్ శిరీష్ పకపక నవ్వాడు. "చెట్టియార్ లాంటి ముసలాడిమీద జయశీలలాంటి పడుచు పిల్ల మోజు పడిందా?"

మాలతి మొహం ఎర్రబడింది.

"సినిమా ప్రపంచంలో సెక్సుకే ప్రాధాన్యత. వయసు కాదు" అంది మాలతి.

"జయశీల శవాన్ని నువ్వు మొదటిసారి ఎప్పుడు చూశావు?"

"ఈ రోజు ఉదయం పది తర్వాత."

"జయశీల శవాన్ని నువ్వు మొదటిసారి చూసింది ఉదయం పదిగంటలప్పుడు కాదు."

మాలతి మొహం పాలిపోయింది.

"నువ్వు ఉదయం ఎనిమిది గంటలకు జయశీల ఇంటికి వచ్చావు."

"అవును. వచ్చాను."

"ఎందుకు వచ్చావు?"

"ఈ రోజు పదకొండు గంటలకు వాహిని స్టూడియోలో డైలాగ్ డబ్బింగ్ వుంది. ఎనిమిది గంటల నుండి తయారయితే నే కాని మా ఆడవాళ్ళకు తెములదు!"

"జయశీల గదిలోకి వెళ్ళావు?"

"లేదు. వెళ్ళలేదు."

"తలుపు రంధ్రంలోంచే శవాన్ని చూశావా?"

"అవును."

"ఇంటి తాళంచెవుల సెట్టు నీ దగ్గర డూప్లికేటు వుంటుంది."

"ఎవరు చెప్పారు?"

"పనిమనిషి" జేబులోంచి తాళంచెవుల సెట్టు

తీశాడు శరీఫ్.

"ఇవి.... ఇవి.... మీకు ఎక్కడ దొరికాయి?"

"తోటలో."

మాలతి తల దించుకుంది.

# 12

వరదాచారీ, గౌస్‌ను వెంటపెట్టుకుని యింట్లోకి నడిచాను. వరదాచారి ఇల్లు అది. వరదాచారి భార్య లోపల గదిలో మూలుగుతోంది.

ముందు గదిలో మాలతి తల దించుకుని వుంది. ఆమె ముందు డిటెక్టివ్ శరీఫ్ నిలబడి వున్నాడు. అతడి చేతిలో తాళంచెవుల గుత్తి వుంది.

"నువ్వు ఎనిమిది గంటల ప్రాంతంలో జయశీల గదిలోకి వెళ్ళావు! ఆమె శవాన్ని చూశావు. తిరిగి బయటకు వచ్చి తలుపులకు మామూలుగా తాళం వేశావు."

"అవును. మైలాపూర్ వెళ్ళాను. నా మనసు కలత పడింది. ఆమెకు ఉజ్జ్వలమైన భవిష్యత్తు వుంది. నా భవిష్యత్తుకు ఆమె ప్రసిద్ధితో లింకు పడివుంది. జయశీల చనిపోయింది. నాకు ఎంతకూ మనసు ఊగ్గబెట్టుకోవడం సాధ్యంకాలేదు."

"తిరిగి పనిమనిషి వచ్చేసమయానికి జయశీల ఇంటికి వెళ్ళావు. ఆమె సాక్ష్యం వుంటుంది."

"అవును."

"మొదటిసారి శవాన్ని ధైర్యంగా చూశావు. తరువాత శవాన్ని ఎందుకు చూడలేక పోయావు!"

"తాళంచెవులు నా దగ్గర వున్నట్టు తెలిస్తే జయశీలది ఆత్మహత్య కాదేమోనని పోలీసులు భావించవచ్చును."

"శవంమీద వరదాచారికి సంబంధించిన కఫ్‌లింకు

వుంది."

వరదాచారి కంగారుపడ్డాడు.

"నాకు ఏ పాపమూ తెలియదు!" కీచుగా అరిచాడు వరదాచారి.

"గాస్! మీరు నిన్న ఉదయం జయశీలను కలుసుకోవాలని వచ్చారు. ఆమె మీ మొహంమీదే తలుపులు వేసింది. మీరు ఎందుకు వచ్చారు?" అడిగాడు శిరీష్.

"నా రేటు తగ్గించుకున్నాను. పదిహేను లక్షలు యిస్తే చాలు పాతిక లక్షలు అక్కరలేదు అని చెప్పడానికి వచ్చాను."

"మీరు ఒకప్రక్కా, వరదాచారి రెండో ప్రక్క జయశీలను డబ్బుకోసం పీడించారు. వరదాచారి తన కఫ్ లింకు అక్కడ శవంమీద ఎందుకు పడివున్నదో పోలీసులకు చెప్పుకోవాల్సిన అవసరం వుంది."

వరదాచారి మొహం పాలిపోయింది.

"నాకు జయశీలను చంపవలసిన అవసరంలేదు. చంపుకుంటే నాకే నష్టం!"

"నీకు నష్టంలేదు. చెట్టియార్ నీకు దొరికాడు. జయశీల చనిపోయినా చెట్టియార్ నీకు డబ్బుచెల్లిస్తాడు."

"చెట్టియార్ డబ్బు చెల్లించనని తెగేసి చెప్పాడు."

"అతడినీ జయశీలనూ కలిపి తీసిన అసభ్య చిత్రాలను బయటపెడతాననలేదా నువ్వు?"

"బయటపెట్టి ఏం లాభం? మాలతి ఆ ఫోటోల్లో కొన్నిటిని సంగ్రహించింది."

"అవును. అందులో నాకు ఒక ఫోటో పంపింది మాలతి" అన్నాడు శిరీష్.

నేను గతుక్కుమన్నాను. మాకు పోస్టులో వచ్చిన

ఫోటో మాలతి పంపించిందా? శిరీష్‌కి ఆ సంగతి ఎలా తెలిసింది!

"మాలతీ: ఆత్మహత్యను హత్యగా నిరూపించదల్చు కున్నందుకు నీకు తప్పక శిక్ష ఏమీ పడదనుకుంటాను. పోలీసు వర్గాలనూ, నేర పరిశోధననూ మభ్యపెట్టడమూ తప్పక తరగతి నేరంకాదు" అన్నాడు శిరీష్.

"జయశీలది ఆత్మహత్యా? అయితే...."

శిరీష్ మధ్యలోనే కలగజేసుకున్నాడు.

"ఉదయం ఎనిమిది గంటలకు జయశీల వద్దకు మాలతి వచ్చింది. శవాన్ని చూసింది. ఆత్మహత్య చేసుకుని జయశీల మరణించింది. కుడిచేతిలోని పిస్తోలుతో కుడి చెవి వెనుకభాగంలో కాల్చుకుని మరణించింది జయశీల.

జయశీల ఆత్మహత్యకు వరదాచారే కారణం అని మాలతి బలంగా నమ్మింది. మాలతి భవిష్యత్తుకు ఈ ఆత్మహత్య విషయం పెద్ద ఆటంకం. మాలతి పగతీర్చుకో దలచింది. మైలాపూర్ వెళ్ళింది. వరదాచారి బట్టలకు వున్న కఫ్‌లింకు సంపాదించింది.

మనతోబాటు శవాన్ని పరిశీలించేటప్పుడు శవంమీద కఫ్‌లింకు జారవిడిచింది. మన అనుమానం వరదాచారి మీదకు వెళ్ళాలి. కాని వరదాచారి ఆ గదికి వచ్చే సావకాశంలేదు. అతడు మేడమీద గదికి రాడు. వరదా చారి బ్లాక్ మెయిలర్. అతడిని డ్రాయింగ్ రూంలో వుంచే జయశీల మాట్లాడి పంపించేసింది. ఈ విషయం వాణి నిర్ధారించింది.

"అంతేకాదు—జయశీల ఇంటికి ఉదయమే ఒకసారి ఎనిమిది ప్రాంతాల మాలతి వచ్చినట్టు కూడా వాణి నిర్ధారించింది. మాలతే తాళం పెట్టింది. జయశీల ఇంటికి

నిన్నటినుండి బయట ఎలా తాళం పెట్టివుందో మాలతే చెప్పాలి!" ఆగాడు శరీఫ్.

మాలతి గొంతు సవరించుకుంది.

"జయశీల అమ్మగారే తాను ఇంట్లో వుండి విశ్రాంతి తీసుకుంటానని చెప్పారు. నన్ను ఉదయం 10-15కు వెళ్ళమని చెప్పారు. పోర్టికో గుమ్మానికి తాళం పెట్టమన్నారు. నేను అలాగే చేశాను. ఈ రోజు ఉదయం ఎనిమది గంటలకు ఆమె తిరిగి రమ్మని చెప్పారు. ఈ లోపుగా ఆమె ఇంత ఘోరం చేస్తుందని వూహించలేకపోయాను" అంది మాలతి.

ఇన్‌స్పెక్టర్ బాలు బూట్లు టకటకలాడించుకుంటూ లోపలికి వచ్చాడు. "ముగ్గురు నేరస్తులూ యిక్కడ వున్నారా?" అన్నాడు.

డిటెక్టివ్ శరీఫ్ అతడికి వివరించసాగాడు.

నేను పాయింట్స్ నోట్ చేయసాగాను.

మాలతీ, గౌస్, వరదాచారి తలలు దించుకున్నారు.

—:అయిపోయింది:—

సీరియల్

# రక్తపుటేర్లు

## వసుంధర

(గత సంచిక తరువాయి)

రఘురాం ఆశ్చర్యపడ్డాడు. ఇంత సులభంగా పెళ్ళి బేరం తేలిపోతుందని ఆయననుకోలేదు.

పెళ్ళివారు తిరుగు ప్రయాణమయ్యారు. దారిలో వారికి ఏదో ఊరేగింపు ఎదురయింది.

"ఎవరది? ఏదైనా రాజకీయనాయకుడికి సన్మానం జరుగుతోందా?" అన్నాడు వరుడి తండ్రి.

డ్రైవర్ కారాపి రోడ్డుపక్కన పోతున్న ఓ ఆసామీని అడిగాడు — "అది సన్మానం ఊరేగింపు కాదయ్యా—చావు ఊరేగింపు. మధురిమ అని ఓ గొప్ప నర్తకి హత్య చేయబడింది. ఆమె అభిమానులు—పోలీసుల ప్రత్యేక అనుమతి తీసుకొని శవాన్ని ఘనంగా ఊరేగిస్తున్నారు...."

"శివశివా—పెళ్ళి చూపులకని వచ్చాం — ఇలాంటి ఊరేగింపు ఎదురయిందేమిటి?" అన్నాడు వరుడి తండ్రి.

ఊరేగింపు అయ్యేవరకూ కారక్కడే ఆగాల్సివచ్చింది.

ఈలోగా ఇద్దరు వ్యక్తులు ఆ కారుని సమీపించారు.

"అంతా ఒకసారి బయటకు దిగాలి—" అన్నాడు ఇద్దరిలో ఒకడు.

"ఎందుకు?"

"మమ్మల్ని రఘురాంగారు పంపారు. మేము రావడం కాస్త ఆలస్యమయింది. మీ అందరికీ ఫోటోలు తీయడం మా బాధ్యత...."

అంతా కారు దిగారు.

"మీ పేరేమిటి?" అన్నాడు వరుడి తండ్రి.

"నా పేరు శ్రీకాంత్. ఇతడి పేరు డేంజర్...."

శ్రీకాంత్ చెబుతూండగానే డేంజర్ వాళ్ళందరికీ చకచకా ఫోటోలు తీశాడు.

"మా జాహ్నవికి మంచి వరుణ్ణి చూశారు. నాకెంతో సంతోషంగా వుంది—" అన్నాడు డేంజర్ అక్కణ్నించి వెళ్ళిపోతూ.

"కానీ మీ మామగారు నీకు మంచి ఫోటోగ్రాఫర్ని చూడలేదు. వాడు దొంగ వెధవలా, పచ్చి హంతకుడిలా వున్నాడు—" అన్నాడు వరుడి తండ్రి.

"వాను పెళ్ళిచేసుకునేది ఆయన కూతుర్ని గానీ—ఈ ఫోటోగ్రాఫర్ని కాదు కదా—" అంది వరుడి తల్లి.

"పెళ్ళి ఫోటోలు తీయడానికి కూడా ఈ వెధవే వస్తాడో—ఏమో — వీణ్ని చూస్తూంటే ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకోవాలి—" అన్నాడు వరుడి తండ్రి.

మళ్ళీ అంతా కారెక్కారు.

కారు ఊరు దాటింది.

రోడ్డుకు అటూ ఇటూ చెట్లున్నాయి. ఇంకా చీకటి పడలేదుగానీ—చెట్లు దట్టంగా ఉన్న మూలాన రోడ్డు చీకటిగానే వుంది. అలా కారు కొంతదూరం వెళ్ళాక హెడ్ లైట్ల కాంతిలో రోడ్డుకు అడ్డంగా నిలబడి ఓ వ్యక్తి ఉండడం గమనించి కారు ఆపాడు డ్రైవరు.

"ఏమిటయింది?" అంది వరుడి తల్లి.

వరుడప్పుడే జాహ్నవితో స్వప్న సంచారం ప్రారంభించాడో — ఏమో — కారు ఆగిన విషయం కూడా పట్టించుకోలేదు.

"ఏయ్—ఎవర్నువ్వు?" అన్నాడు డ్రైవర్.

ఆ వ్యక్తి కారును సమీపించాడు. అతణ్ని చూసి కార్లోనివారు ఉలిక్కిపడ్డారు. చర్మం కప్పుకున్న అస్థిపంజరంలా ఉన్నాడతను. అతడి చూపులు మహా భయంకరంగా వున్నాయి.

"శుభకార్యం తలపెట్టావుగా—ఆశీర్వదించిపోదామని వచ్చాను-అబ్బాయి పెళ్ళికి ఒప్పుకున్నాడా?" అన్నాడా వృద్ధుడు.

"ఒప్పుకున్నాడు కానీ ఎవర్నువ్వు?" అన్నాడు వరుడి తండ్రి.

"చాలామంది నన్ను మంత్రగాడంటారు. కానీ నాకు బాబా అనిపించుకోవడమే యిష్టం—" అన్నాడా వృద్ధుడు.

"కారెందుకు ఆపావు?"

"ఆశీర్వదించాలని ఆపాను. ఇంక మీరు వెళ్ళొచ్చు" అన్నాడు వృద్ధుడు.

"ఏడిసినట్లుంది—" అన్నాడు వరుడి తండ్రి.

బాబా త్వరత్వరగా అడుగులు వేసుకుంటూ రోడ్డు పక్క చెట్లలోకి వెళ్ళి మాయమైపోయాడు.

"చాలా అదృష్టం. వాడే దొంగవెధవోననుకుని హడిలిచచ్చాను...." అంది వరుడి తల్లి.

"కారాపి ఆశీర్వదించడమేమిటీ? అసలు వాడెవరూ? అలా ఎందుకు చేశాడు?" అన్నాడు వరుడి తండ్రి.

"ఏది ఏమైనా ఇక్కడి విషయానికి ఏదో ప్రాముఖ్యత వుంటుంది. బాబా మనను ఆపిన ప్రాంతానికి గుర్తుపెట్టుకోవడం మంచిది——" అన్నాడు వరుడి బాబాయి.

"అదుగో——అక్కడేదో అడ్వర్టయిజ్మెంటు బోర్డు వుంది. ఇటు మైలురాయి కనబడుతోంది. వివరాలు నోట్ చేయి—" అన్నాడు వరుడి తండ్రి.

"ఏం—నాయనా! నువ్వింకా స్వప్న విహారంలోనే వున్నావా?" అన్నాడు వరుడి బాబాయి వరుడితో.

వరుడింకా స్వప్న సంచారం చేస్తూనే ఉన్నాడు. అతడి జేబులో పెన్నుంది. వరుడి బాబాయి అతడి జేబులు తడిమి పెన్నుతోపాటు ఓ కాగితం కూడా లాగాడు. అయినా వరుడింకా మైకంలోనే వున్నాడు.

వరుడి బాబాయి కాగితంమీద ఏదో రాయబోయి ఆగి ఉలిక్కిపడ్డాడు——"అరే—ఏమిటిది?" అన్నాడు.

ముందు సీట్లోంచి వరుడి తండ్రి వెనక సీట్లోకి వంగాడు. ఆ కాగితంలోని వాక్యాల్ని అప్రయత్నంగా పైకి చదివాడు.

"పిల్ల నచ్చినా న చ్చి ం ద ని చెప్పకు. ప్రాణ ప్రమాదం...."

అంతవరకూ స్వప్న విహారం చేస్తున్న జగన్మోహన్ ఈ మాటలు వింటూ ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చాడు.

"ఈ కాగితం నీ జేబులోకెలా వచ్చింది?" అన్నాడు వరుడి బాబాయి.

"అవును - నా జేబులో కెలా వచ్చింది?" అన్నాడు జగన్మోహన్ అప్రయత్నంగా. అయితే అతడి మెదడు చురుగ్గా పని చేస్తోంది.

తనూ, జాహ్నవి అయిదు నిమిషాలసేపు ఏకాంతంగా మాట్లాడుకున్నారు. ఆమె, తను అడ్రసులు మార్చుకున్నారు. ఆమె అడ్రసు ఏం రాసిందో తెలియదు కానీ ఈ కాగితం ఆమే తన చేతికిచ్చిందా? అప్పుడది చదవాలని కూడా అనుకోలేదు. ఇది ఆమె దస్తూరీయేనా?

జగన్మోహన్ మరోసారి కాగితాన్ని చూశాడు. దస్తూరి ముత్యాలకోవలా వుంది—"స్వీట్ రైటింగ్!" అన్నాడు అప్రయత్నంగా.

"దస్తూరీ సంగతి తర్వాత — ముందీ కాగితం ఎలా వచ్చిందో చెప్పరా నాన్నా—" అన్నాడు వరుడి బాబాయి.

ఎట్టి పరిస్థితుల్లో జాహ్నవిని అనుమానించడంగానీ, ఇతరులామెను అనుమానించే పరిస్థితి కలగజేయడంకానీ జగన్మోహన్‌కిష్టంలేదు. అతడు తనకేమీ తెలియదనే అన్నాడు.

ఈ కాగితం ఆమె పెట్టి ఉండదని అతడి నమ్మకం. ఆమె తను జగన్మోహన్ అంటే ఇష్టపడుతున్నట్లూ, అతడితో వివాహం తన అదృష్టంగా భావించనున్నట్లూ చెప్పింది. ఎంతో తియ్యగా మాట్లాడింది. ఒక ఆడపిల్ల - అందులోనూ మధ్యతరగతి ఆడపిల్ల తనకాబోయే వరుణ్ని తనే కాకుండా చేసుకుంటుందా?

మరైతే ఈ చీటీ తన జేబులోకి ఎలా వచ్చింది?

"ఎందుకు రాదూ? ఆ పిల్లతో మాట్లాడివచ్చినప్పట్నుంచి చూస్తున్నాను వీడి వరస. అసలీ లోకంలో లేడు. యెప్పుడో ఎవరో వేసి వుంటారు. ఇది సరదాకు వేసారంటావా? నిజంగా హెచ్చరిస్తున్నారంటావా?"

అన్నాడు వరుడి బాబాయి తన అన్నతో.

"సరదాకు వేసినా నిజంగా హెచ్చరించినా ఒక్కటే మాట నీది. నేను జాహ్నవిని పెళ్ళిచేసుకుని తీర్తాను...." అన్నాడు జగన్మోహన్.

వరుడి తల్లి, తండ్రి ఏదో అన్నారు.

కానీ అతడు మళ్ళీ ఈ లోకంలో లేడు.

కారు కదిలింది.

"తొందరగా పోనీవయ్యా—తొమ్మిదవకుండా ఇల్లు చేరాలి—" అన్నాడు వరుడి తండ్రి.

"లాభంలేదండి—పన్నెండవుతుంది—" అన్నాడు డ్రైవర్.

"అదేం?"

"కారు ట్రబులిస్తోందండి...."

"ట్రబులంటే....?"

"దగ్గర్లో ఏదైనా ఊరు తగిలితే—ఓ అరగంటైనా రిపేరు చేయించాలండి...." అన్నాడు డ్రైవర్.

"వచ్చేటప్పుడు అన్నీ బాగానే ఉన్నాయి కదయ్యా—"

"ఉన్నాయండి. కానీ మనం పెళ్ళి వారింటిముందు రెండు గంటలు కారాపాం చూడండి. అప్పుడే ఏదో మిస్చిఫ్ జరిగిందండి—"

"అంటే?"

"పెద్ద కంగారేం లేదండి. దార్లో మనం ఆగాల్సి వుంటుంది...."

కారు వెడుతోంది. దూరంగా ఓ చిన్న గుడిసె కనిపించింది. డ్రైవర్ అక్కడ కారును ఆపాడు.

"ఏం?" అన్నాడు వరుడి తండ్రి.

"ఈ గుడిసెలో ఓ మెకానిక్కున్నాడు. మనకు అటూ ఇటూ పదిమైళ్ళ లోపల ఇతడే ఆధారం...." అన్నాడు డ్రైవర్.

అంతా కారు దిగారు. డ్రైవర్ గుడిసెలోని మెకానిక్కుని పిలిచాడు. అతను వచ్చి కారు చూశాడు. అయిదు నిమిషాల పరీక్ష అనంతరం—"సీరియస్ ట్రబులేమీ లేదు. ఓ అరగంటలో అంతా సెట్రైటయిపోతుంది" అన్నాడు.

"ఎంతివ్వాలి?"

"రిపేరయితేగాని చెప్పలేను. అన్యాయంగా అడగను...."

"సుమారుగా యెంతవుతుందో తెలియందే ఎలా?"

"పాతికలోపే వుంటుందండి...."

వరుడి తండ్రి చాలా సంతోషించాడు. ఈ రోజుల్లో కారుమీద చెయ్యి వేసినందుకే యాభై అడుగుతున్నారు..

"ఈ బాబాగాడు కారా పేదాకా ఈ ట్రబులున్నట్లు నేను గుర్తించలేదు. ఊళ్ళోనే గ్రహించివుంటే ఈ మధ్యలో ఇలా ఆగాల్సివచ్చివుండేదికాదు...." అన్నాడు డ్రైవర్ తప్పు తనదే అయినట్లు నొచ్చుకుంటూ.

అంతా కబుర్లలో పడ్డారు. వరుడు అలా చెట్ల చాటుకి వెళ్ళాడు. అతడికి మొహమాటం యెక్కువ. కాస్త దూరమే వెళ్ళాడతను.

అక్కడ చీకటిగా వుంది. దగ్గర్లో దీపాలేమీ లేవు.

జగన్మోహన్‌కు భయం వేయడంలేదు. అతడి తలపుల నిండా జాహ్నవి!-చెట్టు చాటున నిలబడి-"జాహ్నవీ!... జాహ్నవీ! ఐ లవ్ యూ .. మన వివాహమైనాక ఓ సంవత్సరంపాటు నా జీవితం పూర్తిగా నీకే అంకితం..."

అన్నాడతను.

ఈ మాటలు పైకి అనాలని ఇందాకట్నించి తపించి పోతున్నాడతను. అందుకే అందరికీ కాస్త దూరంగా వచ్చాడు. తలితండ్రులు తను పాస్ కు వెళ్ళాడనుకుంటారు. అతను మరోసారి—"జాహ్నవీ! ఐ లవ్ యూ...." అన్నాడు.

"బట్....ఐ హేట్ యూ...."

ఈ మాటలు అతడి వెనుకనుంచి వచ్చాయి. యెవరన్నారో తెలియదు. గుసగుసలాడుతున్నట్లుగా ఉందా మాట.

జగన్మోహన్ ఉలిక్కిపడి—"ఎవరది?" అని గట్టిగా అరవబోయాడు. ఈలోగా యెవరో వెనుకనుంచి అతడి నోరు గట్టిగా మూశారు.

జగన్మోహన్ పెనగులాడబోయాడు. అతడు బలం పుంజుకునేలోగా గుండెల్లో కత్తి దిగబడింది.

అరిచే అవకాశం కూడా లేదు. అతడు కుప్పలా కూలిపోయాడు. అరిచే అవకాశం వచ్చేసరికి అతడికి అరిచే ఓపిక లేదు.

* * *

"కాగల కార్యం గంధర్వులే తీర్చారు..." అన్నాడు విజయబాబు.

"అంటే?" అన్నాడు సురేష్.

"ఇంతకాలం నేను నీ ప్రేమ గురించి పట్టించుకో లేదు. నువ్వు జాహ్నవిని అమితంగా ప్రేమిస్తున్నావు. ఆమె నిన్ను తప్ప వేరెవ్వరినీ చేపట్టరాదని ఆశిస్తున్నావు. అది జరిగేలా చేస్తాను. అయితే....ఇక్కడ నువ్వో చిన్న వేదాంతం తెలుసుకోవాలి...." అన్నాడు విజయబాబు.

"చెప్పు...."

"ఆడదాని అందంకానీ, గొప్పతనంకానీ అందనంత వరకే. ఒకసారి అందం నీ స్వంతమయ్యాక—నీ మనసు మరో అందం కావాలంటుంది. అందువల్ల నువ్వు జాహ్నవిని పెళ్ళిచేసుకుని ఓ ఆరు నెలలో, ఏడాదో మహాదానందపడు. ఆమెపై మోజుతీరాక ఆమెను వదిలిపెట్టు...."

"నీకా?"

"అవును. నాకే!"

"యెందుకు?"

"మధురిమను ఏ దుర్మార్గుడో అన్యాయంగా పొట్టన బెట్టుకున్నాడు. వాడు బయటపడినా మధురిమ ఇంక లేదు. ఆమె స్థానం భర్తీచేయడానికి నాకు జాహ్నవి కావాలి...."

"కానీ .... జాహ్నవి .... అందమైనదే కానీ .... ఒక సాధారణ స్త్రీ. మధురిమకులా ఆమె ఆడలేదు....పాడలేదు...."

"ఆమెను నువ్వు నాకు వదిలేయ్ .... నేనామె చేత ఆడిస్తాను....పాడిస్తాను....ఏమైనా చేయిస్తాను...."

"మై గాడ్...." అన్నాడు సురేష్.... "జాహ్నవి గురించి అలా ఆలోచించడానికే మనసు ఒప్పడంలేదు.."

"ఆమె నీకింకా దక్కలేదు కదూ....అందుకే నీకలా అనిపిస్తోంది. ముందు నువ్వు జాహ్నవిని పెళ్ళాడే ప్రయత్నాలు చేయి...."

"అది నాకు సాధ్యమా?"

"యెందుకు కాదు? ఆమెను పెళ్ళాడాలని ముందుకు వచ్చిన వారిద్దరు హరీమన్నారు. ఈ విషయమై వారి

కుటుంబం కలత చెందుతోంది. ఇలాంటి సమయంలో నీలాంటి ఉన్నత కుటుంబీకుడు ఆమెను పెళ్ళాడతానంటూ ముందుకు వెడితే .. ”

“అదా — కాగల కార్యం గంధర్వులు తీర్చారంటున్నావు .... ఆమెకు కావలసిన వరుడు జగన్మోహన్ పోవడం గురించేనా? ఆ హత్య గురించి నీకేమీ తెలియదా?” కుతూహలంగా ప్రశ్నించాడతను.

“ఇది ప్రయోజనంలేని ప్రశ్న! నాకు తెలిసినా, తెలియకున్నా నీకు చెప్పడం తెలియదనే చెబుతాను.... అందువల్ల జరిగిపోయిన వాటి గురించికాక జరుగనున్న వాటి గురించి ఆలోచించు....” అన్నాడు విజయబాబు.

“జరుగనున్న వేమిటి — హత్యలా?” కంగారుగా అన్నాడు సురేష్.

“అలా కంగారుపడతావేం? ఇంతకుముందు జరిగిన హత్యల్లో నీ ప్రమేయమున్నదో లేదో నాకు తెలియదా?” అన్నాడు విజయబాబు.

సురేష్ ఒక్క నిమిషం మౌనంగా ఊరుకున్నాడు— “నువ్వు చెప్పేది బాగానే వుంది. కానీ నాకూ జాహ్నవికీ వివాహం కుదరదు. ఎందుకంటే ఈ ఊళ్ళో నాకు మంచి పేరులేదు. నేను ఎందరో ఆడపిల్లల్ని మోసంచేసి వున్నాను. వాళ్ళంతా నామీద పగబట్టి వున్నారు. నాకు పెళ్ళి అంటే చాలు..వాళ్ళు నా గురించి ఊరంతా దండోరా వేసేలాగున్నారు. అసలే వర్ణాంతర వివాహం. అలాంటప్పుడు ఈ వ్యసనాలొకటి....”

“అయితే జాహ్నవిని ఎలా పెళ్ళి చేసుకుందామని?”

“ఏమో—అది నాకు తెలియదు. ఆమె మరొకణ్ని పెళ్ళిచేసుకోవడం మాత్రం నేను సహించను....”

అన్నాడు సురేష్.

"అయితే నా పని సానుకూలం కావడానికి నువ్వు పనికిరావన్నమాట!" అన్నాడు విజయబాబు నిరుత్సాహంగా.

"చూడు మిస్టర్ బాబూ! నేను నిజంగా జాహ్నవిని ప్రేమిస్తున్నాను. నా స్వార్థం కోసం ఆమెను కాబోయే పెళ్ళికొడుకులను బాధపెట్టాలనుకుంటాను. కానీ ఆమెను బాధపెట్టలేను. నువ్వు కోరే జీవితానికి చేజేతులా జాహ్నవిని అప్పగించలేను. పైగా నువ్వలాంటి ప్రయత్నాలుచేస్తే నేను ప్రతిఘటిస్తాను కూడా..." అన్నాడు సురేష్.

"అయితే నాకు మధురిమ స్థానంలో వేరే యెవ్వరూ దొరకరా?" అన్నాడు విజయబాబు.

"ఈ ప్రపంచంలో అందగత్తెలకు కొదవలేదు. మధురిమవంటి వారు నీకు తప్పక దొరుకుతారు. కానీ అలాంటి వాళ్ళను వెతుకుతూ జాహ్నవిలాంటి వారి జోలికి, వెళ్ళకు. రక్తం ఏరులై ప్రవహించగలదు. నేను చెడిపోయినవాణ్ని. కానీ నా జాహ్నవిని చెడిపోనివ్వను...." అన్నాడు సురేష్.

"మిత్రుడిగా నువ్వు నాకిస్తున్న సలహాకదూ ఇది!"

"అవును—" అన్నాడు సురేష్.

"అయితే నీ సలహా పాటిస్తాను. మళ్ళీ జాహ్నవి గురించి ఆలోచించను కూడా ఆలోచించను. సారీ ఫర్ ది ట్రబుల్—" అని వెళ్ళిపోయాడు విజయబాబు.

"విజయబాబు సారీ చెప్పడమా—నమ్మదగ్గమాటే... నా జాగ్రత్తలో నేనుండాలి!" అనుకున్నాడు సురేష్.

* * *

"ఈసారి నేను మీకు సాయపడతానండీ-" అన్నాడు రామకృష్ణ—"క్రితంసారి మీ మాటల్ని సీరియస్‌గా తీసుకుని వుంటే కథ ఇంతవరకూ వచ్చి వుండేదికాదు. జగన్మోహన్‌తో మీ అమ్మాయి పెళ్ళి జరిగిపోయి వుండేది...."

రఘురాం కలవరంగానే కనిపించాడు — "మా అమ్మాయి అందగత్తె అని యెంతో సంతోషించాను. కానీ దురదృష్టం దాన్నివిధంగా వెన్నాడుతుందని నే నెన్నడూ ఊహించలేదు...."

"ఏం దురదృష్టమండీ! అవతల జగన్మోహన్ పోయి వారంరోజులైనా కాలేదు. అప్పుడే మీ అమ్మాయికింకో సంబంధం వెతుక్కుంటూ మరీ వచ్చింది...." అన్నాడు రామకృష్ణ. ఈ విషయం అతడికి బాధగా కూడా వుంది.

"సంబంధం వచ్చిందంటే నాకు చాలా బెంగగానూ, భయంగానూ వుంది. ఇదివరకటి సంతోషంలేదు...." అన్నాడు రఘురాం.

"అంతా కాకతాళీయమనుకోకండి సార్!" అన్నాడు రామకృష్ణ.

రఘురాం పెళ్ళి సంబంధం గురించి ఆలోచిస్తున్నాడు.

ఈ ఊరి పురోహితుడు పొరుగూరు వెళ్ళినపుడు వచ్చిందట—జాహ్నవి ప్రసక్తి. పురోహితుడికీ సంబంధం నచ్చి జాతకం అడిగి పట్టుకొచ్చాడు. ఇద్దరి జాతకాలూ అద్భుతంగా సరిపోయాయి.

పెళ్ళివారి రోజు పెళ్ళిచూపులకు వస్తున్నారు.

అబ్బాయి పేరు సుబ్రహ్మణ్యం. మనిషి జాహ్నవి అంత గొప్పగా లేకపోయినా ఆమె పక్కన దొండ పండుకు కాకిముక్కులా వుండడు.

ఇంట్లో పెళ్ళిచూపులకు ఏర్పాట్లు జరుగుతూంటే జాహ్నవి ఆలోచనలో పడింది.

"ప్రతాప్—నీకు పరాయిదాన్ని కాకూడదు నేను. అందుకు ఏం చేయను? నాకిలాంటి విషమ సమస్య యెందుకు సృష్టించావు?"

తనకోసమని వచ్చి చనిపోయిన ఆ ఇద్దరు యువకుల పైనా ఆమెకేమీ సానుభూతి ఉన్నట్లులేదు—"భగవంతుడా—ఈ పర్యాయం కూడా నన్ను రక్షించు...." అనుకుందామె.

ఆమె పల్చటి రెండు పొరల కాగితాన్ని తీసుకుంది. దానిలో ఒక పొరమీద ఇలా వ్రాసింది—"పెళ్ళికూతురు నచ్చినా నచ్చిందని చెప్పకు....ప్రాణాలకు ప్రమాదం.."

ఆ కాగితాన్ని భద్రంగా మడతపెట్టి—జాకెట్లోపల వుంచుకుంది.

ఏం చేయాలో ఆమెకు తెలుసు.

మధ్యాహ్నం ఒంటి గంటకు పెళ్ళివారు వచ్చారు. తతంగం మామూలుగా కొనసాగింది.

మధ్యలో జాహ్నవి సుబ్రహ్మణ్యాన్ని చూసింది. అతడి రూపం ఆమెపై ఎటువంటి ప్రభావాన్నీ చూపలేదు. పాపం—ఇతగాడి ఆయుష్షు యెంతో అన్న జాలి ఆ చూపుల్లో వుంది.

సుబ్రహ్మణ్యం చూపులు ఆ చూపులతో కలిశాయి. అతడామె కళ్ళలో జాలికి బదులు ప్రేమను చూశాడు.

ఏమి అందం? ఏమి చూపులు?

అతడు పరవశించి పోయాడు.

ఆ పరవశం సామాన్యమైనది కాదు. ఎంతో ప్రమాదకరమైన పరవశం. మృత్యువునైనా యెదిరించి ఆమెను

పొందాలన్న సంకల్పానికి బలంపోసేది ఆ పరవశమే!

సంకల్పం పరవశంతో బలపడవచ్చు. కానీ అది మృత్యువును ఆపలేదు. ఈ విషయం సుబ్రహ్మణ్యానికి తెలియదు. అతడిలో జాహ్నవిపట్ల ప్రేమ పుట్టి పెరిగి పెద్దదై మహా వృక్షమవుతోంది. ఆ మహా వృక్షం నీడన జీవించాలని అతననుకుంటున్నాడు. ఆ వృక్షం కూకటి వ్రేళ్ళతో పెళ్ళగించబడుతుందనీ దానికింద నే పడి తను నలిగి చస్తాననీ అతడికి తెలియదు.

సుబ్రహ్మణ్యం జాహ్నవితో ఏకాంతంగా మాట్లాడ తానన్నాడు.

ఇద్దరికీ ఏకాంతం కల్పించబడింది.

అయితే అతడామెతో ఏం మాట్లాడగలడు? ఆమెను చూస్తుంటే అతడికి మాటలే రావడంలేదు.

"నేను నీకు నచ్చానా?" అన్నాడతను.

"నేను మీకు నచ్చానా?" అంది జాహ్నవి.

"నీ గొంతు కూడా ఎంత తియ్యగా వుంది!" అన్నాడతను.

జాహ్నవి ఆ పొగడ్తలకు ఆనందించడంలేదు. ఆ క్షణంలో తానొక యువకునితో మాట్లాడుతున్నానన్న అనుభూతే లేదామెకు. అతడికీ తనకూ ఆ రోజుతో సంబంధం తెగిపోతుందని తెలుసునామెకు.

"మీ నిర్ణయం ఏమిటి?" అంది జాహ్నవి.

"ఇంకా నాకు నిర్ణయాలు కూడానా—నువ్వేమంటే అదే—నీ నిర్ణయాలే నా నిర్ణయాలు...."

జాహ్నవి తమాషాగా నవ్వి—"సరే—అయితే మీ అడ్రసు ఇవ్వండి—" అంది.

"యెందుకు?"

"నా నిర్ణయం మీకు తెలియబర్చడానికి మీ అడ్రసు కావాలి కదా!"

"అంటే?"

"మాటల్లో చెప్పలేనిది ఉత్తరాల్లో రాయడం సులభం—"

సుబ్రహ్మణ్యం కళ్ళలోకి మెరుపు వచ్చింది—"నువ్వు నాకు ఉత్తరం రాస్తావా—నిజంగానా?"

"నిజంగానే—" అందామె.

"మరి నేను కూడా నీకు ఉత్తరాలు రాయొచ్చా?" అతను అమాయకంగా అడిగాడామెను. బదులుగా ఆమె మనోహరంగా నవ్వింది. అతను జేబులోంచి ఓ కార్డుతీసి ఆమెకిచ్చాడు—"ఇది నా విజిటింగ్ కార్డు. నువ్వు రాసే ఉత్తరం ఈ అడ్రసుకే రాయి. ఇంటి అడ్రసుకు వద్దు-"

ఆమె ఆ కార్డు అందుకుని చేత్తో పట్టుకుంది.

"మరి నాకు నీ అడ్రస్ ఇవ్వవూ?"

"యెందుకు?"

"మరి నేనూ నీకు ఉత్తరం రాయాలిగా!"

"నేను ఉత్తరం రాసినపుడు అందులో అడ్రసు కూడా ఇస్తాను...."

"అలా కాదు. నీ దస్తూరీలో వ్రాసి ఇచ్చిన అడ్రసు నా దగ్గరుంటే అదో తృప్తి నాకు...." అన్నాడు సుబ్రహ్మణ్యం.

ఆమె జాకెట్లోంచీ ఓ కాగితం బైటకు తీసింది— "మీ దగ్గర పెన్నుందా?"

"ఆహా—నీ కాగితం—నా పెన్ను....చాలా బాగుంది. అన్నీ ఇలాగే జంటగా...."

అతడికి మాటలు రాలేదు. ఆమె పెన్ను అందుకుంది.

ఓరకంట అతడినే గమనిస్తూ అడ్రసు వ్రాయసాగింది. అతడామె చేతి కదలికలను గమనిస్తూ పరవశం చెందుతున్నాడు.

ఆమె అడ్రసు వ్రాయడం పూర్తిచేసింది. తలెత్తి అతడివంక చూసింది. అతడామెతో చూపులు కలిపాడు.

ఆ సమయం చాలా మెరుపు!

అది రెండు పొరల కాగితం. అడ్రసు వ్రాసిన కాగితాన్ని తన చేతిలోనే ఉంచుకుని అంతకుముందే అక్షరాలు వ్రాసిన కాగితాన్ని జాగ్రత్తగా మడతపెట్టి అందించింది. అతడీ లోకంలోనే లేడు. ఆ కాగితం అందుకుని జేబులో పెట్టుకున్నాడు.

తర్వాత వాళ్ళు బైటకు వచ్చేశారు.

"మాకు కట్నం వద్దు. మీరు కట్నమిస్తానంటే పోలీసులకు చెబుతాం. మీరెంత తొందరగా ముహూర్తం పెట్టించి కబురుచేయండి—" అన్నాడు సుబ్రహ్మణ్యం తండ్రి.

ఆయన మాట్లాడిన పద్ధతి రఘురాంకు బాగా నచ్చింది. అయితే అంతకుముందు జాహ్నవిని చూసుకుందుకు వచ్చిన వారిద్దరూ కూడా అంత చక్కగానూ మాట్లాడారు. చివరికేం జరిగింది?

తనకు పెళ్ళి సంబంధాలు సులభంగా కుదిరిపోతున్నాయి. కానీ పెళ్ళికొడుకులు దక్కడంలేదు.

పెళ్ళికొడుకును జాగ్రత్తగా ఉండమని హెచ్చరించాలని కూడా ఆయనకు అనిపించింది. అయితే ఆ హెచ్చరిక తన కూతురికి వ్యతిరేకంగా తనే ప్రచారం చేసినట్లవుతుంది. అందుకే ఆయన చెప్పలేదు.

ఆ రోజు పెళ్ళిచూపుల కార్యక్రమాన్ని రామకృష్ణ

పూర్తిగా ఫాలో అయ్యాడు — అతడికి తెలియనిదల్లా వధూవరుల ఏకాంతం మాత్రమే!

పెళ్ళివారు ఏదో హోటల్లో బసచేశారుట. ఆ రోజుకు వారు అందులోనే ఉంటామన్నారు. ప్రయాణం మర్నాడుట.

రఘురాం ఎంత బలవంత పెట్టినా పెళ్ళివారు ఆయు 'నింట్లో ఉండడానికి అంగీకరించలేదు. కలికితే అతక దన్నారు.

పెళ్ళివారితోపాటు రామకృష్ణ కూడా బయల్దేరాడు. ఆ రోజు సుబ్రహ్మణ్యానికి ఎటువంటి విశేషం జరుగుతుందో చూడాలని అతడనుకున్నాడు.

వాళ్ళు హోటల్ చేరేలోగా డేంజర్, శ్రీకాంత్ వచ్చి ఎదురయ్యారు. పెళ్ళివారి బృందానికి ఒక్కొక్కరికీ విడివిడిగా డేంజర్ ఫోటోలు తీశాడు. ఆ తతంగం యెందుకో రామకృష్ణకు తెలియలేదు. కానీ అతను డేంజర్ ముఖాన్ని బాగా గుర్తుపెట్టుకున్నాడు. డేంజర్ ముఖం అతడికి మరీ అంత అపరిచితమైనదీ కాదు.

వాళ్ళు దిగిన హోటల్లోనే రామకృష్ణ తను కూడా గది తీసుకున్నాడు. అదృష్టవశాత్తూ-వాళ్ళకు ఎదురు గదే దొరికిందతడికి.

రాత్రి తెల్లవార్లూ రామకృష్ణ నిద్రపోలేదు. అతనా గదినే రహస్యంగా గమనిస్తున్నాడు.

రాత్రి పదింటికి ఆ గదిముందు ఒక వృద్ధుడు ఆగాడు.

రామకృష్ణ కిటికీ ఓరగా తెరిచి అంతా గమనిస్తున్నాడు.

ఆ వృద్ధుణ్ని చూసి అతడాశ్చర్యపడ్డాడు. అతడి వయసు చెప్పడం కష్టం. కానీ బాగా ముసలివాడనే

అనిపిస్తుంది. అతడు మనిషి అనిపించడు. ఎముకలమీద చర్మం కప్పుకున్నట్లున్న ఆ వృద్ధుడొక పిశాచంలా ఉన్నాడు.

వృద్ధుడు తలుపు తడుతూంటే రామకృష్ణ ఊపిరి బిగబట్టాడు. ఇప్పుడేం జరుగుతుంది? ఆ వృద్ధుడు హంతకుడా?

అతడు సిద్ధంగా ఉన్నాడు.

పెళ్ళివారి గదిలోంచి కబుర్లు జోరుగా వినిపిస్తున్నాయి. అంతా ఉత్సాహంగా ఉన్నట్లున్నారు. నవ్వులు కూడా వినబడుతున్నాయి.

తలుపు రెండోసారి తట్టాడు వృద్ధుడు.

ఎదుటి గదిలోంచి నవ్వులు ఆగిపోయాయి. తలుపు తెరుచుకుంది. సుబ్రహ్మణ్యం తండ్రి ఎదుటి వ్యక్తిని చూసి ఉలిక్కిపడ్డాడు.

"ఎవరు?" అన్నాడాయన అప్రయత్నంగా.

వృద్ధుడు నవ్వాడు. అది పిశాచం నవ్వులా వుంది.

"ఎవరు?" ఈసారి కంగారుగా అన్నాడు సుబ్రహ్మణ్యం తండ్రి.

"శుభకార్యానికని వచ్చావు. ఆశీర్వదించిపోదామని వచ్చాను. అబ్బాయి పెళ్ళికి ఒప్పుకున్నాడా?" అన్నాడా వృద్ధుడు.

"ఒప్పుకున్నాడు. మీరెవరు? రఘురాంగారి బంధువులా?" అనడిగాడు సుబ్రహ్మణ్యం తండ్రి శాస్త్రి తెలుసుకుని.

"నేనెవరినైతేనేం నాయనా—నాకు కావలసిందల్లా ఒక్క కబురు. అబ్బాయి పెళ్ళికి ఒప్పుకున్నాడన్నది. చల్లని కబురు చెప్పావు—" అన్నాడు వృద్ధుడు.

"తమరెవరో చెప్పలేము-" అన్నాడు సుబ్రహ్మణ్యం

తండ్రి.

"అంతా నన్ను మంత్రగాడంటారు. కానీ బాబా అనిపించుకోవడం నాకిష్టం—" అని వృద్ధుడు అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

సుబ్రహ్మణ్యం తండ్రి ఒక్క నిమిషం ఆశ్చర్యంగా అటు చూసి—తర్వాత తలుపులు వేసుకుని లోపలకు వెళ్ళిపోయాడు.

రామకృష్ణ గదిలోంచి బైటకు వచ్చాడు. గది తలుపులకు తాళంవేశాడు. చకచక హోటల్లోంచి బయటపడ్డాడు. అతడు బాబాని అనుసరించసాగాడు.

యెవరీ బాబా? యెందుకీ సమయంలో వచ్చాడు?

బాబా నడక నిలకడగాలేదు. అతను నిమిషానికో వైపు నడుస్తున్నాడు. రామకృష్ణ మాత్రం బాబాను వదలలేదు.

క్రమంగా దారి ఇరుకు సందులోకి వెళ్ళింది.

ఆఖరికి ఓ నిర్మానుష్యంగా వున్న సందు మధ్యన ఆగాడు బాబా. ఏం చేయాలో తెలియక రామకృష్ణ ఆగిపోయాడు.

"ఏం—నాయనా—రామకృష్ణా—ఆగిపోయావు! ఇలా నా ముందుకు రా—" అన్నాడు బాబా.

రామకృష్ణకు కలిగిన ఆశ్చర్యమింతా అంతా కాదు. అతడోసారి పరిసరాలు పరికించాడు. వాతావరణం ప్రమాదకరంగానే వుంది. తను అనాలోచితంగా చాలా దూరం వచ్చేశాడు.

అతను తెగించి బాబా ముందుకు వెళ్లాడు.

బాబా రామకృష్ణను పరీక్షగా చూసి—"సాహసివి నువ్వు!" అన్నాడు.

"సాహసి నే—మీకు నా పేరెలా తెలిసిందో తెలుసుకోవాలనుకుంటున్నాను...." అన్నాడు రామకృష్ణ.

"చెప్పను...." అని నవ్వాడు బాబా. మళ్ళీ భయంకరమైన నవ్వు.

"పోనీ—నన్నెందుకు పిలిచారు?"

"నాతో నీకేం పనో తెలుసుకుందామని!"

"సుబ్రహ్మణ్యం పెళ్ళిమీద మీకు ఆసక్తి ఎందుకు?"

బాబా మళ్ళీ భయంకరంగా నవ్వాడు—"జాహ్నవిని పెళ్ళాడాలనుకున్న వాడికి మరణగండముంది. ఈ విషయం బయటకు చెబితే ఆడపిల్లకు పెళ్ళికాదు. నేను సకలజన శ్రేయోభిలాషిని. జాహ్నవి జాతకాన్ని మార్చేటందుకు ప్రయత్నిస్తున్నాను. ఈలోగానే ఆమెకు సంబంధాలొస్తున్నాయి. తాత్కాలికంగా నేను చేయగలిగినదేముంది? నా ఆశీర్వచనాలవల్ల ప్రయోజనముంటుందేమోనని ఇంటికి వెళ్ళి దీవించి పోతున్నాను...."

"అంటే ప్రతిసారీ మీరు వరుణ్ని దీవిస్తున్నారా?"

"అవును—" అన్నాడు బాబా.

"మీ దీవెన ఫలితం ఎలా వుంది?" అన్నాడు రామకృష్ణ.

"ఇంతవరకూ ఫలించలేదు. ఈసారైనా ఫలిస్తుందో ఫలించదో—వెళ్ళి చూడరాదూ--నా వెంట బడకపోతే!" అన్నాడు బాబా చిరాగ్గా.

ఏమనుకున్నాడో రామకృష్ణ ఆక్కణ్ణించి వెనుదిరిగాడు. ఇదంతా ఏదో తమాషా అనిపించిందతడికి.

హోటల్ చేరుకోవడానికి గంటకుపైగా పట్టింది. రామకృష్ణ తన గదిలోకి వెళ్ళి పడుకున్నాడు. రాత్రి అతడికి సరిగ్గా నిద్రపట్టలేదు. ఎదుటి గదిలో విశేషాలేమీ

జరిగినట్లు లేదు. అందువల్ల అతడికి నిద్రాభంగం కాలేదు.

ఉదయం ఏడింటికి గదిలో ఏదో కలకలం వినబడింది. రామకృష్ణ ఆదరాబాదరాగా లేచాడు. అతను తలుపులు తీసేసరికి ఎదుటి గది తలుపులు బార్లా తెరిచివున్నాయి. లోపల హోటల్ మేనేజరు కూడా వున్నాడు.

రామకృష్ణ తనూ గదిలోకి వెళ్ళాడు. అక్కడి దృశ్యం చూసి అతను ఆశ్చర్యపడ్డాడు.

మంచం. మంచంమీద దుప్పటీ. దుప్పటి మధ్యలో కత్తి. కత్తి చుట్టూ రక్తం.

రామకృష్ణ కళ్ళు అటూ యిటూ వెదుకుతున్నాయి. అతడి కళ్ళకు సుబ్రహ్మణ్యం కనిపించాడు. అంటే.... ఎవరు? చనిపోయిందెవరు?

"మావాడిమీద హత్యాప్రయత్నం జరుగుతుందని ముందే తెలుసు. అందుకే మంచంమీద వాడిస్థానంలో వాడికిలాగుండే ఓ బొమ్మను తయారుచేసి పడుకోబెట్టాం. వాడు మంచంకింద పడుకున్నాడు. ఆయితే హంతకుడు గదిలోకి ఎప్పుడు-ఎలా ప్రవేశించాడో మాకు తెలియడం లేదు. అతడి ఆచూకీ తెలుసుకుందుకు ఈ కత్తి ఆధారంగా వుంటుంది. మనం పోలీసుల్ని పిలవాలి—" అన్నాడు సుబ్రహ్మణ్యం తండ్రి.

"మీ గదిలో అన్ని తలుపులూ వేసివుండగా ఓ బొమ్మ పొట్టలో కత్తి గుచ్చుకుని వున్నదంటే—దాన్ని పరిశోధించడానికి ఏ పోలీసులు వస్తారు? మీరు పిచ్చివాళ్ళంటారు. లేదా ఏదో వ్యూహం పన్నుతున్నారంటారు...." అన్నాడు హోటల్ మేనేజరు.

ఇద్దరికీ ఆ విషయమై కాసేపు వాగ్వివాదం జరిగింది.

మా హోటల్లోకి ఎవరూ అడుగు పెట్టలేరని అంటాడు మేనేజరు. అడుగు పెట్టారంటాడు సుబ్రహ్మణ్యం తండ్రి.

"కావాలంటే ఈ రోజుకు కూడా మీ అబ్బాయిని ఇక్కడే వుంచండి. హత్య జరుగదని నా హామీ—" అన్నాడు మేనేజరు.

"బాబోయ్ — నా ప్రాణాలతో మీరు పందాలు కాయొద్దు. ఇంక మనమీ హోటల్లో ఒక్క క్షణంకూడా ఉండొద్దు—" అన్నాడు సుబ్రహ్మణ్యం.

రామకృష్ణ వాళ్ళను సమీపించాడు—"మీ అబ్బాయి మీద హత్యాప్రయత్నం జరుగుతుందని మీకెలా తెలిసింది?"

"నువ్వెవ్వరు బాబూ—రఘురాంగారింట్లో ఉంటున్న అబ్బాయివేగా?" అన్నాడు సుబ్రహ్మణ్యం తండ్రి.

"అవునండి — నాకు పోలీసు డిపార్టుమెంటులో కనెక్షన్సున్నాయి. మీకేమైనా సాయపడగలనేమో ప్రయత్నిస్తాను...." అన్నాడు రామకృష్ణ.

సుబ్రహ్మణ్యం తండ్రి చెప్పిన వివరాలు అతుకుల బొంతలా వున్నాయి. వరుడికి ప్రాణ ప్రమాదమున్నట్లు పెళ్ళిచూపుల అనంతరం ఓ హెచ్చరిక అందిందట. అదెలాగందిందో తెలియదు కానీ వారికి జాగ్రత్త తీసుకోవాలనిపించింది.

మంచంమీద హత్యచేయబడివున్న బొమ్మ అచ్చం సుబ్రహ్మణ్యంను లాగానే వుంది. కత్తితో పొడవగానే రక్తం చిమ్మే ఏర్పాటు కూడా వుంది. బొమ్మ చాలా ఖరీదైనది. అధునికమైనది.

కానీ పెళ్ళిచూపులు అయిన తర్వాత ఒక్క రాత్రిలో అలాంటి బొమ్మను తయారుచేయగలగడం అసాధ్యం. అ

బొమ్మ కొంతకాలం క్రితంనుంచీ సుబ్రహ్మణ్యం తండ్రి దగ్గరుండి వుండాలి. లేదా హత్య గురించి వాళ్ళకు చాలా ముందు తెలిసివుండాలి. అదే నిజమైన పక్షంలో—హత్య జరుగుతుందని తెలిసేక-ఎవ్వరూ బొమ్మలు చేయించుకుని కూర్చోరు. పోలీసు రక్షణ కోరతారు.

రామకృష్ణ అడిగిన ఒక్క ప్రశ్నకీ వారు సరైన సమాధానం చెప్పలేకపోయారు.

హోటలు మేనేజరు సంతోషంగా—"అలా అడుగు నాయనా! నీ ఉపకారం నేను మరిచిపోలేను—" అని వెళ్ళిపోయాడు.

"నీ ప్రశ్నలు బంగారంగానూ — కొంప ముంచావు గదయ్యా—" అన్నాడు సుబ్రహ్మణ్యం తండ్రి విసుగ్గా.

"నిజం తెలుసుకోవాలికదండీ-" అన్నాడు రామకృష్ణ.

"నిజమెందుకూ?" అన్నాడాయన.

"ఒకవేళ మీ మాటలు విని మేనేజరు పోలీసుల్ని పిలిచాడనుకోండి — అప్పుడు వాళ్ళు మిమ్మల్నిలాగే ప్రశ్నలు వేస్తారు...." అన్నాడు రామకృష్ణ.

"అన్నట్లు — నువ్వు పోలీసు మనిషి వేనని కదూ అన్నావ్—"

"అవునండి."

"అయితే సరే—జరిగింది మర్చిపో—మేమూ మర్చిపోతాం—"

ఈ మాటలకు రామకృష్ణ మళ్ళీ ఆశ్చర్యపడ్డాడు— "ఆ కత్తి నాకివ్వండి. ఈ విషయమై నేను రహస్యంగా పరిశోధిస్తాను...."

"కత్తికేం భాగ్యం — నీ దగ్గరే ఉంచుకో—" అన్నాడు సుబ్రహ్మణ్యం తండ్రి. రామకృష్ణ ఆ కత్తిని

తీసుకుని బాత్రూంలో కడిగాడు. కత్తిలో ప్రత్యేకత ఏమీ లేదు. ఎటొచ్చీ వాడిగా వుంది.

"మళ్ళీ నామీద హత్యా ప్రయత్నం జరిగితే?" అన్నాడు సుబ్రహ్మణ్యం కంగారుగా.

సరిగ్గా అప్పుడే ఆ గదిలో ఓ మనిషి ప్రవేశించాడు. అతడు లావుగా, బలంగా, ఎత్తుగా ఉన్నాడు.

"నేనొచ్చేశాను. యింక నీకే భయమూ లేదు—" అన్నాడా వ్యక్తి.

అంతా అతడివంక చూశారు.

"నన్ను భీమసేనుడంటారు...." అన్నాడతను.

"ఓహో....నిన్ను...."

"అవేమీ మాట్లాడకండి. అనవసరమైన పేర్లు ఉచ్ఛరించకండి. ఈ క్షణంనుంచీ నా అనుమతిలేనిదే మీ అబ్బాయి వంటిమీదకు గాలి కూడా వెళ్ళదు" అన్నాడు సుబ్రహ్మణ్యం.

రామకృష్ణ ఆశ్చర్యంగా చూస్తున్నాడు. మధురిమ బాడీగార్డుగా వుండే భీమసేనుడిప్పుడిక్కడికెందుకు వచ్చాడు? అతడి నెవరు పంపారు? ఈ పెళ్ళివారి పార్టీ వ్యవహార మేమిటి? జాహ్నవితో వివాహానికి తలపడితే ప్రాణప్రమాదమని వారికి ముందే ఎలా తెలుసు? తెలిసే పెళ్ళికి ఎందుకు సిద్ధపడ్డారు? అసలు జాహ్నవిని పెళ్ళాడాలనుకుంటే ప్రాణప్రమాద మెందుకవుతోంది? ....ఒకటి కాదు....రెండు కాదు....లక్షలాది ప్రశ్నలు....

భీమసేనుడి గురించీ అతడి శక్తిసామర్థ్యాల గురించీ రామకృష్ణకు బాగా తెలుసు. తన అదృష్టంకొద్దీ మధురిమ ఒంటరిగా దొరికింది—లేని పక్షంలో....

జాహ్నవి వరుడికింకే ప్రమాదమూ లేదన్న ఉద్దేశ్యంతో రామకృష్ణ అక్కణ్నించి మకాం మార్చేశాడు.

* * *

"మంగళా!" అన్నాడు ప్రతాప్.

"ఊఁ"

"ఎన్నాళ్ళిలా?" అన్నాడు ప్రతాప్.

"నాకే తెలియదు...."

"మా ఇంట్లో యెన్నాళ్ళున్నా బాధలేదు నాకు. కానీ నువ్వు విధించిన ఈ దూరానికి తట్టుకోలేక పోతున్నాను...."

మంగళ జవాబివ్వలేదు. ఆమెకు ఆ ఇంట్లో ప్రత్యేకంగా ఓ గది ఇవ్వబడింది. ఆమె యెప్పుడూ నిండా బురాఖాలో వుంటుంది. ప్రతాప్ తల్లిగానీ, సావిత్రిగానీ ఆమె రూపాన్ని చూడలేదు. రాత్రిళ్ళు ఆమె గది తలుపులు వేసుకొని పడుకుంటుంది. ప్రతాప్ రాత్రి సమయాల్లో ఆమెను లేపడానికి కొన్ని వృథా ప్రయత్నాలు చేశాడు.

పగలు ఆమెతో మాట్లాడ్డానికి అతడికెంతో అవకాశం రావడంలేదు. ఆ వచ్చే అవకాశం ఆమెను లొంగదీసుకుందుకు చాలడంలేదు.

ప్రతాప్ అక్కణ్నించి బయటపడ్డాడు. లాభంలేదు. తన ప్రయత్నాలు—యెక్కడ వేశావే గొంగళీ అన్నట్లు అక్కడే ఆగిపోయాయి. మళ్ళీ అయిదుగురి కోసం ప్రయత్నాలు చెయ్యాలి.

"నలుగురే అనుకున్నాను....అయిదుగురు కావాలి..." అనుకున్నాడతను దిగులుగా.

"మంగళను మర్చిపో. త్వరగా నీ కార్యక్రమం కొన

సాగించు....”

అతడి మనసు ఆవేదనాపూరితంగా వుంది. జాహ్నవికి కళ్యాణ ఘడియలు వచ్చేస్తున్నాయి. ఆమెను కాబోయే వరుడిమీద హత్యా ప్రయత్నం వృథా అయిందని రఘురాం అతడికి సంతోషంగా చెప్పాడు. అంటే ఈ వరుడు జాహ్నవికి ఖాయం కావచ్చు.

ఈలోగా తను త్వరపడాలి....

ప్రతాప్ స్వయంగా మొహమాటసుడు. నెమ్మదసుడు. అతడు గట్టిగా తలచుకుని వుంటే కార్యక్రమం ఏనాడో రక్తికట్టి వుండేది.

నాలుగు రోజులు అతను ఊరంతా తిరిగాడు. తన పరిచయసులందరి ఇళ్ళకూ వెళ్ళాడు.

దమయంతి కురూపితనానికి మారు రూపం. ఆమెను కేవలం డబ్బుకోసం పెళ్ళాడాడు వీర్రాజు. వీర్రాజు ప్రతాప్ కి స్నేహితుడు. అయినప్పటికీ వాళ్ళింటికి వీర్రాజు లేనప్పుడే వెళ్ళాడు ప్రతాప్.

భర్త దమయంతిని — యిరవై నాలుగు గంటలూ సాధిస్తాడు. వీలైతే చెయ్యి చేసుకుంటాడు కూడా. చాలాసార్లు ఆమె చస్తే తను మరో పెళ్ళి చేసుకుంటానని కూడా అన్నాడతను. దమయంతికి వైవాహిక జీవితం ఒక నరకంగా వుంటోంది. ఆమె చావాలని ఒకటి రెండు ప్రయత్నాలు చేసింది. ఫలించలేదు.

ప్రతాప్ కు ఆమె గురించి అన్నీ తెలిశాయి. అతడామె ఇంటికి వెళ్ళి ఆమె సౌందర్యాన్ని పొగిడాడు. ఆమెపట్ల తనకు గల ప్రగాఢ కాంక్షను తన ప్రత్యేక పద్ధతిలో తెలియజేశాడు. తొలిసారిగా ఓ పురుషుడు కాంక్షతో తన్ను అనుభవించడం అతడి కారణంగానే దమయంతికి

జరిగింది.

దమయంతి అతడిపట్ల ఆకర్షితురాలు కావడంమాత్రమే కాదు. ఆరాధిస్తోంది. ఆ ఆరాధన పూజకు దారితీయాలన్నది ప్రతాప్ కోరిక. దారితీస్తుందన్నది అతడి నమ్మకం.

చంద్రావతి నలుపైతే కావచ్చు కానీ మరీ అనాకారి కాదు. వివాహమైనా కాపురానికింకా వెళ్ళలేదామె. కట్నం దగ్గర ఏవో గొడవలు వచ్చాయి.

ప్రతాప్ ఆమె కష్టాలు తెలుసుకున్నాడు. ఏదో పార్కులో వుండగా ఆమెను కలుసుకుని మాట్లాడాడు. ఆమెను భర్త దగ్గరకు పంపించే ఏర్పాటు తను చెయ్యగలనన్నాడు. ఒకటి కాదు.... రెండు కాదు....పదివేలు.. ఆమెకోసం వెచ్చించడానికి సిద్ధపడ్డాడు. నమ్మకంకోసం అతను బ్యాంకులో ఆమె పేరున ఆ డబ్బు వేసి చెక్కుబుక్కు, పాసు బుక్కు మాత్రం తనవద్ద వుంచుకున్నాడు.

చంద్రావతిలో కాస్త మానసిక సంఘర్షణ జరిగిన మాట నిజం. భర్తకు తను అన్యాయం చేస్తున్నానా అని ఆమె ఆలోచించింది. అయితే భర్త తనకంటే కూడా డబ్బుకు ప్రాధాన్యతనిచ్చాడు. అతడికి కావలసింది ముఖ్యంగా డబ్బు. ఆ డబ్బు కోసం తను శీలం కోల్పోతేనేం?

ప్రతాప్ ఆమె ఆలోచనలను తన దారిలోకి తీసుకుని వచ్చాడు. ఆమె అతడికి లొంగిపోయింది. తనను కాంక్షగా అనుభవించే అతణ్ని చూసి తనలో అంత ఆకర్షణ వుందా అని ఆశ్చర్యపడింది. ఆమెలో అతడంటే ఆకర్షణ ప్రబలింది. అది ఆరాధనగా మారడానికి కొద్దిరోజుల వ్యవధి

మాత్రం సరిపోయింది. అది పూజకు దారితీయగలదని ప్రతాప్ నమ్మకం.

కోమలి వయసు పద్దెనిమిది. కాలేజీలో చదువుకుంటోంది. నల్లగా వుండడం ఆమె చేసిన తప్పు. కాలేజీలో ఆమెను మగపిల్లలంతా ఏడిపిస్తారు. అందుకామె అలవాటు పడింది. కానీ ఆరు నెల్లనుంచీ ఆమె మానసికంగా వ్యథ చెందసాగింది. అప్పట్నించే ఆడపిల్లలు కూడా ఆమెను ఏడిపించడం ఆరంభమయింది. ఇటు మగ—అటు ఆడ— ఆమె అనాకారితనాన్ని ఎత్తిచూపిస్తున్నారు.

సరోజకు ఎన్నో ప్రేమలేఖలు వస్తాయి. అవి చూసుకొని ఆమె గర్వపడవచ్చు. కానీ వాటిలో కొన్ని కోమలికిచ్చి — "చదువుకోవే — పాపం — నీ కెవ్వరూ ఇలాంటివి రాయరు...." అనేది.

కోమలి కాలేజీలో ఒంటరి అయిపోయింది. ఒకోసారి కాలేజీలో। ఎవరైనా ఆమెను ఏడిపిస్తే — లెక్చరర్సు కూడా ముసిముసిగా నవ్వుకునేవారు. కోమలి కుంచించుకు పోయేది అవమానంతో.

ప్రతాప్ ఆమెకు కలిగించిన ఊరటతో ఆమె అతడి కోసం ఏమైనా చేయగలస్థితికి వచ్చింది. ఆమెను పూజకు ఒప్పించగలనన్న నమ్మకం అతడికి పూర్తిగా కలిగింది.

దమయంతి, చంద్రావతి, కోమలి-ఇలాంటి యువతులు ప్రతి ఊళ్ళోనూ కొకొల్లలుగా వున్నారు. ప్రతాప్ వల్ల తమ శీలం చెడిపోతున్నదని వారు భావించరు. అతడి పూజ వారిని బాధించదు. అతడి ద్వారా లభించే ఆదరాభిమానాలు, ప్రేమతో కూడిన అరింపులు, కాంక్షతో కూడిన సౌఖ్యం — వీటికోసం వారేమైనా చేస్తారు. అందువల్ల మరో కామాక్షి, సీత — అతడికి

లభించడం కష్టం కాలేదు.

రెండు వారాలపాటు ఏదో విధంగా సావకాశం కల్పించుకొని ప్రతాప్ తనకు పరిచయమైన పదిమంది యువతులతోనూ పూజా విధానం కొనసాగించాడు. అప్పుడతడి మనసుకు ఎంతో తృప్తిగా వుంది.

"అనవసరంగా మంగళ కోసం సమయం వృధా చేయలేదు — చాలా మంచి పని చేశాను...." అనుకున్నాడతను.

మంగళ ఇంకా అతడి ఇంట్లోనే వుంది. అతణ్ని పట్టించుకోవడమూ లేదు.

ఒకరోజు ప్రతాప్ ఊరి చివర పాడుబడిన శివాలయంలో బాబాను కలుసుకున్నాడు. తన కార్యక్రమం బాబాకు చెప్పాడు.

"శభాష్—...." అన్నాడు బాబా—"ఇంక నీలోని లోపం సవరించబడుతుంది....ఎల్లుండి ఎల్లుండి పున్నమి. పున్నమి వెళ్ళిన పంచమినుండి ప్రారంభించి-అమావాస్య వరకూ వరుసగా ప్రతి రాత్రీ ఒక భామను ఈ శివాలయానికి తీసుకురావాలి. గుర్తుంచుకో..రోజుకొక్కరు."

ప్రతాప్ కళ్ళలో మెరుపు కనబడింది. కానీ అది కొద్ది క్షణాలు మాత్రమే! అతను దిగులుగా అన్నాడు— "బాబా—నాలోని లోపం సవరించబడుతుందంటావా? నా కోర్కె నిజంగా తీరుతుందంటావా? నాకేమిటో అంతా దిగులుగా వుంది—"

"భేతాళ పూజను నమ్మి చెడినవారు లేరు...." అన్నాడు బాబా.

"అయితే నా ఏర్పాట్లలో నేనుండేదా?" అన్నాడు ప్రతాప్.

“కోంజూకొక్కురు....గుర్తుందా?”

“ఉంది!”

“అన్నింటికీ మించి పదకొండో ఆమె....అంతవరకూ ఎవ్వరూ ముట్టుని పడతి కావాలి. మన చివరి కార్యక్రమం ఆమెతో నే!” అన్నాడు బాబా.

“అలా ఎవరు దొరుకుతారు బాబా?”

బాబా నవ్వాడు. అది పిశాచం నవ్వులాగుంది—యెప్పటికిలాగే — “పదిమంది పడుచులతో బేతాళుడికి తృప్తి కలిగించేవా — పదకొండో యువతి తనకు తానై వెతుక్కుంటూ వస్తుంది .... నా మాటమీద నమ్మకముంచు....”

“నీ మాటపై నమ్మకముంచే ఇంతవరకూ వచ్చాను. నిన్ను నమ్మనిదే నాకు బ్రతుకులేదు బాబా...” అన్నాడు ప్రతాప్.

“గుర్తుంచుకో....పున్నమి వెళ్ళిన పంచమినుంచి.... కోంజుకొక్కురు .... మొత్తం పదిమంది. ఆపైన అనాఘ్రాణిత కుసుమం....పదకొండో యువతి .... రక్తం ఏరులై పొంగాలి. ఆ రక్తపుటేర్లలో నా బేతాళుడు స్నానంచేయాలి. అప్పుడు చూస్తావు....ఈ బాబా శక్తి సామర్థ్యాలు....” బాబా దిక్కులు పిక్కటిల్లేలా వికటాట్టహాసం చేశాడు.

* * *

“ఏమిటి జాహ్నవీ—అంత దిగులుగా వున్నావు—” అన్నాడు ప్రతాప్. ఆమె ముఖంలోని దిగులు భరించలేక పోవడంవల్ల నేమో—అతడి ముఖం బాధగా వున్నది.

“నే నెలాగుంటే నీకెందుకు? నా గురించి నీ కెప్పుడైనా పట్టింది కనుక నా—” అంది జాహ్నవి.

వాళ్ళు కూర్చున్నది మయూరా గార్డెన్స్ కాదు. జాహ్నవి ఇంట్లో తోటలో. ఇద్దరూ చెరో కుర్చీలోనూ కూర్చున్నారు.

"అలాగనకు జాహ్నవీ—నీకోసం ఏమైనా చేస్తాను. ఆ సంగతి నీకూ తెలుసు...." అన్నాడు ప్రతాప్.

"నాకోసం ఏమైనా చేయగలవారు వేరే వున్నారు. నువ్వింక నా గురించి మర్చిపో—" అంది జాహ్నవి.

"ఎవరో ఆ వేరే మనిషి...."

"సుబ్రహ్మణ్యం....నా కోసం అతను చావకుండా బ్రతికాడు...."

"జాహ్నవీ...." అన్నాడు ప్రతాప్—"చెప్పు—అతడు చావాలని నీకుందా?"

జాహ్నవి తల అడ్డంగా ఊపింది—"నా మనసులో ఏముందో నీకు చెప్పను. చావాలని వుందన్నాననుకో—నా కోసం నువ్వే వెళ్ళి చంపేస్తావు. కానీ నువ్వెంత సున్నిత మనస్కుడవో నాకు తెలుసు. ఒక హత్య చేశాక నువ్వు బ్రతకలేవు...."

"అంటే అతడు చావాలనే వుందన్నమాట నీకు..."

"అదేం కాదు....ఒకవేళ అతడు చావాలని లేదనే అన్నాననుకో .... అప్పుడు నువ్వు నేనతణ్ని ప్రేమిస్తున్నానని అనుకుంటావు. ఆ ఆలోచన భరించలేక నీ మనసు గాయపడుతుంది. నువ్వు నన్ను ప్రేమించినట్లే నేను నిన్నూ ప్రేమిస్తున్నాను. నా మనసు బాధపడకూడదని నువ్వనుకుంటావు. నీ మనసు బాధపడకూడదని నేననుకుంటాను..." ఆమె నిట్టూర్చి—"ఈ కథకు అంతం లేదు—" అంది.

"వుంది జాహ్నవీ! ఈ పున్నమి వెళ్ళిన అమావాస్య

తర్వాత నాలో ఓ వింత మార్పును చూస్తావు నువ్వు. అంతవరకూ నువ్వు వేచివుండాలి!"

"ఏమిటా మార్పు!" అంది జాహ్నవి కుతూహలంగా.

"ఫలానా అని చెప్పలేను. కానీ అది బహుశా నువ్వు కోరుకునే మార్పే అయివుండవచ్చును...."

జాహ్నవి ఉత్సాహపడలేదు — "నువ్వు పున్నమి వెళ్ళిన అమావాస్య గురించి మాట్లాడుతున్నావు. ఈ రోజే పెళ్ళి వారి దగ్గర్నుంచి కబురు వచ్చింది. వచ్చే సప్తమినాడు రిజిస్ట్రారాఫీసులో ఏ ఆర్భాటమూ లేకుండా పెళ్ళి జరపాలని...."

"నిజం!"

"నిజం కాకపోవడమేమిటి? రేపుదయానికి శుభలేఖలు తయారవుతూంటే ... నాన్న కబురు వింటూనే శుభలేఖలు అచ్చేయించడానికి పరుగెత్తారు...." అంది జాహ్నవి.

"అయ్యో..ఎంత పని జరిగింది!" అన్నాడు ప్రతాప్.

"ఏం?"

"మీ నాన్న సాధారణంగా శుభలేఖలు యెక్కడ అచ్చేయిస్తారో తెలుసా—నీకు!" అన్నాడు ప్రతాప్.

"సాధారణంగా అనడానికి మా ఇంట్లో మొదటి పెళ్ళి ఇదే కదా!" అంది జాహ్నవి.

"అవునూ—నాలుగేళ్ళ క్రితం మీరీ యింట్లో గృహ ప్రవేశం జరిపినపుడు కార్డులు వేయించారు. అవెక్కడ వేయించారో నాకూ గుర్తుంది....సీతారామా ప్రింటింగ్ ప్రెస్...." అన్నాడు ప్రతాప్.

జాహ్నవి ఏదో అనబోయింది. ప్రతాప్ లేచాడు. పరుగువంటి నడకతో అతనక్కణ్నించి కదిలాడు.

అతను అక్కణ్నుంచి సీతారామా ప్రింటింగ్ ప్రెస్ చేరడానికి ఇరవై నిమిషాలు పట్టింది. ప్రొప్రయిటర్ అతడికి తెలుసు. నవ్వుతూ పలకరించాడు. ప్రతాప్ కూడా చిన్నగా నవ్వి—"మామయ్యగానీ ఇక్కడకు వచ్చాడా?" అనడిగాడు.

"రఘురాంగారేనా? వచ్చారు. అమ్మాయి పెళ్ళి శుభలేఖలు ఆర్డరిచ్చారు. నాలుగొందలు అచ్చేయిస్తున్నారు...."

"ఎంతడిగారేమిటి?"

"కార్డులూ మేమే సప్లయి. మొత్తం కార్డులకీ, ప్రింటింగుకీ కలిపి రెండొందలయాభై—" అన్నాడు ప్రొప్రయిటరు.

"అయితే ఎప్పటికియ్యమన్నారు!"

"అర్జంటట—రేపుదయానికల్లా కావాలన్నారు...."

"అయితే నేను అయిదొందలిస్తాను..." అన్నాడు ప్రతాప్.

"ఏమిటి—ఈ సాయంత్రానికే కావాలా—కుదరదండీ—చాలా పనుంది. అసలు రేపుదయానికే కష్టం..."

"ఏమన్నారూ?" అన్నాడు ప్రతాప్.

"రేపుదయానికే కష్టం..." నసిగాడు ప్రొప్రయిటరు.

"అదే—ఆ మాటమీదే నిలబడండి...." అన్నాడు ప్రతాప్.

ప్రొప్రయిటరు కర్థం కాలేదు.

ప్రతాప్ వివరించాడు — "మీరు కార్డులు అచ్చువేయడానికి వీల్లేదు. అందుకే నేను అయిదొందలిస్తానంటున్నాను...."

"అలా ఎలా కుదురుతుందీ—పని ఒప్పుకున్నాక!"

"అందుకేగా ఆయిదొందలిస్తానంటున్నాను...."

"కానీ ప్రెస్సుకి చెడ్డ పేరు వస్తే బిజినెస్ పడిపో తుంది .... ఓ సారి పనొప్పుకున్నాక చేయననడం ఏం బాగుంటుంది?"

"చేయననకండి....ఇందాకనే అన్నారు గదా— రేపుదయానికే కష్టమని. ఏవో కుంటిసాకులు చెప్పండి. ఆ మర్నాడుదయానికి తప్పకుండా ఇస్తామని చెప్పండి."

"అప్పుడు అచ్చేయొచ్చా?"

"అప్పుడూ వేయక్కర్లేదు...."

"అలా ఎలా కుదురుతుంది?"

"రేపు సాయంత్రం రఘురాంగారే వచ్చి శుభలేఖలు ఇంకా అచ్చేయకపోతే ఇంక వేయొద్దని చెప్పివెడతారు" అన్నాడు ప్రతాప్.

"అసలు విషయమేంటండీ" అన్నాడు ప్రొప్రయిటర్.

"రఘురాంగారి అమ్మాయికి పెళ్ళి కుదిరింది. అంత వరకూ బాగానే వుంది. వున్నట్లుండి ఆ పెళ్ళివారివాళ వచ్చే సప్తమినాటికల్లా పెళ్ళి చేసేయమని కబురు పెట్టారు. అది విని ఈయన శుభలేఖలు వేయించేస్తు న్నారు.

ఈలోగా ఓ శ్రేయోభిలాషినుంచి ఆకాశరామన్న ఫోన్ కాల్ వచ్చింది. ఈ పెళ్ళివారిలో ఏదో లొసు గుందనీ ఓ రెండురోజులాగితే అది బైటపడుతుందనీ— అందాకా శుభలేఖలు వేయించవద్దనీ! ఇది రఘురాంగారు నమ్మరు. శుభలేఖలు రెండ్రోజులాలస్యమైనా ఫరవా లేదు. కానీ ఒకసారి శుభలేఖ వేశాక అది నలుగురికీ పంచాక—అప్పుడా పెళ్ళి ఆగిపోతే ఎంత అప్రతిష్ట! అందుకని ఆ కుటుంబం తరఫున నేనీ నిర్ణయం తీసు

కున్నాను....”

ప్రొప్రయిటర్ అనుమానంగా ప్రతాప్ వంక చూసి-
“కొంపదీసి — మీరా అమ్మాయినిగానీ ప్రేమించడం
లేదుగదా!” అన్నాడు.

“ఆ అమ్మాయిని కాకపోతే మిమ్మల్నీ, రఘురాం
గారినీ ప్రేమిస్తానేంటండీ—” అన్నాడు ప్రతాప్
అక్కణ్నించి వెళ్ళిపోతూ.

ప్రొప్రయిటర్ కతడినుంచి అయిదువందలూ ముట్టాయి.
డబ్బు జేబులోకి తోసేస్తూ—“చాలా చిత్రమైన కేసు!”
అనుకున్నాడు అతను.

* * *

రాత్రి పదకొండు గంటల సమయం.

అదో చిన్న పల్లెటూరు. ఆ ఊళ్ళో ఓ చిన్న పెంకు
టిల్లు. ఆ ఇంట్లో కిటికీలు లేని ఓ గదిలో తలుపులు
వేసుకొని పడుకుని వున్నాడు సుబ్రహ్మణ్యం. భీమసేనుడు
అతణ్ని కౌగలించుకొని నిద్రపోతున్నాడు.

గదిలో ఉక్కగా వుంది. పక్కన పంఖా తిరుగు
తున్నప్పటికీ—గదిలోకి గాలి వచ్చేపోయే అవకాశం
లేనందువల్ల చాలా వేడిగా వుంది.

సుబ్రహ్మణ్యానికి నిద్ర రావడంలేదు. అతడికి తన
శరీరపు చెమట కంపుతోపాటు భీమసేనుడి చెమట కంపు
కూడా భరించవలసిన అగత్యంపట్టింది.

“జాహ్నవీ-నీ కౌగిలికై ఎదురుచూస్తూ వీడి కౌగిలిలో
ఇరుక్కున్నాను. నీ మధుర వాక్యాలు విందామనుకున్న
వాడిని వీడి గుర్రు వింటున్నాను. ఈ గుర్రు నాకు నిద్ర
రాకుండా చేస్తోంది. అంతా నా దురదృష్టం—” అను
కున్నాడు సుబ్రహ్మణ్యం తనలోతాను.

"ఈ గదిలో ఈ ఉక్కలో ఇంకా పీడి ఉక్క
కాగిలి కూడా ఎందుకు?" అనుకున్నాడతను. కాసేపు
ఫ్రీగా విడిగా వుండాలనిపించిందతడికి. అయితే అతడికి
సాధ్యంకాలేదు.

అతడి ప్రయత్నాలకు ఉలిక్కిపడి లేచాడు భీమసేనుడు
"ఎవరక్కడ—ఏం జరిగింది?" అన్నాడతను.

"నేనే—ఉక్కిపోతున్నాను—" అన్నాడు సుబ్ర
హ్మణ్యం.

"ప్రాణాలు కాపాడుకోవాలంటే ఉక్కిపోక
తప్పదు—" అన్నాడు భీమసేనుడు విసుగ్గా.

సుబ్రహ్మణ్యానికి ఏం చెప్పాలో తెలియలేదు—
"బయటకు వెళ్ళాలి—" అన్నాడు నెమ్మదిగా.

"పద—నేనూ వస్తాను—" అన్నాడు భీమసేనుడు.

"భయంలేదు—ఎవరూ రారులే!" అన్నాడు సుబ్ర
హ్మణ్యం.

"నా డ్యూటీ నేను చేయకపోతే నాకు మాట
దక్కదు—" అన్నాడు భీమసేనుడు అతడిని అనుసరిస్తూ.

భీమసేనుడే స్వయంగా తలుపు తీశాడు.

ఇద్దరూ దొడ్లో ప్రవేశించారు.

చల్లని గాలి హాయిగా శరీరానికి తగిలింది.

"ఆహా—ప్రాణం లేచి వచ్చింది—" అన్నాడు
సుబ్రహ్మణ్యం.

"ప్రాణం లేచిపోతుందని భయపడిగదా—ఆ గదిలో
పడుకున్నది — నీతోపాటు సమంగా నేనూ అవస్థపడు
తున్నాను..." అన్నాడు భీమసేనుడు చిరాగ్గా.

దొడ్లో అంతా మడత మంచాలు వేసుకొని ఆదమరచి
నిద్రపోతున్నారు. ఆ గాలి, చల్లదనం అలాంటివి!

"మధ్య నీకేం అవస్థ? ఆ ఉక్కలో కూడా గుర్రు కొట్టి మరీ నిద్రపోతున్నావు—" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"కబుర్లు తర్వాత — త్వరగా లోనికిపోయి పడుకుందాం—" అంటూ భీమసేనుడు హెచ్చరించాడు.

సుబ్రహ్మణ్యానికి ఆ చల్లగాలిలో చాలా బాగుంది. అతడికి వెంటనే లోపలకు పోవాలని లేదు. అతడు భీమసేనుడికి రెండు వేళ్ళు చూపించి అక్కడ నూతిదగ్గరున్న గోలెంలో ఓ చెంబులో నీళ్ళు ముంచుకున్నాడు.

మరుగుదొడ్డి వీధి గోడనానుకొని వుంగి. అక్కడకు సుమారు యాభై గజాల దూరం వుంటుంది. భీమసేనుడు దొడ్డి గుమ్మంవరకూ సుబ్రహ్మణ్యాన్ని అనుసరించి ఆగిపోయాడు.

దొడ్డిలోపల కాస్త చీకటిగానే వుంది. దొడ్లోని చెట్టు ఒకటి బాగా విస్తరించి కొన్ని కొమ్మలు మరుగు దొడ్డిలోకి వాలడం మూలాన కాబోలు మరుగుదొడ్డి మరింత చీకటిగా వుంది. వెన్నెల ప్రభావం అక్కడ అక్కడ అట్టే కనబడ్డంలేదు.

సుబ్రహ్మణ్యానికి ఏ అవసరమూ లేదు. కాసేపు చల్ల గాలిలో ఉండాలన్నది అతడి కోరిక. అతడు నీళ్ళ చెంబును క్రిందపెట్టి తను మాత్రం నిలబడే వున్నాడు. గోడపక్కనే కదిలిన ఆకారాన్ని కూడా అతడు చూడలేదు.

ఆ ఆకారం అతడి వెనుకగా వచ్చింది. చటుక్కున అతడి నోరు మూసింది. అతడు పెనుగులాడుతుండగానే కత్తి సుబ్రహ్మణ్యం గుండెల్లోకి బలంగా దిగిపోయింది.

సుబ్రహ్మణ్యాం కొద్ది నిమిషాల్లో గిలగిలా తన్నుకున్నాడు. తర్వాత కప్పలా కూలిపోయాడు. రక్తం ఆగకుండా కారడంవల్ల అతడికి స్పృహ తప్పింది.

ఆకారం అతడి నలాగే వదిలి పెట్టింది. మెమ్మదిగా చేతులు జాపి గోడ ఎక్కి వీధిలోకి దూకింది.

ఎక్కడో కుక్క భౌమంది.

ఆకారం చకచకా వెళ్ళిపోయింది.

భీమసేనుడు సుబ్రహ్మణ్యం కోసం సుమారు అరగంట ఎదురుచూశాడు. తర్వాత పేరుపెట్టి పిలిచాడు. తర్వాత విసుగ్గా కేకేశాడు. ఆ తర్వాత అతడి గొంతులో అనుమానం ధ్వనించింది. తటపటాయిస్తూనే మరుగుదొడ్డిలో అడుగు పెట్టాడతను.

అప్పుడతను వేసిన కేకకు మొత్తం దొడ్లో పడుకున్న వారందరూ లేచిపోయారు.

• • •

"చాలా కాలానికి మా ఇంటికి వచ్చేవే—ఏమిటి విశేషం?" అంది లక్ష్మమ్మ—జాహ్నవిని ఆప్యాయంగా పలకరిస్తూ.

"బావ లేడా?" అంది జాహ్నవి.

"ఇంకా నిద్రలేవలేదు...." అంది లక్ష్మమ్మ.

జాహ్నవి వాచీ చూసుకొని—"అప్పుడే టైము పది కావస్తోంది. ఇంకా లేవకపోవడమేమిటి?" అంది.

"ఈమధ్య చాలారోజుల్నించి అలాగే వుంటున్నాడు. రాత్రిళ్ళు సరిగా నిద్రపట్టడం లేదుట.... ఇదివరకైతే తెల్లవారి అయిదయేసరికల్లా లేచిపోయేవాడు. ఇప్పుడు ఏడూ, యెనిమిదీనూ.... ఈ వేళ మరీ ఆలస్యంచేశాడు.." అంది లక్ష్మమ్మ.

అప్పుడే జాహ్నవి అలా వెడుతున్న మంగళనుచూసి-

"ఆ బురఖా మనిషెవరత్తయ్యా?" అంది.

లక్ష్మమ్మ క్లుప్తంగా ప్రతాప్ తమకు చెప్పిన కథను చెప్పి — "వాడు నీకీ విషయం చెప్పలేదా?" అంది ఆశ్చర్యంగా.

"మేం కలుసుకోవడమే తక్కువగా వుంది...." అని నిట్టూర్చింది జాహ్నవి. ఆమెకు మంగళను కలుసుకొని మాట్లాడాలని వుంది. ప్రతాప్ ఆమె సంగతి తనతో యెందుకు చెప్పలేదు! ఒకవేళ అతడామెను ప్రేమిస్తున్నాడా? లేక త్వరపడి ఆమెతో ఏదైనా తప్పు చేశాడా?

అదేనా—అతడి లోపం!

ఆమెనతడు ఏదో విధంగా వదుల్చుకోవాలనుకుంటున్నాడా?

అసలతడి ఉద్దేశ్యమేమిటి?

ఏ ప్రశ్నకు సమాధానం కావాలన్నా తానొకసారి ఆ మంగళతో మాట్లాడ్డం అవసరం. తెలివిగా ఆమె నుంచి సమాచారం లాగాలి తను....

జాహ్నవి మంగళ గదిలో ప్రవేశించింది.

మంగళ కాస్త ఇబ్బంది పడింది. ఆమె కంఠం విని— "తమాషాగా వుంది—" అనుకుంది జాహ్నవి.

"నీకూ ప్రతాప్‌కూ యెలాంటి పరిచయం?" అంది జాహ్నవి.

"నీకాయన తల్లి చెప్పలేదా?" అంది మంగళ.

"చెప్పింది. అది నేను నమ్మడంలేదు—"

"ఎందుకని?"

"ప్రతాప్ నా దగ్గర ఏదో రహస్యం దాస్తున్నాడు.

అతడు నాకు బావ. మా ఇద్దరికీ వివాహం కావలసివుంది. ఆ రహస్యం కారణంగా కుదరడంలేదు. ఆ రహస్యం నువ్వేనని ఇప్పుడు నాకు అనుమానం కల్గుతోంది—"

మంగళ ఆశ్చర్యంగా—"చాలా ఆశ్చర్యం—ప్రతాప్ నిన్ను కాదన్నాడా—" అంది.

"కాదనలేదు. తనలోని ఏదో ఒక లోపం కారణంగా నాతో వివాహం కుదరదన్నాడు. ఆ లోపమేమిటని అడిగితే రహస్యమంటాడు. నీ విషయం ఇంతవరకూ నాకు తెలియదు—" అంది జాహ్నవి.

"నాకూ ప్రతాప్‌కీ—నువ్వూహించేలాంటి సంబంధం లేదు. కొద్ది వారాల క్రితంవరకూ మాకు పరస్పర పరిచయం కూడా లేదు...."

"నమ్మమంటావు...." అంది జాహ్నవి. ఆమె లేచి వెళ్ళి తలుపులు వేసి మళ్ళీ కూర్చుంది.

"తలుపు లెందుకు వేశావు?" అంది మంగళ.

"నీ రూపం చూడాలని!"

"ఎందుకు?"

"ప్రతాప్ నీ ఉనికిని నాకు తెలియకుండా రహస్యంగా వుంచాడు. ఆ రహస్యానికి కారణం నీ ముఖంలో వుందేమో చూడాలని!"

"అపార్థం చేసుకోవద్దు. నా ముఖం ఎవ్వరికీ చూపించకూడదని నియమం...." అంది మంగళ.

"ఇదేం నియమం? ఆడవాళ్లు ఆడవాళ్ళ ముఖం చూడకూడదా? అందులో కూడా తప్పుంటుందా?" అంది జాహ్నవి.

"ఎవరిబ్బందులు వాళ్ళవి!" అంది మంగళ.

జాహ్నవి తనే తలుపులు తీసింది. అప్పుడే ఆమె

ప్రతాప్‌ని చూసింది. అతడు గదికి కాస్త దూరంలో వున్నాడు. కళ్ళు చూస్తూంటే రాత్రంతా నిద్రలేదనే అనిపిస్తుంది.

"అరే—జాహ్నవి!" అన్నాడతను.

"అవును — నేనే! నీకో శుభవార్త చెప్పడానికి వచ్చాను...."

"ఏమిటది?" ఆత్రుతగా అడిగాడు.

"సుబ్రహ్మణ్యం హత్య చేయబడ్డాడు...."

ప్రతాప్ ఆశ్చర్య పడతాడనుకుంది జాహ్నవి. అతడేమీ చలించకుండా—"ఓస్—ఇంతేనా? శుభవార్తంటే ఇంకా ఏమో అనుకున్నాను...." అన్నాడు.

"నీకు ఆశ్చర్యంగా లేదా?"

"నేనాశ్చర్యపడితే నీకు సంతోషం కలుగుతుందంటే తప్పకుండా ఆశ్చర్యపడతాను...." అన్నాడు ప్రతాప్.

జాహ్నవి ఆ విషయం వదిలి—"బురఖా అమ్మాయి సంగతి నాకు చెప్పలేదేం?" అంది.

"చెప్పడానికేముంది? వచ్చింది—ఆశ్రయం కోరింది. ఉంటోంది.... నీకు ప్రత్యేకంగా ఏం చెప్పను? ఈ పున్నమి వెళ్ళిన అమావాస్య తర్వాత మనం పూర్తిగా ఒకరికొకరం రహస్యాలు చెప్పుకుందాం...." అన్నాడు ప్రతాప్ ఆ విషయాన్ని తేలికగా తీసిపారేస్తూ.

"ఏమిటా రోజులోని ప్రత్యేకత!" అంది జాహ్నవి కుతూహలంగా. అప్పటికతడీ బురఖా అమ్మాయిని వదిలించుకోగల్గుతాడా?

"అది నువ్వడక్కూడదు—నేను చెప్పకూడదు—"

జాహ్నవి ఇంకేమీ అడగలేదు.

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతితోపాటు 5 నెలలు "సప్లిమెంట్" కూడా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో తమాషాలు

## ఎవరు ఎక్కువ త్రాగారు?

ఒక వర్ధమాన డిటెక్టివ్ తన నూతన అసిస్టెంటుతో కలసి ఒక బార్‌లోకి ప్రవేశించాడు. ఇద్దరూ ఒక టేబిల్ దగ్గరకు వెళ్ళి రెండు సీట్లలో కూర్చున్నారు.

డిటెక్టివ్ ధ్యాయానికి ఎదురు సీట్లలో కూర్చున్న ఇద్దరు అప్పుడే త్రాగడం పూర్తిచేసి లేచి బయటకు వెళ్ళి పోయారు.

మన డిటెక్టివ్ తన అసిస్టెంటువైపు తిరిగి, "డియర్ అసిస్టెంట్, నీ తెలివితేటలకు ఒక చిన్న పరీక్ష పెడు తున్నాను. ఇపుడు వెళ్ళిపోయిన వారిద్దరిలో ఒకడే బాగా ఎక్కువ తాగాడు. రెండోవాడు మామూలుగా తీసు కున్నాడు. బాగా త్రాగినవాణ్ణి ఎవరో గుర్తించు" అన్నాడు.

అసిస్టెంటు వారు కూర్చున్నవైపు పరీక్షగాచూస్తూ "మీ కెదురుగా కూర్చున్నవాడే బాగా త్రాగాడుసార్" అన్నాడు.

"గుడ్. అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలుగుతున్నావ్."

అసిస్టెంట్ నవ్వుతూ "సింపుల్ సార్! వారిద్దరూ కూర్చున్నవైపు చూడండి. మామూలుగా తీసుకున్నవాడు తాను తాగి పూర్తిచేసిన గ్లాసును మామూలుగానే వుంచాడు.

కానీ బాగా త్రాగినవాడు, తాను పూర్తిచేసిన గ్లాసును తల క్రిందులుగా బోర్లించి మరీ టేబులుమీద పెట్టాడు" అన్నాడు.

—కాకర్ల సుబ్రహ్మణ్యం, చీరాల.

## "అందాల పోటీ"

ఒక టాల్కమ్ సంస్థ పబ్లిసిటీకి అందాలపోటి నిర్వహించింది. జనంతో క్రిక్కిరిసిపోయి వున్నది హాలు.

పోటి కార్యక్రమాలు జరగవలసిన టైము కంటే ఎక్కువ టయమయింది. జనంలో సహనం, ఓర్పు నశించాయి.

తెర లేచింది. జనం గోల మాని ఆతృతతో స్టేజిమీద తమ దృష్టి నిలిపి తమ సీట్లలో నిశ్శబ్దంగా కూర్చున్నారు.

అయితే - ఆ నిశ్శబ్దం ఎంతోసేపు నిలువలేదు. జనం పెద్దగా గొడవ చెయ్యసాగారు. కారణం—స్టేజిమీద వున్న అమ్మాయిలు ఎవరుకూడా అందంగా వుండకపోవడమే।

వీరి గోల ఎందుకో అర్థం చేసుకున్నట్లు మైకులోనుండి మాటలు విన్పించాయి.

"మేము నిర్వహించిన యీ పోటీలో పాల్గొనవలసిన అందగత్తెలు, ఒక సినిమా కంపెనీవారు అందమైన కొత్త ముఖాలు కావాలంటె అక్కడికి పరుగెత్తారు. ఆ కారణాన వచ్చిన వారికే అందాలపోటి నిర్వహించసాగాము. జనం మాతో సహకరిస్తారని ఆశిస్తూన్నాం...."

—మూసాజీ, కాకినాడ-2.

---

